# ఉక్కు పాదం

(రెండవ భాగం)

జాక్ లండన్



అనువాదం :

"ధనకుధరం"



'నగారా' ప్రచురణాలయం,

గుంటూరు-1.

# ౧౧

మిస్టర్ విక్సన్ నాన్నకోసం కబురుచేయలేదు. శాన్‌ఫ్రాన్సిస్కోకు పోయే బోటుమీద వాళ్ళిద్దరూ అనుకోకుండా కలుసుకొన్నారు. ఆయన నాన్నకు చేసిన హెచ్చరిక ముందుగా ఆలోచించి పన్నినకుట్రగాదని తేలింది. కాకతాళీయంగా వాళ్ళిద్దరూ కలుసుకోని ఉండకపోతే హెచ్చరికే ఉండేదికాదు. కలుసుకొన్నా కలుసుకోకపోయినా పర్యవసానం మరో రకంగా ఉంటుందని కాదనుకోండి! నాన్న విజ్ఞాన అహంభావంగల కోవకు సంబంధించినవాడు. ఆయన్లో రాజసం ఉంది.

"ఎర్నెస్టు చెప్పింది నిజమే. ఎర్నెస్టు అసాధారణ యువకుడు. రాక్‌ఫెల్లర్‌కో, ఇంగ్లండు చక్రవర్తికో సహధర్మచారిణివి కావడంకన్నా, ఆయన అర్ధాంగలక్ష్మివి కావడానికే నేను ప్రయత్నిస్తా." అని ఇంటికి వచ్చీరావడంతోనే నాన్న నాతో అన్నాడు.

"అసలు విషయం ఏమిటి?" అని సంభ్రమంతో అడిగా.

"అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం మన మొగాల మీదగా నడవడానికి సిద్ధమౌతోంది. నీ మొగంమీదా, నా మొగంమీదకూడా. ఇట్లాఅని విక్సన్ నాతో చెప్పాడు. నిరంకుశ ప్రభుత్వంలోనివాళ్ళల్లోకి అతడు కొంచం దయగలవాడు. నన్ను విశ్వవిద్యాలయంలో పునఃప్రతిష్ఠితంచేస్తాననిఅన్నాడు. దాన్నిగూర్చి నీవేం అభిప్రాయపడ్తున్నావ్? డబ్బుకోసం ఎంత నీచానికైనా పాల్పడే ఆ విక్సన్‌కు, నేను ప్రభుత్వవిశ్వవిద్యాలయంలో బోధించవచ్చా లేదా అని నిర్ణయించే అధికారం ఉందన్నమాట! కానీ, అతడు నాకింతకన్నా మరో మంచి ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు. క్రొత్తగా స్థాపిద్దామనుకొంటున్న పెద్ద భౌతికశాస్త్రకళాశాలలో అధ్యక్షపీఠం అలంకరించ

మన్నాడు. అల్పసంఖ్యాక నిరంకుశపరిభుత్వం ఏదో విధంగా తనకున్న అత్యధిక శేషాన్ని పీడవదిలించుకోవాలిగదూ మరి.''

"మీకుమార్తె ప్రియుడైన ఆ సోషలిష్టువ్యక్తితో నేను ఏమిచెప్పానో జ్ఞాపకం ఉందా? కార్మికుల మొగాలమీదుగా తొక్కుకుంటూపోతాం అనిచెప్పా. మేం అదే చేస్తాం. మరి మీ విషయమంటే, విజ్ఞానశాస్త్రవేత్త లుగా మీ మీద నాకు అపరిమిత గౌరవం ఉంది. కానీ, మీరూ కార్మికుల్లో కలిసిపోతామంటూరా – మంచిదే – మీ మొగాలు కాపాడుకోండి! అంతే' అని అతడు నాతోచెప్పి గిరునతిరిగి వెళ్ళిపోయాడు."

ఎర్నెస్టుతో మేమీ విషయం చెప్పినప్పుడు, " అంటే, మీరనుకొన్న దానికన్నా మేం తొందరలో పెండ్లిచేసుకోవాలన్న మాట," అని వ్యాఖ్యానించాడు.

ఆయన హేతువాదన నాకు అర్థంకాలేదు. కానీ ఆయన చెప్పిన మాటల్లోని అంతరార్థం త్వరలోనే అవగతమైంది. సియెరామిల్సు త్రైమాసిక లాభాలను ఇప్పటికి పంచిపెట్టేవారు, లేకపోతే ఆ సమయమైనా వచ్చింది. ఎందుకంటే, నాన్నకు రావాల్సిన భాగం ఇంతవరకూ ముట్టలేదు. ఇంకా ఇస్తారు ఇంకా ఇస్తారు అని చాలరోజులు ఎదురుచూచి చివరకు నాన్న మిల్సు కార్యదర్శికి ఒక ఉత్తరం వ్రాశాడు. నాన్నకు సంబంధించిన సరుకు ఉన్నట్లుగా పుస్తకాలల్లో రసీదు దాఖలా కనబడడంలేదనీ, ఇంకా స్పష్టమైన సమాచారం పంపించవలసిందిగా విజ్ఞప్తిచేస్తున్నాననీ అక్కడనుంచి వెంటనే సమాధానం వచ్చింది.

"అతడికి బాగాఅర్థమయ్యేటట్లు చేస్తాలే! వాడి అంతు కనుక్కొనూ!" అని తగాదాలోపడ్డ తన సరుకును సేఫ్ డిపాజిట్టు పెట్టెలోనుంచి తీసుకు రావడానికి నాన్న బ్యాంకుకు వెళ్ళాడు.

“ఎర్నెస్టు అసాధారణమైన వ్యక్తి” అని బ్యాంకునుంచి తిరిగివచ్చిన మా నాన్న ఓవర్‌కోటును నేను ఊడదీస్తుండగా ఆయన నాతో అన్నాడు. “అమ్మాయ్! నీ ప్రియుడైన ఆ కుర్రాడున్నాడే, అసాధారణవ్యక్తి అని మళ్ళీ అంటున్నా.”

ఈ విధంగా నాన్న ఎర్నెస్టును శ్లాఘిస్తున్నాడంటే, ఏదో పుట్టి మునగబోతోందని నాకు తెలుసు.

“అప్పుడే వాళ్ళు నా మొగంమీదగా నడిచివెళ్లారు. అక్కడ సరుకు లేదు. పెట్టె ఖాళీ. నీవూ, ఎర్నెస్టూ చాలా తొందర్లో వివాహం చేసుకోవాలి.” అని నాన్న విశదీకరించాడు.

ఇప్పటికీ పరిశోధనాగార విధానాల్నే అనుసరించాడు నాన్న. ఆయన సియెరా మిల్సునైతే కోర్టుకీడ్చాడుగానీ, దాని లెక్కల పుస్తకాల్ని మాత్రం కోర్టుకు తెప్పించలేకపోయాడు. ఆయన న్యాయస్థానాన్ని అదుపులో పెట్టుకోలే: పోయాడు. ఆ పని సియెరా మిల్సు చేసింది. అదే అంతా తేల్చి చెప్పింది. న్యాయస్థానచట్టం ఆయన్ని అణగద్రొక్కి పట్టపగటి నిలువు దోపిడీకి పట్టాభిషేకం చేసింది.

నాన్న దెబ్బతిన్న విధానాన్ని మళ్ళీ ఒక్కసారి నెమరుకు తెచ్చుకుంటే, ఇప్పుడు నిజంగా పరిహాసాపాత్రంగా కనబడుతోంది. శాన్‌ఫ్రాన్సిస్కో వీధిలో విక్సన్ తటస్థపడితే, నాన్న అతణ్ని, దుర్మార్గమ్ముండాకొడుకా! అని తిట్టాడు. మీదబడి కొట్టడానికి ప్రయత్నించాడని నాన్నను అరెస్టుచేసి, పోలీసు కోర్టులో జరిమానా వేసి, శాంతి సంరక్షణకోసం ఆయన దగ్గర్నుంచి జామీను తీసుకొన్నారు. ఇంటికి తిరిగివచ్చిన తరువాత నాన్న తనను గురించి తానే నవ్వుకొనేటంత పరిహాసాస్పదంగా ఉంది ఆ సంఘటన. కానీ, స్థానికపత్రికల్లో ఎంత గంద్రగోళం లేవదీశారనుకున్నారు! సోషలిజంలో చేరినవాళ్ళందరికీ జరిగిన హింసా ప్రతిఫలాన్ని గూర్చి ప్రజ

లంతా గుబ్బట్లుగా చెప్పుకొంటున్నారు. చిరజీవితానుభవంతో, ప్రశాంత కాలక్షేపంచేస్తున్న నాన్న, భయానకంగా విజృంభించిన హింసావిధానానికి మంచితార్కాణమైనాడు. శాస్త్రాధ్యయనపరిశ్రమవల్ల నాన్నమనస్సుపూర్తిగా దెబ్బతిన్నదనీ, అందుకని ప్రభుత్వపు వైద్యశాలలో ఆయన్ను కొంతకాలం ఉంచి, ఉన్మాదచికిత్స చేయించడం కర్తవ్యమనీ చాలాపత్రికలు సూచించినై. కేవలం మాటలహడావుడే కాదు అదంతా. అది రాబోయే భయంకరప్రమాదం. కానీ, దాన్ని నాన్న గుర్తించాడు. ఆయనకు గుణపాఠంగా బిషప్ అనుభవం ఒకటుంది. దాన్నుంచి గుణపాఠం నేర్చుకున్నాడుకూడా. ఆయన తనమీద అక్రమం ఎంతగా విరుచుకుపడ్డా ప్రశాంతంగా ఊరుకున్నాడు. దీనివల్ల ఆయన నిజంగా తన శత్రువుల్ని ఆశ్చర్యచకితుల్ని చేశాడని భావిస్తున్నా.

మా ఇంటి సంగతి ఒకటుంది. తాకట్టుపెట్టుకొన్న వాళ్ళు స్వాధీనం చేసుకొని దాన్ని అమ్మజూస్తున్నారు. ఆ యింటిని, మేం వాళ్ళకు స్వాధీనం చేయాల్సి వచ్చింది. దానిమీద తాకట్టు అంటూ ఏమీ లేదనుకోండి! ఇంటి స్థలాన్ని డబ్బిచ్చి సర్వహక్కుల్తో కొన్నాం. ఇల్లు కట్టినతరువాత దానికైన డబ్బు చుస్తాగా చెల్లించేశాం. ఇంటిమీదగాని, స్థలంమీదగాని ఏ విధమైన తాకట్లూలేవు. ఐనా కొన్ని సంవత్సరాలుగా చెల్లించిన వడ్డీ బాపతు సక్రమంగా వ్రాసి దస్కత్తుచేసిన తాకట్టు ఒకటి అమలులో ఉంది. నాన్న పల్లెత్తుమాటకూడా అనలేదు. ఆయన డబ్బును దోపిడీచేసినట్లే, ఇంటినీ దోచుకున్నారు. ఆయనకు అన్యథా శరణంనాస్తి. ఆయన్ను నాశనం చేయడానికి తలబడ్డ పెద్దమనుష్యుల చేతుల్లో సమాజయంత్రం ఉంది. ఆయన పరిణీత తాత్వికుడు కావడంచేత ఏమాత్రం కోపంగూడా లేకుండా పోయింది.

“నేను నాశనమైపోయే దుర్దశ బట్టింది. కానీ అందుకని వీలైనంత తక్కువ నాశనమయ్యేటట్లు నేను ప్రయత్నించకూడదన్న కారణంకాదనుకో.

ఈ నా ముసలి ఎముకలు సులభంగా విరిగిపోతయ్. నేను నా గుణపాఠం నేర్చుకొన్నా. నా అంతిమ దినాలు పిచ్చి ఆసుపత్రిలో వెళ్లదీయడం నా అభిమతం కాదన్న విషయం దైవానికి తెలుసు." అన్నాడు నాన్న నాతో.

నాన్న మాటలు వింటుంటే, చాలా పుటలవరకూ మళ్ళీ ఏవిధమైన ప్రస్తావనా తీసుకురాకుండా వదిలిపెట్టిన బిషప్ మూర్‌హౌస్ గుర్తుకు వచ్చాడు. కానీ, నా వివాహ విషయం మొదట చెప్పనీయండి. నా వివాహ సంఘటన, పరిస్థితుల పరిణామ ప్రవాహంలో అప్రాధాన్యమై అట్టడుగున కొట్టుకుపోతుందని నాకు తెలుసు. అందుకే ఆ విషయాన్ని కేవలం స్పృశించి వదిలిపెట్టా.

"ఇక ఇప్పుడు మనం నిజమైన శ్రామికులం కావాలి. నీ యువ ప్రియుడికి శ్రామికుల్ని గూర్చి ఉన్న యథార్థ జ్ఞానానికి, చాలాసార్లు అసూయపడ్డా. ఇప్పుడు నేను ఆ విజ్ఞానాన్ని స్వానుభవపూర్వకంగా గ్రహించాలి." అని, ఇంటినుంచి మేం వెళ్ళగొట్టబడ్డ తర్వాత, నాన్న నాతో అన్నాడు.

నాన్నలో సాహసరక్తం ఎక్కువ దృఢంగా ఉండి ఉండాలి. మా ఈ మహోపద్రవాన్ని ఆయన సాహసకృత్యంగా పరిగ్రహించాడు. ఆయన్లో ఏ కోశానా క్రోధద్వేషాలు లేవు. ప్రత్యపకారం చేయగూడదనేటంతగా ఆయన నిరాడంబర తాత్త్విక దర్శనంతో ఉన్నాడు. మేం నీళ్ళు వదులుకొంటున్న జీవితావసర సౌఖ్యాలుగూడా గుర్తించలేని ఊహా ప్రపంచంలో ఉన్నాడు. మా తట్టాబుట్టా సర్దుకొని, శాన్‌ఫ్రాన్సిస్కోలో సంతవీధికి దక్షిణంగా ఉన్న మురికిపేటలోని డోకుపుట్టించే నాల్గు గదుల్లోకి సంసారం మార్చినప్పుడు, మా నాన్న, సమ్యగ్దర్శనంతో, అసాధారణ మనీషతో సమ్మిళితమైన ఆ సాహసానికి, బాలుడిలో ఉండే ఆనందోత్సాహాల్తో నడుం కట్టి నిల్చాడు. ఈ విపత్కర సమయంలోకూడా ఆయన నిజంగా, తన చైతన్యాన్ని కోల్పోలేదు.

జీవితపు విలువల్ని గూర్చి ఆయనకు ఎన్నడూ అపోహలేదు. సాంప్రదాయసిద్ధమైన విషయాల్ని గాని, అభ్యాసయుక్తమైన విషయాల్ని గాని లక్ష్యపెట్టడు. ఆయన గౌరవించేది గణితవిజ్ఞానశాస్త్రాల సత్యవిషయాల్నే. నాన్న చాల గొప్పవాడు. మహాపురుషులకుమాత్రమే ఉండే మనస్సూ, హృదయం కలవాడాయన. ఏ ఎర్నెస్టుతో మించిన వ్యక్తిలేడని నేను విశ్వసించానో, ఆ ఎర్నెస్టుకన్నా మా నాన్నే కొన్ని మార్గాల్లో అధికుడు.

మా జీవితవిధానం మారడంలో నాకు కొంత మనశ్శాంతి లభించింది. ఈ మార్పువల్ల మరేం లాభం కనుపించకపోయినా, అప్పుడే తలెత్తుతున్న అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వంతో మాకు విరోధం సంభవించినప్పటినుంచి ఆ విశ్వవిద్యాలయ నగరంలో గూఢుపుఠాణిచేసి మమ్మల్ని విడదొరికొట్టాలని పన్నిన పద్మవ్యూహంనుంచి తప్పించుకొంటున్నామన్న ఊరటైనా కలిగింది. ఆ యీ మార్పు నాకొక సాహసకృత్యంగా తోచింది. అన్నిటికన్నా గొప్ప విషయమేమిటంటే, అదొక పరిణయసాహసకృత్యం. మా పరిస్థితుల్లో ఏర్పడ్డ ఒడుదుడుకులు నా వివాహాన్ని నెట్టుకువచ్చినై. శాన్‌ఫ్రాన్సిస్కో మురికి పేటల్లో, సెల్ వీధిలో ఉన్న నాల్గు గదుల్లోకి, నేనొక గృహిణిగా నివసించడానికి వచ్చా.

అన్నిటికన్నా మిగిలింది ఇది. ఎర్నెస్టు జీవితానికి కొన్నెలలైనా. ఆయన తుఫానుజీవితానికి క్రొత్తగా ఏర్పడ్డ సంకటాన్నిగాదు. ఆయన జీవిత ప్రశాంతతను. సంతృప్తిని. హాయిని. ఆయనకు ఆనందాన్ని కలిగించేందుకు సర్వకాల సర్వావస్థల్లో చేదోడు వాదోడుగా ఉన్నా. అలసిసొలసిపోయిన ఆయన నేత్రాలకు, కష్టవిస్మృతినిగానీ ఆనందజ్యోత్స్నను గానీ ప్రసాదించడంకన్నా ఆనందాన్నిచ్చే మరో అదృష్టం నాకేముంది?

అలసిన ఆ ప్రియమైన నేత్రాలు! జగత్తులో ఏకొద్దిమందో పరిశ్రమించేటట్లుగా పరిశ్రమించాడు. జీవితమంతా పరులకోసమే పరిశ్రమించాడు.

ఆయన మానవత్వపు కొలబద్ద అది. మానవత్వాన్ని ప్రేమించే ఉదాత్తమానవు డాయన. రణరంగోత్సాహదీప్తితో, మల్లయుద్ధోచిత శరీరంతో, నిశితదృక్ప థంతో నా పాలిటికి ఆయన కరుణార్ద్రుడైన ఒక మహాకవి. నిజానికి కవి కూడా. ఆయన కృషి ఒక మధురగానం. జీవితాంతం మానవగీతాలాపన చేశాడు. మానవుడిమీదఉన్న కేవల అనురాగంవల్లనే అదిచేశాడు. మానవుడి కోసమే ఆత్మబలిదానం చేశాడు. అందుకే ఆయన్ను సిలువవేశారు.

భవిష్యత్తులో తనకేదో పట్టాభిషేకం జరుగుతుందన్న ఆశతో ఆయన ఇదంతా చేయలేదు. ఆయన దృక్పథంలో భవిష్యజ్జన్మే లేదు. అమరతేజ స్సుతో ప్రకాశించిన ఆ వ్యక్తి తాను అమరత్వాన్ని కాంక్షించలేదు. ఆయ నలోఉన్న క్లిష్టత అది. ఉత్సాహప్రదీప్తుడైన ఆయన, దుర్గమమైన ప్రకృతే ఏకైకమన్న భౌతికతత్వానికి లొంగిపోయాడు. ఆయన ఆధ్యాత్మిక అంబర విహారాన్నిబట్టి ఆయన అమరత్వాన్ని అంచనావేస్తున్నాననీ, ఆయన సత్తాని పూర్తి అంచనావేయడానికి నేను అనంతకాలం జీవించాలనీచెప్పి, ఆయన దృక్పథాన్ని నేను నిరాకరిస్తా. అప్పుడాయన నవ్వుతాడు. వెంటనే ప్రేమతో నన్ను ఆలింగనంచేసుకొంటాడు. నన్ను తన 'మధురఆధ్యాత్మిక వాదిని' అని పిలుస్తాడు. ఇక ఆయన కళ్ళల్లో ఉన్న అలసట అదృశ్యమై పోతుంది. ఆ కళ్ళల్లో ప్రణయతేజోప్రవాహం పరుగులు తీస్తుంది. ఆయన అమరత్వాన్ని ఋజువుచేయడానికి ఈ తేజస్సు సర్వసమర్థమైన ప్రకటన.

నన్ను ద్వైతవాదిని అని పిలిచేవాడు. దైవారాధనకోసమని, కాంట్, కేవల హేతువాదంతో హేతువాదాన్ని ఎట్లా నాశనం చేశాడో విశదీకరి స్తుండేవాడు. కాంట్ సిద్ధాంతాలకూ, నా ఊహలకూ సామ్యంలాగి, అటువంటి తప్పే చేస్తున్న దోషులాలుగా నన్ను జమకట్టాడు. దోషాన్ని అంగీకరించి, నేను చేస్తున్నపని సహేతుకమైందేనని సమర్థించుకున్నప్పుడు, నన్ను గాఢంగా హత్తుకొని, కేవల తాదాత్మ్యస్థితిపొందిన భాగవతులు

నవ్వినట్లు నవ్వేవాడు. సర్వవిషయ పరిశోధనా సమగ్రమైన విజ్ఞాన శాస్త్రంతో, అవాఙ్మానసగోచరమైన జీవాత్మను విశదీకరించబూనుకోవడం ఎంత నిష్ఫలమో, అట్లాగే; పరిసర, వంశపారంపర్య ప్రభావాల్తో ఆయన ప్రతిభా వ్యుత్పత్తుల్ని అర్థంచేసుకోబూనడంకూడా నిరుపయోగమైన శ్రమ అని చెబుతుండేదాన్ని.

'భ్రాంతిమూలం ఇదం జగత్' అనీ 'జీవాత్మ పరమాత్మ ప్రతిబింబ మనీ' నేను అభిప్రాయపడేదాన్ని. నన్ను ఆయన 'మధుర ఆధ్యాత్మిక వాదిని' అని పిలుస్తే, నేను ఆయన్ను 'అమర భౌతికవాది' అనేదాన్ని. మేం పరస్పరం ప్రేమించుకొంటూ సుఖజీవయాత్ర సాగించాం. ప్రతిఫలాపేక్ష రహితంగా, మానవ కళ్యాణంకోసం పరిశ్రమిస్తున్నప్పటికీ, దానివల్ల తనకు ఆత్మోన్నతి కలుగుతుందనే భావన లేనందువల్లా, తన శక్తినిగురించి అహంభావం కలగనంత నమ్రత కలిగినందువల్లా, ఆయన భౌతికవాదాన్ని నేను సహించా.

ఐనా ఆయనకు గర్వంలేదని చెప్పలేం. అంత ఉన్నతపథాన్ని అందుకోనిగూడా గర్వంలేకుండా ఎట్లా ఉంటాడు? నశ్వరమైన, బుద్బుద ప్రాయమైన వ్యక్తి తాను దైవంగా భావించడమే, దైవం దైవంగా భావించడం కన్నా రమణీయమైందని ఆయన వాదన. అందుకే ఆయన మానవత్వాన్ని అంత ఉన్నతస్థాయికి తీసుకుపోయాడు. ఒక పద్యభాగంలోంచి కొన్ని భాగాలను ఉదహరించడం ఆయనకు బాగా యిష్టం. మొత్తం పద్యాన్ని ఆయనెప్పుడూ చూడలేదు. ఆ పద్యకర్తను తెలుసుకోడానికి చాలా ప్రయత్నం చేశాడుగాని ఫలితం కనబడలేదు. ఆ పద్యఖండాన్ని ఇక్కడ ఉదహరిస్తున్నా. ఆయన దాన్ని అత్యంతంగా ప్రేమించినందుకే గాదు, నేను ఉదహరిస్తున్నది. ఆయన మానసికోత్సాహంలో ఉన్న విశిష్టత, ఆయన దృక్పథ సారాంశం, ఇందులో ప్రతిబింబించినందువల్లకూడా. ఎందు

కంటే, మానవుడు హృదయాన్ని కంపింపజేసే ఉద్వేగపూర్వకమైన మహో దాత్తస్వరంతో ఈ పద్య ఖండాన్ని గానంచేసి, క్షణభంగురమైన, నశ్వర మైన వ్యక్తిగా ఎట్లా ఉండగలడు? ఇదుగో ఆ పద్యఖండం—

సంతసమ్మున ఓలలాడుచు
సాగిపోదును జయపరంపర
సహజముగనే తరతరాలుగ
సంక్రమించిన జన్మహక్కది.

అంతమెరుగని జీవితపు వా
సంతదినముల సౌరభమ్ము ను
తింతు ఉచ్చైస్స్వరముతోడ ది
గంతముల్ పది మారుమోగ్రియగ.

మానవుండెన్ని విధముల మరణములను
తాను పొందగాగల్గునో; వాని నెల్ల
అపరిమేయమ్ము కాలమ్మునందు నేను
అనుభవించితి చిరముగా; నైనగాని,

గర్వఫేన పరీవృత మ్మధి
కార మధురాస్వాదపూర్ణ ము
కామినీ అధరామృతార్ద్రము
కాంతిమంతము కనక కలశము
కరయుగమ్ములబట్టి, నాలుగు
కాలములలో ప్రతియుగమ్మున

కరువుదీరగ త్రాగినాడ న
ఖండ బ్రహ్మానంద మధువును.

అంత తీయని మధువుపైగల
ఆశ చావక, జానుతలమున
అక్కడక్కడ పడిన బిందువు
లమిత మమతను చప్పరించితి.

స్వాగతమ్మో జీవితమ్మా!
స్వాగతమ్మో మృత్యుదేవత!
అనుచు పెదవుల చప్పరించుచు
ఆలపించెద హంసగీతిక.

'నేను' చచ్చిన వేరొకండగు
'నేను' నిలబడి, కరయుగమ్ముల
పూని మధుపూర్ణాచ్ఛకలశము
తాను త్రాగును యుగయుగమ్ములు.

పుడమి తొలిచూలు కాన్పుగా పుట్టి, దేవ!
సహజ విషయలోలత ఫలాస్వాదరక్తి
నీ నిషేధాజ్ఞలెల్ల తృణీకరించి,
నాడు తప్పుడెనట్టి మానవుడనేను!

చిమ్మచీకటు లావరించి, జ
గమ్ము సర్వము జలమయమ్మయి

కరిమ్ముకొని ప్రళయమ్మై వచ్చిన
ఇమ్మహిని విడనాడ నెన్నడు.

నూతనమ్ముగ 'నేను' పుట్టిన
రోజు మొదలుగ, మరల జనని ప
విత్రి గర్భము చేరుదాకను
అనుభవించిన కష్టసుఖముల
కాటపట్టయినట్టి జగమిది.

పుట్టబోయెడి జాతిలక్షణ
పూర్ణ చిహ్నుడ; నరనరమ్ముల
పరుగుతీసెడి లోకవాంఛల
పరిభవమందిన మానవుండను.

పొంగి పొరలెడి యువకరక్తత
రంగిణీ పృథువీచిజాలము,
ఆవరించిన పరిశయకీలల
ఆర్పివేయును మూలముట్టుగ.

జననమందిన క్షణము మొదలుగ
చచ్చిపోయెడి గడియవరకును
మానవుడనే! మానవుడనే!!
మానవుడ!!! నిస్సంశయమ్ముగ.

నాను పాలిణ పాలిణమియ్యది
జగము సర్వము; నా మనోరథ

మనుసరించి క్షణక్షణమ్మును
కల్పకమ్మయి వేచియున్నది.

జగతిపుట్టిన తొలిదినమ్ముల
తృష్ణతీరని వాంఛితమ్ములు
తృప్తిదీరగ తీర్చుకొందును
అడ్డులేదిక నాకు దేవా!

మధుర మధురము జీవితామృత
మానెదను తుదిచుక్కదాకను,
నాడు, తీయని కలల వెలుగున
విచ్చిపోవును, చిమ్మచీకటి.

పుడమి తొలిచూలు కాన్పుగా పుట్టి దేవ!
సహజ విషయలోలత ఫలాస్వాదరక్తి
నీ నిషేధాజ్ఞ లెల్ల తృణీకరించి,
నాడు శప్తుడై నట్టి మానవుడనేనె!

చిమ్మచీకటు లావరించి జ
గమ్మ సర్వము జలమయమ్మయి,
కల్మికొని ప్రళయమ్మువచ్చిన
ఇమ్మహిని విడనాడనెన్నడు.

నూతనమ్ముగ 'నేను' పుట్టిన
రోజు మొదలుగ, మరల జనని ప

ఉక్కు పాదం.

పిత్రి గర్భముచేరుదాకను
అనుభవించిన కష్టసుఖముల
కాటపట్టయినట్టి జగమిది.

ఎర్నెస్టు ఎప్పుడూ అతి పరిశ్రమ చేసేవాడు. అత్యద్భుతమైన ఆయన శరీర తత్త్వం ఆయన్ను రోగం, నొప్పి లేకుండా చేసింది. ఐనప్పటికీ శరీర తత్త్వం ఆయన కళ్ళల్లో అలసటను తొలగించలేక పోయింది. అలసిన ప్రియమైన ఆయన నేత్రాలు! రాత్రిళ్లెన్నడూ ఆయన నాల్గున్నర గంటలకన్నా ఎక్కువ నిద్ర పోలేదు. ఐనా చేయదలచుకున్న పనంతా చేయడానికి కాలం సరిపోయేది కాదు. ప్రచారకోద్యమంలో ఎన్నడూ ప్రాలుమాలలేదు. కార్మిక సంస్థల్లో ఇచ్చే ఉపన్యాసాలు చాలా ముందుగానే తయారుచేసుకొని సర్వసిద్ధంగా ఉండేవాడు. ఇదంతా గాక ప్రచారోద్యమం ఒకటి ఉండనే ఉందిగదా! ఆ ఉద్యమంలోనే ఒకమనిషి చేయకలిగినంత పనీ చేసేవాడు. సోషలిస్టు ప్రచురణ సంస్థలు అణగారిపోవడంతో ఇంతకుముందువచ్చే కొద్దిపాటి రాయల్టీలుకూడా రాకుండపోయినై. బ్రతుకుబండి దొర్లించుకు పోవడం మహాభారమైంది. ఎందుకంటే, ఆయన చేసే తక్కిన పరిశ్రమకుతోడు, జీవనోపాధికోసంకూడా ప్రయత్నించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. శాస్త్రీయ, వైదాంతిక విషయాలను పత్రికలకు బోలెడన్ని అనువాదంచేసి పంపుతూండేవాడు. మహోద్యమకృషిలో బాగా అలసిపోయి రాత్రిళ్ళు చాలా ప్రొద్దుబోయి ఇంటికి చేరుకొనేవాడు. అప్పుడు వచ్చినవాడు, మళ్ళీ అనువాద కార్యక్రమంలో నిమగ్నుడై భళ్ళున తెల్లవారేదాకా పరిశ్రమించేవాడు. ఈ కృషి అంతాగాక పైగా ఆయన చదువు ఒకటుంది. ఆఖరి నిశ్వాసం వదిలేంతవరకూ గ్రంథాధ్యయనం మానలేదు. ఆయనకుగల గ్రంథపఠన తృష్ణ అద్భుతం.

ఇన్నివిధాలుగా సతమతమౌతున్నా, నన్ను ప్రేమించి ఆనందపరవశురాలిగాచేయడానికి ఎట్లాగో కొంచెం సమయం చేజిక్కించుకొనేవాడు. ఈ

ప్రణయవిహారంవల్ల ఆయన జీవితంలో నా జీవితం మమేకమైపోయింది. షార్ట్ హాండ్, టైపురైటింగూ నేర్చుకొని ఆయన కార్యదర్శినిని అయినా. ఆయన కృషిలో సగంభారం తగ్గించేశానని పదేపదే అంటుండేవాడు. ఈ విధంగా ఆయన కృషిని అర్థంచేసుకోడానికి తర్ఫీదుపొందా. మా ఉభయుల అభిరుచులూ ఒక్కటైనై. ఇద్దరం పరిశ్రమించాం. కలిసి ఆడుకొన్నాం. పాడుకొన్నాం.

అవిగామమైన మా కృషిసమయంలోనే కొన్ని మధుర క్షణాల్ని, ప్రణయ సంభాషణకో, ఆలింగనానికో, ప్రేమకలాపానికో వినియోగించుకొనేవాళ్ళం. ఉన్న కాలంలోనుంచే కొన్ని క్షణాల్ని మేం మా యీ ప్రణయకలాపంకోసం వినియోగించుకొన్నందున అవి మధురాతి మధురాలుగా ఉండేవి. స్వార్థం, సంకుచితత్వం అడుగుపెట్టడానికి అవకాశంలేని మానవత్వం కోసమే పరిక్రమించే మహోన్నతపథాల్లో మేం విహరిస్తూండేవాళ్ళం. అక్కడ పరిశుభ్రమూ, దీప్తిమంతమూ ఐన వాతావరణంలో మేం అనురాగాన్ని ప్రేమించాం. ఉదాత్తస్థాయినిపొందనిది ఏదీవచ్చి మా అనురాగాన్ని కలుషితం చేయలేదు. అన్నిటికన్నా మిగిలింది ఇది. ఆయనకు ఏ లోటూ రానీయలేదు. పరుల శ్రేయస్సుకోసం దీక్షతోపాటుబడే, అలసట చెందిన కళ్ళుగల ఆ నా ప్రియమానవుడికి హాయిని చేకూర్చా.

## ౧౨

నా వివాహానంతరంగాని బిషప్ మూర్‌హౌస్‌ను కలుసుకోవడం తటస్థపడలేదు. జరిగిన విషయాలన్నీ ఒక క్రమంలో మీకు తెలియజేస్తా. I. P. H. సమావేశంలో విడిపోయిన తర్వాత, వస్తుతా మెత్తనివాడు కావడంవల్ల, తనమీదకు స్నేహాకీత్యా తీసుకువచ్చిన వత్తిడికి లొంగిపోయి, బిషప్ శెలవును అంగీకరించాడు. కానీ, చర్చి సందేశాన్ని బోధించడానికి ఆయన ఇంతకుముందుకన్నా దృఢసంకల్పంతో విశ్రాంతినుంచి తిరిగివచ్చాడు.

చర్చి సమావేశంలో ఆయన ప్రథమంగా ఇచ్చిన సందేశం, ఇంతకుముందు తానుచేసిన ప్రసంగంలాగానే శ్రోతల్ని విభ్రాంతుల్ని చేసింది. ప్రభు ఉపదేశాన్నుంచి చర్చి చాలాదూరంగా వెళ్ళిపోయిందనీ, క్రీస్తుస్థానంలో ధన దేవతారాధన జరుగుతోందనీ, చాలాసేపు మానసికావేదనతో మళ్ళీ చెప్పాడు.

దీనికి ప్రతిఫలం! ఇష్టంఉన్నా లేకపోయినా, మానసికవ్యాధి ఏర్పడిందని ఆయన్ను ప్రత్యేక ఉన్మాద చికిత్సాలయానికి తీసుకువెళ్ళారు. చదివే వాళ్ళకు గుండెలు కరిగేటట్లుగా పాపం ఆయనకు మనస్సు పూర్తిగా చెడిపోయిందనీ, ఆయన మహాపవిత్రమూర్తి అనీ పత్రికల్లో వార్తలు వచ్చినై. చికిత్సాలయంలో ఆయన్ను ఖైదీ చేశారు. ఆయన్ను చూడడానికి నేను అనేక పర్యాయాలు అనుమతికోసం ప్రయత్నించా. ఆయన్ను చూడడానికి అనుమతి నిరాకరించబడింది. నిర్మల మనస్సుగల, మహాత్మునివంటి వ్యక్తి, సమాజంయొక్క పశుబలంవల్ల అణగద్రొక్కివేయబడిన ఈ విషాద సంఘటన నన్ను భయంకరంగా కదిలించింది. ఎందుకంటే, బిషప్ పరమ పవిత్రమూర్తి. మనస్థిమితంకలవాడు. ఉదాత్తుడు. ఎర్నెస్టు చెప్పినట్లుగా, ఆయనకు శారీరక శాస్త్రాన్నిగురించీ, సాంఘిక శాస్త్రాన్నిగురించి తప్పుడు అభిప్రాయాలుండడమే ఇంతకూ కారణం. ఆయనకున్న దురభిప్రాయాలవల్లనే, అసలు పరిస్థితుల్ని సరిదిద్దడానికి సక్రమమైన పంథా అనుసరించలేక పోయాడు.

బిషప్‌యొక్క అసహాయత్వం నన్ను భయకంపితురాల్ని చేసింది. తాను నిజమనుకొన్న విధానాన్నే ఆయన ఇంకా అంటిపెట్టుకొని ఉన్నట్లైతే, పిచ్చి ఆసుపత్రిలోనే ఉండవలసిన దుస్థితి పట్టకతప్పదు. ఆయన ఇంకా చేయగలిగిందేమీ లేదు. ఆయన ధనం, అధికారం, సంస్కృతీ ఆయన్ను రక్షించలేవు. సమాజానికి ఆయన దృక్పథం ప్రమాదకరం. అటువంటి

ప్రమాదకరమైన దృక్పథం, మతిగలవాడికి ఉంటుందని సంఘం ఊహించలేదు. లేకపోతే, కనీసం, సంఘంయొక్క దృక్పథం అటువంటిదని నేను అనుకొంటున్నా.

ఆర్ద్రమూ, పవిత్రమూ ఐన మనస్స్వభావం కలవాడైనప్పటికీ, బిషప్ భ్రాంతిలో పడ్డాడు. తన ప్రమాదాన్ని స్పష్టంగా అర్థంచేసుకొన్నాడు. తాను వలలో చిక్కుకొన్నానని గ్రహించాడు. దానినుంచి బైటపడడానికి ప్రయత్నించాడు. నాన్నా, ఎర్నెస్టూ, నేనూలాంటి స్నేహితులు ఇచ్చే సహాయాన్ని నిరాకరించాడు. తనకుతానే పోరాడుకోవలసిన ఏకాకిగా మిగిలాడు. చికిత్సాలయంలో ఒంటరిగా ఉండవలసిన నిర్బంధ పరిస్థితివల్ల తేరుకొన్నాడు. మళ్ళీ మతిమంతుడైనాడు. ఆయన కళ్ళకు దృశ్యాలు కనబడడం మానుకొన్నయ్. ప్రభువుయొక్క భక్తుల్ని సమాజం పోషించాలి; అన్న భ్రాంతి ఆయన మనస్సులో అంతర్థానం చెందింది.

నేను చెప్పినట్లు, ఆయన మళ్ళీ మానవ ప్రపంచంలో వచ్చిపడ్డాడు. బాగా బాగుపడ్డాడు. వార్తాపత్రికలూ, మతాచార్యులూ ఆయన పునరాగమనాన్ని మహదానందంతో శ్లాఘించారు. ఆయన చర్చికి ఒకపర్యాయం వెళ్ళా. ఆయన నేత్రాలకు దృశ్యాలు కనబడకపూర్వం ఏరకంగా బోధచేశేవాడో, నేను పోయినప్పుడూ అటువంటి బోధే చేశాడు. నాకు నిరుత్సాహం కలిగింది. దెబ్బతిన్నా. సమాజం ఆయన్ను లొంగిపోయేటంత దెబ్బకొట్టిందా? ఆయన పిరికిపందా? తనపూర్వ సిద్ధాంతాన్ని తానే దిగమ్రింగుకొనేటంతగా వంచి వప్పించారా? లేక ఆయన బాధ మరీ దుర్భరమై, చెక్కుచెదరకుండా పూర్వంనుంచీ వస్తున్న సాంప్రదాయమనే జగన్నాథ రథచక్రాలక్రింద పడిపోయాడా?

ఆయన సుందరభవనంలో ఆయనతో మాట్లాడడానికి పోయా. చూస్తే దుఃఖం కలిగేటంతగా ఆయన మారిపోయాడు. మరీ బక్కచిక్కి

పోయాడు. ఇంతకుముందు నే నెన్నడూ చూడని ముడతలు ఆయన మొగంమీద కనుపించినై. నా రాకవల్ల ఆయన బాగా ఆందోళనచెందాడు. మేం మాట్లాడుతుంటే ఆయన గాభరాతో చొక్కా చేతిని గుంజుకోవడం మొదలెట్టాడు. ఆయన కళ్ళు ఆందోళనతో అటూ ఇటూ అర్థరహితంగా చూస్తున్నయ్ కాని, నా వేపు చూడడానికి నిరాకరించినై. ఆయన మనస్సులో ఇంతకుముందే ఏవో భావాలు ఏర్పడినట్లు తోచింది. ఆయనసంభాషణలో, వింతగా నట్లు పడ్డయ్. ఉన్నట్లుండి మాట్లాడే విషయాన్నుంచి మార్పులు జరిగినై. ఆందోళనవల్ల మాట్లాడేదానిలో క్రమంగూడా తప్పిపోయింది. పవిత్రమైన నిర్మలమైన నేత్రాలూ, పిడుగులుపడ్డా చలించని, మేరుగంభీరస్వభావం గల, నే నింతకుముందు తెలుసుకొన్న అపర క్రీస్తులాంటి పూర్వపు వ్యక్తేనా ఈయన ? ఆయన్ను హింసించారు. మెడలువంచి లొంగదీసుకొన్నారు. ఆయన మనస్సు అత్యంత మృదులం. సమాజంలో సంఘటితమైన తోడేళ్ళ గుంపును ఎదుర్కొనే బలం ఆయనకులేదు.

నేను చాలా విచారపడ్డా. నా విచారం మాటల్లో చెప్పడానికి వీలు కానిది. ఆయన అర్థంకాకుండా మాట్లాడాడు. నేనేమి మాట్లాడ్తానో అని భీతిజెందాడు. ఆయన స్థితిచూచి మారుప్రశ్న వేయడానికికూడా నాకు ధైర్యం చాలలేదు.

తన అనారోగ్యవిషయాన్నిగూర్చి ఆయన ద్రావిడప్రాణాయామయోగ పద్ధతిలో మాట్లాడాడు. చర్చిని గురించి, నిర్మాణంలో జరగవలసిన మార్పులను గురించీ, చిన్న చిన్న దానాలను గురించీ ఒకదానికొకటి అతకకుండా మాట్లాడుకొన్నాం. నేను హృదయభారంతో ఉండకపోతే నవ్వియుండేదాన్నే. నా పోకడ ఆయనకు మనశ్శాంతి కలిగించింది.

పాపం ! బాలనాయకుడు ! నాకే ఈ విషయం తెలిసిఉంటే ! ఆయన ఒక బ్రహ్మాండమైన వ్యక్తిలాగా పోరాటం సాగిస్తున్నాడు. నేను

దాన్ని ఊహించలేదు. వేలాదిగా ఉన్న తన సహచరుల మధ్యలో నిలబడి ఒక్కడే, కేవలం ఏకాకిగా తను పోరాడుతున్నాడు. చికిత్సాలయంలో ఏర్పడ్డ భయంతో నరనరం కుంచించుకుపోయి, ధర్మంమీదా సత్యంమీదా తనకున్న కృతజ్ఞతవల్ల ఆయన సత్యానికీ, ధర్మానికీ కదలకుండా కట్టుబడి ఉన్నాడు. అఖరికి నన్ను గూడా విశ్వసించడానికి సాహసించలేని ఏకాకిగా ఉన్నాడు. ఆయన తన గుణపాఠాన్ని బాగా నేర్చుకొన్నాడు. చాలా బాగా నేర్చుకొన్నాడు.

తెలుసుకొంటానికి నేను చాలా తొందరపడ్డా. ఒకరోజున బిషప్ అంతర్ధానమైపోయాడు. తాను వెళ్లుతున్నానని ఆయన ఎవ్వరికీ చెప్పలేదు. రోజులు గడిచినై. కానీ ఆయన మళ్ళీ కనబడలేదు. ఆయనకు మళ్ళీ తాత్కాలిక మతిచాంచల్యం ఏర్పడ్డందున ఆత్మహత్యచేసుకొన్నాడని నీలివార్తలు బయలుదేరినై. ఆయన నగరంలో ఉన్న సౌధాన్ని, మెన్లోఫార్కుగ్రామంలో ఉన్న ఇంటినీ, చిత్రలేఖనపటాల్ని, ఇంకా సంపాదించినవస్తువుల్ని, బ్రహ్మాండమైన లైబ్రరీని మొత్తం తనకున్న యావదాస్తినీ అమ్మేసుకున్నాడని తెలియడంతో, ఇంతకుముందు బయలుదేరిన నీలివార్తలు గాలిలో తేలిపోయినై. అంతర్ధానానికి పూర్వమే ఆయన మొత్తం ఆస్తిని శుభ్రీతగా జలగడిగేశాడన్నది స్పష్టంగా తెలుస్తోంది.

మా స్వవిషయాల్లో చాలా విషాదపరిస్థితులు ఏర్పడ్డ సమయంలోనే ఈ సంఘటన జరిగింది. మా కొత్త ఇంటి పరిస్థితులన్నీ కుదుటపడ్డ తర్వాతగాని బిషప్ అంతర్ధానానికి ఆశ్చర్యం ప్రకటించడానికిగాని, ఆయన ఏమైపోతాడా అని ఊహించడానికిగాని సావకాశంచిక్కలేదు. ఇక అప్పుడు ఒక్కసారిగా సర్వం కళ్ళకుకట్టినట్లు అర్థమైపోయింది. ఊరపొద్దుగూకబోయే సమయానికి, ఒకరోజు ఎర్నెస్టు సాయంకాల భోజనానికి మాంసం తీసుకువద్దామని వీధిదాటి కసాయిదుకాణానికి వెళ్ళా. మా యీ కొత్త పరిసరంలో మా చివరి పగటి భోజనాన్ని 'సప్పర్' అని పిలుస్తాం.

ఉక్కుపాదం.

నేను సరిగ్గా కసాయిదుకాణంనుంచి బైటికివచ్చినప్పుడే, ఆ వీధిలోనే మూలగా ఉన్న చిల్లరదుకాణంలోనుంచి ఒక వ్యక్తి పోతుండడం చూచా. ఎప్పుడో చూచిన పరిచయంగల వ్యక్తి అని ఊహాతోచి మళ్ళీ ఒక్కసారి నిదానించి చూచా. కానీ ఆ వ్యక్తి అటువైపు తిరిగి చక చకా నడిచి పోతున్నాడు. ఆ ఎగుడు దిగుడు భుజాలు, కోటుకూ కాలరుకూ మధ్యవేరులాడుతోన్న నెరిసిన జుట్టూ, నెత్తిన ఏటవాలుగాపెట్టుకొన్న టోపీ నాలో అజ్ఞాతస్మృతుల్ని రేకొల్పినై. వీధి దాటిపోవడానికి బదులు ఆయన వెంటబడ్డా. నా బుర్రలో ఏర్పడ్డ ఊహాల్నిగూర్చి ఆలోచించడానికి ప్రయత్నించకుండా నా గమనాన్ని ఇంకా త్వరితంచేశా. కాదు. అది అసాధ్యం. అదై ఉండదు. అంచులుచిరిగి మాసిపోయిన ఆ పొడుగాటి అంగారఖా తొడుక్కున్న మనిషి అతడై ఉండటానికి అవకాశంలేదు.

ఆగిపోయా. నాకు నేనే నవ్వుకున్నా. ఇంచుమించుగా వెన్నాడడం ఆపేశా. కానీ, ఆ భుజాల వెండి శిరోజాలు ఎక్కడనో పరిచయమున్నట్లు తరుముకు వస్తున్నయ్యే! మళ్ళీ త్వరత్వరగా వెంబడించా. ఆయన్ను దాటిపోతూ ఆయన మొగాన్ని ఒక్కసారి తీక్ష్ణంగా చూచా; వెంటనే గిరుక్కున వెనక్కుతిరిగి బిషప్ అని నిశ్చయంచేసుకొన్నా.

ఆయనా అట్లాగే ఉన్నట్లుండి ఆగిపోయాడు. ఒక నిశ్వాసం విడిచాడు. ఆయన కుడిచేతిలో ఉన్న ఒక పెద్ద కాగితపు సంచి అమాంతం క్రిందపడిపోయింది. చినిగింది. ఆయన కాళ్ళముందు, నాకాళ్ళముందూ అటూ ఇటూ బంగాళాదుంపలు చిందరవందరగా పడిపోయినై. ఆయన నావైపు భయసంభ్రమాలతో చూచాడు. ఎలా తేలాబోతున్నట్లు కనిపించాడు. విచారంతో ఆయనభుజాలు కుంచించుకుపోయినై. ఒక దీర్ఘనిశ్వాసంవదిలాడు.

నేను చేయి చాచా. ఆయన కరస్పర్శ చేశాడు. ఆయన చేయి చల్లగా ఉన్నట్లు తోచింది. గాభరాతో గొంతు సవరించుకొన్నాడు. ఆయన నుదుటి

మీద చెమటపట్టడం గమనించా. ఆయన బాగా భయపడిపోయాడన్నది రుజువైంది.

"ఆ బంగాళా దుంపలు చాలా అమూల్యాలు", అని హీన స్వరంతో గొణిగాడు. మా ఇద్దరిమధ్యపడ్డ వాటిని ఏరి మళ్ళీ చిరిగిన సంచిలో పడేశాం. ఇప్పుడా సంచిని చంకలో జాగ్రత్తగా పెట్టుకొన్నాడు. ఆయన్ని కలుసుకోవడం మహదానందకరమైన విషయమనీ, ఉన్నపళాన మా ఇంటికి తప్పకుండా వచ్చేయాలని చెప్పాలని ప్రయత్నించా.

"మిమ్మల్ని చూస్తే నాన్న చాలాసంతోషిస్తాడు. మా ఇల్లు ఇక్కడికి కూతవేస్తే అందే దూరంలోనే ఉంది." అన్నా.

"నేను రాలేను. వెళ్ళిపోతున్నా. గుడ్‌బై." అన్నాడు. తనను ఎవరైనా కనిపెడ్తారేమోనేభయంతో, చుట్టుపక్కలొకసారి పరికించిచూచి, సాగిపోవడానికి ప్రయత్నించాడు.

నేను ఆయన పక్కనే నడూస్తూండడం గమనించి, ఇక నేను తనను వదిలిపోయేట్టులేనని గ్రహించిన తర్వాత "మీరెక్కడుంటున్నారో చెప్పు. నే మరొకప్పుడువచ్చి కలుసుకొంటా" అన్నాడు.

"కాదు. మీరిప్పుడేరావాలి." అని గట్టిగా అన్నా.

తన మోచేతిమీదకు దొర్లిపడ్తున్న బంగాళా దుంపలవైపు, మరో చేతిలోఉన్న పొట్లాలవైపూ చూచాడు.

"ఇప్పుడు రావడం నిజంగా దుస్సాధ్యమైన విషయం. మొరటుగా చెప్తున్నందుకు క్షమించు. అసలు విషయం నీకు తెలిసిఉంటే." అన్నాడు.

పూర్తిగా స్వాధీనం తప్పిపోతున్నట్లు కనిపించాడు. కానీ మరుక్షణంలోనే నిగ్రహించుకొన్నాడు. "ఈ ఆహారవిషయంతోపాటు, అదొక విషాద విషయం. అది భయంకరమైంది. ఆమె ఒక పండుముసలి. తక్షణం ఆహారాన్ని ఆమెకు అందించాలి. ఆహారంలేక అల్లాడిపోతోంది. నేను వెంటనే

వెళ్ళాలి. అర్థమైందా. ఆ తర్వాత మళ్ళీవస్తా. వాగ్దానం చేస్తున్నాగా." అన్నాడు.

"నన్నుగూడా మీతో రానీయండి. అది చాలా దూరమా?" అన్నా.

మళ్ళీ ఒక నిట్టూర్పు విడిచి లొంగిపోయాడు.

"రండిళ్ళ అవతల్నే. తొందరగా పోదాంపద." అన్నాడు.

బిషప్ దర్శకత్వంతో నేను నా చుట్టుపక్కలవాళ్ళనుగురించి కొంత నేర్చుకొన్నా. ఇందులో ఇంత దౌర్భాగ్యస్థితీ, హేయమూ ఉన్నదని కలలో గూడా అనుకోలేదు. దానధర్మాలంటే పట్టించుకోకపోవడమే బహుశా నా అజ్ఞానానికి కారణమై ఉండవచ్చు. దాన ధర్మాలు చేయడం పుండుకు కట్టుకట్టడంవంటిదని ఎర్నెస్టు అవహేళన చేయడం సబబేనని ఇప్పటికి నేను ఒప్పుకొన్నా. 'పుండునే తీసేయ్' అన్నది ఆయన చికిత్స. కార్మికుడికి అతడి ఉత్పత్తి ఫలితం ఇవ్వు. పరిశ్రమించి జవసత్త్వాలుడిగి ముసలివాళ్ళైన తర్వాత సిపాయిలకు ఇస్తున్నట్లుగానే, వాళ్ళకూ పింఛన్లు ఇవ్వు. ఇక అప్పుడు దాన ధర్మాలతో నిమిత్తం ఉండదు. అసలు సమాజ విధానంలోనే ఉన్న అన్యాయంమూలకంగా పరంపరగా తలెత్తుతోన్న సంఘపు చెడుగుల్ని ఉపశమింప చేయడానికి నాశక్తి సామర్థ్యాల్ని వ్యయించలేను. ఈ విషయం నాకు బాగా నచ్చింది. అందుకే, ఆయనతోబాటే నేనూ విప్లవోద్యమంలో పరిశ్రమించా.

బీద ప్రజానీకం నివసిస్తోన్న గదులుగల ఒక పెద్ద ఇంట్లో, ఒక గదిలోకి బిషప్ వెనకనే నేనూ వెళ్ళాను. ఆగది 10 అ॥పొడవు, 12 అ॥వెడల్పు ఉంది. బిషప్ చెప్పిన జర్మన్ వృద్ధ స్త్రీని అక్కడచూచా. ఆమెకు 64 సంవత్సరాలుంటాయి. నన్ను చూచేటప్పటికి ఆమె ఆశ్చర్యపడింది. కానీ నారాకకు సంతోషంగా తలూపింది. ఇక తన తొడమీదఉన్న లాగు కుట్టుకు పోతోంది. నేలమీద, ఆమెకు పక్కగానే లాగులకుప్ప ఒకటుంది. ఆగదిలో పొయి రాజేయడానికి బొగ్గులుగానీ, కట్టెలుగానీ, లేవని బిషప్ తెలుసుకొని, వాటిని కొనుక్కురావడానికి బైటికి వెళ్ళిపోయాడు.

నేనొక లాగును తీసుకొని ఆమె కుట్టుపనిని పరీక్షించాను.

కుట్టుకుంటూనే నెమ్మదిగా తలూపుతూ, "ఆరుసెంట్లుఅమ్మా!" అంది. ఆమె నెమ్మదిగా కుట్టింది. కానీ కుట్టడంమాత్రం ఆమె ఎప్పుడూ ఆప లేదు. కుట్టులో ఆమె అందవేసిన చేయిగా కనిపించింది.

"ఇంతపనికీ వాళ్లిచ్చేది ఇంతేనా? నీకు ఎంతకాలం పస్తుంది?" అని ప్రశ్నించా.

"ఔను. వాళ్లు చెల్లించేది అదే. పూర్తిచేస్తే ఆరుసెంట్లు. ఒక్క జత కుట్టాలంటే రెండుగంటలు పస్తుంది." అని సమాధానం చెప్పింది.

యజమానికి చిక్కుతెచ్చిపెడ్తానేమోనని భయంతో, ఆమె వెంటనే "కానీ, యజమానికి ఇదంతా తెలియదు. మందకొడిదాన్ని. నాకు కీళ్ల నొప్పులు. ఆడపిల్లలు ఇంకా త్వరగాచేస్తారు. వాళ్ళొక గంటలోనే కుట్టేస్తారు. యజమాని దయగలవాడు. నన్ను ఇంటిదగ్గర్నే కుట్టడానికి అంగీకరించాడు. ఇప్పుడు నేను ముసలిదాన్ని కావడంచేత మిషన్ల గణగణధ్వని నా నా బుర్రకు చికాకు కలిగిస్తుంది. ఆయన దయలేకపోతే నేను ఉపోష్యాలుం చేయాల్సిందే." అంది.

"నిజమే, దుకాణాంలో పనిచేసేవాళ్లకు 8 సెంట్లు గిత్తయ్. కానీ నీవేం చేయగలవు? చిన్నవాళ్లకు తగినంత పనిలేదు. ముసలివాళ్లకు అవకాశం లేదు. తరుచుగా నాకు మహావస్తే ఒక జత వస్తుంది. ఇవ్వాళ్ మాదిరిగానే ఒక్కొక్కప్పుడు రాత్రిలోపల్నే పూర్తిచేయడానికి 8 జతలు వస్తయ్."

"ఎన్ని గంటలు పనిచేస్తావ్?" అని ఆమెను అడిగా. సమయాన్ని బట్టి ఉంటుందని చెప్పింది.

"గిరాకీ ఆర్డ్లుంటే ఎండాకాలంలో ఉదయం ఐదుగంటలు మొదలుకొని రాత్రి తొమ్మిదింటిదాకా పనిచేస్తా. కానీ శీతాకాలంలో మరీ చలిగా ఉంటుంది. పెందలాడే వేళ్లకు పట్టుచిక్కదు. అప్పుడిక ఇంకా ఆలస్యంగా పనిచేయాలి - కొన్ని సమయాల్లో అర్ధరాత్రి దాటింతర్వాతకూడా చేయాలి."

ఉక్కుపాదం.

"ఔను. వెధవ ఎండాకాలం. కష్టదినాలు. దేవుడికి కోపంవచ్చి ఉండాలి. ఈ వారంలో యజమాని నాకు ఇచ్చింది ఇదే మొదటిపని. రెక్కాడకపోతే డొక్కాడదన్నమాట అక్షరాలా నిజం. నేను దానికి అలవాటు పడ్డా. పాతఊళ్లో, ఇక్కడ శాన్‌ఫ్రాన్సిస్కోలో ముప్పైమూడు సంవత్సరాలనుంచీ నా జీవితమంతా కుట్టుపనికే ధారపోశా."

"అద్దెడబ్బులవరకైనా సంపాదించుకోగల్గితే మంచిదే. గృహయజమాని చాలా దయాస్వభావుడు. ఐతేనేం, ఆయన అద్దె ఆయనకు కావాలిగా. అద్దె చౌకే. ఈ గదికి ఆయన మూడు డాలర్లు మాత్రమే తీసుకొంటాడు. అక్కడకిది చౌకే. కానీ, ప్రతినెలా మూడు డాలర్లు సంపాదించడమంటే తేలికైన పనిగాదు."

ఆమె మాట్లాడడం ఆపేసింది. తలూపుకుంటూ కుట్టుకుపోతోంది.

"నీ సంపాదన ఖర్చుచేసుకోనే విషయంలో నీవు చాల జాగ్రత్తగా ఉండాలి" అని నేను అన్నా. ఆమె ఔనన్నట్లుగా తలూపింది.

"అద్దె చెల్లించేస్తే మరీ అంత అధ్వాన్నంగా ఉండదనుకో. మాంసం కొనుక్కోలేనన్నది నిజమే. కాఫీకి పాలుగూడా ఉండవు. కానీ ప్రతినిత్యం ఒక్కసారైనా భోజనం చెయ్యవచ్చు. అడపాదడపా రెండుపూటలుకూడా భోజనం చేయవచ్చు."

ఆమె చివరిసారి ఈ విషయం సగర్వంగా చెప్పింది. ఆమె మాటల్లో విజయచిహ్నాలు తొంగిచూచినై. కానీ ఆమె మౌనంగా కుట్టుకుపోతుంటే ఆమె ఆనందమయ నేత్రాల్లో, ముఖంలో విషాదచ్ఛాయలు తొంగిచూస్తున్నయ్. ఆమె కళ్లచూపు మూకమైపోయింది. కళ్లల్లో ఏర్పడ్డ మసకను చేతుల్తో ఒక్కసారి తుడుచుకొంది. మసక ఏర్పడి ఆమె కుట్టుపనికి ఆటంకం కలిగించింది.

"ఆకలిగాదు హృదయాన్ని బాధపెట్టేది. ఆకలికి నీవు పూర్తిగా అలవాటైపోతావు. నేను విలపించేది నాబిడ్డకోసం. ఆమెను మిషన్

పొట్టపెట్టుకొంది. ఆమె బాగా పరిశ్రమించింది అన్నమాట నిజమే. కానీ నాకేమీ అర్థంకాలేదు. ఆమె బలిష్ఠురాలు. నలభై ఏండ్ల యువతికూడా. ముప్పై సంవత్సరాలుమాత్రమే పనిచేసింది. చిన్నతనంలోనే పనిచేయడం ప్రారంభించినమాటా నిజమే. కానీ మా ఆయన చనిపోయాడు. పని చేస్తుండగా బాయిలర్ పగిలిపోయింది. మరి మేం ఏమి చేయగలం? ఆమెకు పది సంవత్సరాలు. ఐనా చాలా బలిష్టంగా ఉండేది. ఐనా మిషన్ ఆమెను చంపేసింది. అవును. అది పొట్టబెట్టుకొంది. ఆమె షాపులో అందరికన్నా చాలాచలాకిగా పనిచేసేది. ఆ విషయాన్నే నేను తరచుఆలోచించా. ఇప్పుడు కూడా దాన్నే ఆలోచిస్తున్నా. అందుకే నేను షాపులో పనిచేయలేకపోవడం. మిషన్ నాతలను చీకాకుపరుస్తుంది. "నేనే ఆపనిచేశా. నేనే ఆపని చేశా." అని అది చెపుతూన్నట్లుగా నాకెప్పుడూ వినబడుతుంది. ఇకప్పుడు మళ్ళీ నా కూతురుమీదికి మనస్సు మళ్ళుతుంది. ఇక నేను పనిచేయలేను."

ఆమె కళ్ళు మళ్ళీ చెమ్మగిల్లినై. కుట్టుపని చేయడానికిపూర్వం ఆమె కళ్ళు తుడుచుకోవాలిసిన అవసరం కలిగింది.

మెట్లమీద బిషప్ వస్తోన్న ధ్వని వినబడింది. తలుపు తెరిచా. మనిషి ఏ ఆకారంలో ఉన్నాడంటే! వీపుమీద అరబస్తా బొగ్గులూ, పైన నిప్పు రాజేసే సామానూ మోసుకు వస్తున్నాడు. ఆయన మొగంమీద బొగ్గునుసి కొట్టుకొంది. అలసటవల్ల పుట్టినచెమట కాల్వలుగారుతోంది. ఆ బరువును కుంపటికి దగ్గరగా మూలపడేశాడు. మొద్దు చేతిరుమాల్తో చెమట తుడిచేసుకొన్నాడు. నా కళ్ళను నేనే నమ్మలేకపోయా. బిషప్! బొగ్గేసేవాడిమాదిరిగా నల్లగా ఉన్నాడు. సామాన్య కార్మికుడుమాదిరిగా చౌకబారుచొక్కా వేసుకొన్నాడు. ఆ చొక్కాకూడా మెడదగ్గర ఒక గుండీ ఊడిపోయింది అంగరఖా ఒకటి ధరించిఉన్నాడు. అంగరఖాధారణే అన్నిటికన్నా మరీ అసంబద్ధంగా ఉంది. అడుగున కాలిపోయి ఉంది. చీలమండలదగ్గ జీరుకాడు

తోంది. కార్మికులు ధరించేటట్లుగానే ఆ అంగరఖాను నడుందగ్గర చాలీ చాలని బెల్టుతో కట్టేశాడు.

బిషప్ కు వెచ్చదనం కలిగినప్పటికీ, పాపం చిక్కిన ఆ ముసలి అవ్వ చేతులు చలితో కొంగర్లుపోతున్నయ్. ఆ మెను మేం వదిలేలోపల్నే బిషప్ నిప్పు రాజేశాడు. ఇంతలోకే నేను బంగాళాదుంపలు పొట్టుతీసి ఉడకబెట్ట డానికి పొయిమీదకు ఎక్కించా. నా చుట్టుపక్కల్నే గదుల్లో మురిగిపోతూ ఈ మెలాంటి విషాద చరిత్రగలవాళ్ళింకా అనేకులున్నారనీ, ఇంతకన్నా అధ్వాన్నస్థితిలో ఉన్నవాళ్లుకూడా ఉన్నారనీ, కొంతకాలంగడచిన తర్వాత తెలుసుకొన్నా.

నా అంతర్ధానంవల్ల గాభరాపడుతోన్న ఎర్నెస్టు వద్దకు ఇద్దరం తిరిగి వెళ్ళాం. ఆశ్చర్యంతోగూడిన మొదటి స్వాగతసత్కారం ముగిసిన తర్వాత, బిషప్ తన కుర్చీలో చేరగిలబడి, కాళ్ళు బాగా చాచి, అమ్మయ్యా! అన్నట్లు సంతృప్తితో ఒక నిశ్వాసం వదిలాడు. తాను అంతర్ధానం చెందినతర్వాత మొదటిసారిగా కలుసుకొన్న పాత స్నేహితులం మేమేనని చెప్పాడు. తాను ప్రభు కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నందున చాలా ఆనందాన్నిపొందానని చెప్పి నప్పటికీ, ఈ మధ్యకాలంలో ఒంటరితనంచేత మహాబాధపడి ఉంటాడు. ఇంకా చాలా చెప్పాడు.

“ఎందుకంటే, ఇప్పుడు నిజంగా ఆయన బిడ్డల్ని పోషిస్తున్నా. నేనొక పెద్దగుణపాఠం నేర్చుకున్నా. కడుపు నిండితేగాని, తత్త్వబోధ మనస్సుకు పట్టదు. ఆయన బిడ్డల్ని రొట్టె, వెన్నా, బంగాళా దుంపలు, మాంసంతో పోషించాలి. అప్పుడే, అప్పుడు మాత్రమే వాళ్ళ ఆత్మలు ఎక్కువ విజ్ఞానాన్ని పొందగల్గుతై.”

నేను వండిన సాయంకాల భోజనాన్ని సంతృప్తిగా భోంచేశాడు. పూర్వపు రోజుల్లో మా ఇంటికి వచ్చినప్పుడు ఇప్పటి మాదిరిగా ఎన్నడూ

ఇంత ఆకలివేయలేదు. మేం ఆ విషయాన్ని చెప్పాం. ఇప్పటిమాదిరిగా తన జీవితంలో ఇంతసుఖంగున్నదూ ఇంత ఆరోగ్యంగానూ లేనని చెప్పాడు.

"ఇప్పుడు నా ప్రయాణం కాలినడకే." అన్నాడు. తాను పూర్వం కాలు కింద పెట్టకుండా అశ్వశకటంలో ప్రయాణం సాగించిన విషయం తలపుకు వచ్చి, అది తేలిగ్గా త్రోసిపారేయరాని మహాపాపం మాదిరిగా భావించి లజ్జించాడు.

"పూర్వంకన్నా నా ఆరోగ్యం చాలా బాగుంది. నేనిప్పుడు నిజానికి మహదానందాన్ని పొందుతున్నా. ఈ నాటికి నా ఆత్మ విముక్తి చెందింది." అని వెంటనే చెప్పాడు.

ఐనా ఆయన మొగంలో శాశ్వతబాధ ఒకటుంది. ఈ నాడు తాను స్వీకరించిన లోకపు బాధ అది. ఈనాడు జీవిత నగ్నస్వరూపాన్ని దర్శిస్తున్నాడు. ఈ జీవితం, తాను పూర్వం లైబ్రరీ గ్రంథాల్లో చూచిన జీవితానికన్నా విభిన్నమైంది.

"దీని కంతటికీ నీవే బాధ్యుడవయ్యా!" అన్నాడు ఎర్నెస్టుతో ముఖాముఖిగా.

ఎర్నెస్టు గాఢరాతిని మొగం వేలాడేశాడు.

"నేను-నేను...నిన్ను హెచ్చరించా." అన్నాడు తడబడుతూ.

"కాదు. నీవు అపార్థంచేసుకొన్నావ్. నేను నిన్ను దూషిస్తూ మాట్లాడలేదు. కృతజ్ఞతాపూర్వకంగా అభినందించా. నాకు మార్గాన్ని చూపించినందుకు నేను నీకు అభివందనా లర్పించాలి. జీవితాన్ని గూర్చిన సిద్ధాంతాల నుంచి, నన్ను యథార్థ జీవితానికే తీసుకుపోయావు. సమాజంలో ఉన్న ముసుగు తొల్చి తొలగించావు. నా అంధకారానికి నీవొక జ్యోతివి. కానీ, ఇప్పుడు నేను గూడా జ్యోతిని దర్శిస్తున్నా. మరి నేనిప్పుడు చాలా సంతోషంగా ఉన్నా, ఒక్కటి మాత్రం..." అని బాధతో తటపటాయించాడు. ఆయన కళ్ళల్లోనుంచి భయం మరింతగా తొంగిచూస్తోంది. "నన్ను

పెట్టిన బాధ ఒక్కటే. నే నెవరికీ హానిచేయను. నా పని నన్నెందుకు చేసుకోనీయరు? కానీ అదికాదు. ఆ హింసా పద్ధతే నన్ను భయపెట్టేది. వాళ్ళు కత్తుల్తో నా కండలు తరిగేసినా, చితిలో నిలువునా తగలేసినా, తల్ల కిందులుచేసి స్లీబవేసినా నే నంత పట్టించుకొనేవాణ్ణేగాదు. కానీ ఆ చికిత్సా లయమే నన్ను భయపెట్టేది. దాని సంగతి ఆలోచించు! నన్ను-పిచ్చిపట్టిందని ఉన్మాద చికిత్సాలయంలో! ప్రతిఘటన విషయమది. పిచ్చాసుపత్రిలో కొన్ని విషయాల్ని చూశా. అవి చాలా దారుణంగా ఉన్నాయ్. ఆ విష యాల్ని తలుచుకొన్నప్పుడల్లా నా నెత్తురు జిల్లుమంటుంది. వెర్రిముండా కొడుకుల మధ్యలో నా జీవితాంతం నిర్బంధింపబడి ఉండడమే! కాదు!కాదు! అదికాదు! అదికాదు!''

అది కరుణార్ద్రమైన దృశ్యం. ఆయన చేతులు వణికిపోయినై. ఆయన చిత్రించుకొన్న దృశ్యం మూలకంగా ఆయన శరీరం ఆపాదం కంపించి, కుంచించుకుపోయింది.

''నన్నుక్షమించు. నావి బలహీనమైననరాలు. ప్రభుకృషినన్నక్కడకే ఈడ్చుకుపోతే పోనీ. దోషారోపణ చేయడానికి నే నెవర్ని?'' అన్నాడు మామూలుగా.

ఆయన్ను చూచేటప్పటికి నాకు పెద్దపెట్టున ఏడవాలనిపించింది. ''మహాత్మా! బిషప్! ఓ శౌర్యఖనీ! ఓ దైవ వీరాగ్రేసరా!''

సాయంకాలం జరిగిపోయేటప్పటికి ఆయనచేసిన తదితర విషయాల్ని గురించి చాలా విన్నాం.

''నేను నా ఇంటిని-ఇల్లేమిటి! ఇళ్ళన్నింటినీ, నా స్వాధీనంలో ఉన్న ఇతర ఆస్తిపాస్తుల్నీ అమ్మేశా. ఇదంతా రహస్యంగా చేయాలని నాకు తెలుసు. లేకపోతే, నా దగ్గరనుంచి వాళ్ళు మొత్తం లాక్కొని ఉండే వాళ్ళే. అదింకా భయంకరంగా ఉండేది. రెండుమూడులక్షల డాలర్లతో ఎన్ని బంగాళాదుంపలు, ఎంతరొట్టె, ఎంత వెన్నా, బొగ్గూ, వంటచెరుకూ

కొనవచ్చునో అని ఆలోచిస్తే ఈ రోజుల్లో చాలా ఆశ్చర్యపడుతున్నా."
అని ఎర్నెస్టువైపు తిరిగి, "నీవు చెప్పింది సత్యమేనయ్యా! కార్మికులకు చాల తక్కువ జీతాలిస్తున్నారు. ఫారిజేయులకు రమణీయంగా ఉపదేశాలు చేయడం తప్పనిచ్చి నా జీవితంలో నేనేమీ శ్రమించలేదు. నేను ప్రభు సందేశాన్ని బోధిస్తున్నా ననుకొనేవాణ్ని. నాకు 5 లక్షల డాలర్లు ఉండాల్సిందేనని భావించేవాణ్ని. 5 లక్షల డాలర్లుపెట్టి ఎన్ని బంగాళా దుంపలు, ఎంత రొట్టె, ఎంత వెన్న, ఎంత మాంసం కొనవచ్చునో గ్రహించే దాకా ఆ ధనంయొక్క ప్రయోజనం నాకు తెలిసిందిగాదు. అప్పుడింకా కొంత గ్రహించా. ఆ బంగాళాదుంపలూ, రొట్టె, వెన్నా, మాంసం అంతా నాదేనని, వాటిని స్వవిగా చేసుకొంటానికి నే నేమాత్రం పరిశ్రమించలేదని గ్రహించా. మరొకవ్యక్తి వాటికోసం పరిశ్రమించి ఉత్పత్తి చేశాడనీ, ఆ వ్యక్తికి అవి దక్కకుండా మరొకళ్లు దోచుకొన్నారనీ అప్పుడు స్పష్టంగా అర్థమైంది. నేను దరిద్రజీవులమధ్యకు దిగివచ్చినప్పుడు, దోచుకోబడ్డవాళ్లనూ, దోచుకోబడటంచేత ఆకలితో మలమల మాడిపోయే నికృష్ట నిర్భాగ్య జీవుల్ని చూచా."

మేం మళ్ళీ ఆయన ధోరణిలోకి లాగాం.

"ఆ ధనం? చాలా మారుపేర్లతో చాల బ్యాంకుల్లో దాన్ని దాచా. ఇకెవ్వళ్ళూ దాన్ని నా దగ్గరనుంచి లాక్కుపోలేరు. ఎందుకంటే వాళ్ళకు అసలు అంతుచిక్కుతేగా? ఆ ధనం చాలా మంచిది. అదిపెట్టి చాలా ఆహారాన్ని కొనవచ్చు. ఇంతకుముందు డబ్బుయొక్క సత్ప్రయోజనమేమిటో నాకు తెలియదు."

"పరిచారార్థం అందులోంచి కొంత మొత్తం తీసుకొందామనుకొంటున్నా. దానివల్ల అమితప్రయోజనం సిద్ధిస్తుంది." అని ఎర్నెస్టు యాదాలాపంగా అన్నాడు.

“అట్లా అనుకొంటున్నావా? నాకు రాజకీయాల్లో అట్టే నమ్మకం లేదు. నిజానికి, రాజకీయాలు నాకు అర్థంకావనే భయంకూడా ఉంది.” అన్నాడు బిషప్.

అటువంటివిషయాల్లో ఎర్నెస్టు మొగమోటపడ్తాడు. డబ్బులేనందువల్ల సోషలిస్టుపార్టీ చాలా సంకటావస్థలో తన్నుకొంటున్నదని బాగా తెలిసినప్పటికీ, ఎర్నెస్టు మళ్ళీ ఆ ప్రసక్తి తీసుకురాలేదు.

“నేను చాలా చౌక విశ్రాంతిగృహాల్లో నిద్రపోతా. కానీ, ఒక్క చోట ఎప్పుడూ దీర్ఘకాలం ఉండనేమోనని భయపడుతున్నా. అదీగాక, పట్టణంలో వేరేచోట్ల శ్రామికుల ఇళ్ళల్లో రెండుగదులు అద్దెకుతీసుకొన్నా. ఆ విషయంలో కొంత దర్జాకుపోయానని తెలుసు. ఐనా అది అవసరం. అప్పుడప్పుడూ చౌక కాఫీహోటళ్ళనుంచి కొని తెచ్చుకొంటున్నప్పటికీ ఆ అదనపు ఖర్చును సొంతవంటతోటి పూడ్చుకుంటున్నా. నేనొక కొత్తవిషయాన్ని కనిపెట్టా. రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత బాగా చలిగా ఉన్నప్పుడు టామల్స్ బాగుంటై. అవి కొంచెం ఖరీదే ననుకో. కానీ, పదిసెంట్లకు మూడు టామల్స్ ఇచ్చే చోటొకటి లంకించుకున్నా. అవ్వి తక్కినవాటంత బాగా ఉండకపోయినా, చాలా వెచ్చదనాన్నిమాత్రం కలిగిస్తయ్.”

“అందుచేత, చిట్టచివరికి ఈ ప్రపంచంలో నేను చేయాల్సిన పనిని కనుక్కొన్నా. నీకు నా అభివందనాలు. అది ప్రభుకృషి.” అని ఆయన నావైపు చూచాడు; ఆయన కళ్ళు మెరిసినై. “నేను ప్రభువు బిడ్డల్ని పోషిస్తుండగా నీవు పట్టుకున్నావు. తెలుసుగా. మీరంతా ఈ రహస్యాన్ని కాపాడుతారనుకొంటా.” అన్నాడు.

ఆయన మాట్లాడినంతవరకూ నదురూ బెదురూ లేకుండా మాట్లాడాడు. కానీ, ఆయన మాటల వెనకాల నిజమైన భయం ఒకటుంది. ఆయన మమ్మల్ని మళ్ళీ కలుసుకుంటానని మాట ఇచ్చాడు. కానీ వారంరోజుల

తర్వాత, నాపా పిచ్చాసుపత్రిలో చికిత్సార్థం నిర్బంధింపబడ్డాడన్న బిషప్ విషాద వార్తను పత్రికల్లో చదివాం. ఆయన్ను చూడడానికి ప్రయత్నించాం. కానీ నిరర్థక ప్రయత్నాలైనై. ఆయన బాగుపడడానికి కొన్ని ఆశలున్నై అన్న సమాచారం తప్ప, ఆయన్ను గురించి మరేవిషయం మాకు తెలియలేదు.

"ఈ యువధనవంతుణ్ణి తనకున్న సర్వస్వం అమ్మేయమని క్రీస్తు చెప్పాడు. బిషప్ క్రీస్తు ఆదేశాన్ని శిరశావహించి, పిచ్చాసుపత్రిలో బందీ అయినాడు. క్రీస్తు నాటినుంచీ కాలం మారిపోయింది. తనకున్న సర్వస్వం బీదలకు దానం చేసే ధనికుడు ఈ నాడు ఉన్మాది. ఇందులో తర్కమేలేదు; సమాజం అట్లా అని నిర్ణయించింది." అన్నాడు ఎర్నెస్టు విచారహృదయంతో.

## ౧౩

**1912** వ సంవత్సరపు ఎన్నికల్లో సోషలిష్టులకు ఘోర పరాజయం కలిగింది. ఐనా, ఎర్నెస్టు కాంగ్రెసుకు ఎన్నికైనాడనుకోండి. సోషలిష్టుల ఓట్లను వృద్ధిచేయడానికి సహాయపడిన ఒక పెద్ద విషయం "హియర్స్టు" నాశనం. ఈ పనిచేయడానికి ధనికవర్గానికి చాలా సులభంగా కనబడ్డది. తనకున్న వివిధ పత్రికల్ని నడపడానికి, హియర్స్టుకు సంవత్సరానికి 150 లక్షల డాలర్లదాకా దేవుతై. ఇంత మొత్తం, వీలుంటే ఇంతకన్నా ఎక్కువ గూడా, మధ్యతరగతివాళ్ళ ప్రకటనల రుసుం ద్వారా, వాళ్ళ దగ్గర్నుంచి రాబట్టుకొనేవాడు. అతని ఆర్థికస్తోమత పూర్తిగా మధ్యతరగతి ప్రజల మీదనే ఆధారపడి ఉంది. గుత్తసంస్థాధికారులు ప్రకటనలు చేయలేదు. హియర్స్టును నాశనంచేయాలంటే అన్నిటికన్నా ముఖ్యంగా చేయాల్సిన పని, అతడికి వచ్చే ప్రకటనలకు అడ్డుకట్టవేయడమే.

మధ్యతరగతి అంతా ఇంకా పూర్తిగా నాశనంకాలేదు. దృఢమైన దాని అస్థిపంజరం మాత్రం ఊగులాడుతోంది. కానీ దానిలో చేవ చావ

లేదు. ఇంకా బ్రతికి బట్టకట్టుకొంటున్న కొద్దిపాటి ఉత్పత్తిదారులూ, ఛోటా వ్యాపారస్థులూ కేవలం ధనికవర్గ దయాధర్మ భిక్షమీద ఆధారపడి ఉన్నారు. వాళ్ళకు స్వతంత్రమైన ఆర్థిక, రాజకీయాభిప్రాయాలంటూ లేనే లేవు. ధనికవర్గ అనుశాసనంతో, హియర్స్టు పత్రికలకు తామిస్తోన్న ప్రకటల్ని వాళ్ళింక ఇవ్వడం మానుకొన్నారు.

హియర్స్టు హోరాహోరిగా పోరాడాడు. ప్రతినెలా పదిహేను లక్షల డాలర్ల నష్టానిక్కూడా అంగీకరించి పత్రికల్ని నడిపాడు. తనకిక ఏ మాత్రం డబ్బు ముట్టకపోతున్నప్పటికీ, పూర్వంనుంచీ తాను ప్రకటిస్తున్న ప్రకటల్ని మాత్రం ఆపకుండా వేస్తూనే ఉన్నాడు. ధనికవర్గ అనుశాసనం మళ్ళీ ప్రత్యక్షమైంది. దాంతో, తాము పూర్వం ఇచ్చిన ప్రకటల్ని ప్రచురించడం మానుకోవలసిందని, ఛోటా ఛోటా వ్యాపారస్థులూ, ఉత్పత్తిదార్లూ, హియర్స్టుకు నోటీసుల వర్షం కురిపించారు. హియర్స్టు పూర్వపు పంథానే అనుసరించాడు. అతడిమీద ఇంజక్షన్ నోటీసులు జారీచేయబడ్డాయి. ఇంకా తన మార్గాన్ని వదల్లేదు. ఇంజక్షన్ నోటీసుల్ని ఖాతరుచేయనందువల్ల కోర్టుధిక్కారణ చేశాడన్న నేరంమీద అతడికి అర్ధసంవత్సర కారాగారవాస శిక్షపడింది. మరోచెంప, అతడిమీద లెక్కలేనన్ని నష్టపరిహారపు దావాలు వేసి దివాలా తీయించారు. అతడికి దిక్కూమొక్కూ లేకుండాపోయింది. ధనికవర్గం అతడికి శిక్ష విధించింది. ఆ శిక్షను అమలుపర్చడానికి న్యాయస్థానాలు ధనికవర్గం చేతుల్లో ఉన్నయ్. హియర్స్టు పతనంతో, అతడు కొద్దికాలంక్రితమే ఆక్రమించుకొన్న డెమాక్రటిక్ పార్టీగూడా బీటలువారిపోయింది.

హియర్స్టు, డెమాక్రటిక్ పార్టీల పతనంతో అతడి అనుచరులు అనుసరించాల్సిన పంథాలు రెండే మిగిలినై. సోషలిష్టుపార్టీలోచేరడమో లేకపోతే రిపబ్లికన్‌పార్టీలో దూరడమో. ఇకప్పుడు, హియర్స్టుయొక్క తప్పుడు సోష

లిష్టు సిద్ధాంత ప్రచార ఫలితం మాకు దక్కింది. ఎందుకంటే, అతడి అనుచరుల్లో అత్యధికులు మా పక్షం చేరారు.

పనికిమాలిన ఛోటా గ్రేంజి పార్టీ గనక ఈ సమయంలో తలెత్తకుండకపోతే, భూముల్నించి వెడలగొట్టబడ్డ రైతుల ఓట్లు గూడా మాకే వచ్చేవి. కర్షకుల్ని తమ పక్షం చేర్చుకోడానికి ఎర్నెస్టూ, సోషలిస్టు నాయకులూ హోరాహోరీగా పోరాడారు. కానీ సోషలిస్టు పత్రికలూ, ప్రచురణ సంస్థలూ, అణగారిపోవడం ఒక పెద్ద లోపమైంది. వాక్ ప్రచారం ఇంకా పరిణితస్థాయి పొందలేదు. అందువల్ల, ఏనాటినుంచో భూమినుంచి వెళ్ళగొట్టబడ్డ రైతులైన మి. కాల్విన్ వంటి రాజకీయవాదులు కర్షకుల్ని తాము స్వాధీనంచేసుకోని, వాళ్ల రాజకీయ సంపదను నిరుపయోగకరమైన ఉద్యమంలో వ్యయించారు.

"అభాగ్యకర్షకులు. భూముల్లోకి రావడమైనా, భూములు వదిలి పోవడమైనా గుత్తయజమాన్ల చేతుల్లోనే ఉంది. అని ఒకప్పుడు ఎర్నెస్టు వికటాట్టహాసం చేశాడు.

మరి నిజమైన పరిస్థితిగూడా అదే. పెద్ద గుత్తసంస్థాధికార్లు ఏడుగురూ కలిసి తమకున్న అత్యధిక శేషాల్ని కలేసికొని రైతు గుత్తసంస్థనొకదాన్ని ఏర్పాటు చేశారు. రైల్వేలు, కంట్రోలుధరలూ, బ్యాంకర్లూ, సరుకుమార్పిడి జూదగాళ్ళూ కలిసి ధరల్ని తమ అదుపు ఆజ్ఞలో పెట్టునిక్లో ఏనాడో రైతుల రక్తాన్ని పీల్చి, ఋణగ్రస్తుల్ని చేసినై. బ్యాంకర్లూ, ఆమాటకువస్తే గుత్తయజమాన్లందరూ చాలాకాలంనాడే రైతులకు భారీఅప్పులు పెట్టారు. రైతులు వలలో పడ్డారు. ఇంకా మిగిలినపని ఒక్కటే..ఆవలను దగ్గరకులాగి మూతిబిగించడమే. రైతు గుత్తసంస్థ ఈ పనికాస్తా పూర్తిచేయడానికి పూనుకొంది.

1912 వ సంవత్సరపు గడ్డుకాలంవల్ల రైతు మార్కెట్టు పడిపోయింది. దివాలా పరిస్థితులువచ్చేంత వరకూ కావాలన్ని ధరలు బాగా పడగొట్టేశారు.

దానికితోడు రైల్వేసంస్థ గుంజుకొన్న అమితమైన రేట్లభారంతో కర్షకుడి వెన్నెముక పూర్తిగా విరిగి కుప్పకూలాడు. ఇందుచేత, రైతుకు ఇంకా ఇంకా అప్పుతీసుకోక తప్పిందిగాదు. తానింతకుముందు తీసుకొన్న బాకీలు తీర్చుకోడానికి అవకాశమేలేదు. ఇకక్కణ్ణుంచి, గుత్తసంస్థ రైతులు రాసిచ్చిన ప్రాంశరీనోట్ల మొత్తాల్ని వసూలు చేసుకోడానికీ, తనఖాల్ని అమలుజరపడానికి దాడి ప్రారంభించింది. కిక్కురుగిక్కురుమనకుండా రైతులు తమ భూముల్ని రైతు గుత్తసంస్థకు అప్పగించి దాసోహమన్నారు. ఇంతకన్నా వాళ్ళకు మరో మార్గమేలేదు. భూముల్ని స్వాధీనపర్చి రైతు గుత్తసంస్థలో, మేనేజర్లుగా, సూపరింటెండెంట్లుగా, ఫోర్‌మన్‌లుగా, సామాన్య శ్రామికులుగా పనిచేయడానికి చేరారు. నిత్యభత్యంకోసం పనిచేశారు వాళ్ళు.

కొద్దిలో చెప్పాలంటే, ప్రాణాలు నిలబెట్టుకోడానికి ఆధారమైన కూలీతో భూమి బానిసలైనారు. యజమానులందరూ ధనికవర్గమే కాబట్టి వాళ్ళు యజమాన్లను వదిలిపెట్టిపోలేదు. పట్టణాలకుకూడా పోలేరు. ఎందుకంటే, అక్కడున్నదీ ధనికవర్గాధిపత్యమే. వాళ్ళకు గత్యంతరం ఒకటే. భూమికి స్వస్తిచెప్పి, దిక్కులేనిపక్షులై దేశాలు పట్టుకొని తిరిగి మలమలమాడి చావడం. చివరికి అదీ చేయడానికి వీలుకాలేదు. ఎందుకంటే, దేశద్రిమ్మరులుండగూడదనే శాసనాలు సృష్టించి వాటిని దారుణంగా అమలుజరిపారు.

కొన్ని ప్రత్యేక పరిస్థితుల దయవల్ల, అక్కడక్కడా కొందరు రైతులూ, కొన్ని రైతు సంస్థలూమాత్రం తమ ఆస్తిపాస్తులకు తిలోదకాలివ్వాల్సిన దశపట్టలేదనుకోండి! ఇటువంటి వాళ్ళంతాకలిసి మహాఉంటే సాతిన్ ఉంటారేమో! ఎట్లాగైతేనేం వాళ్ళందరూ తర్వాత సంవత్సరంలో కలిసారు.

1912 వ సంవత్సరాగమనంతో, ఒక్క ఎర్నెస్టుమినహా, తక్కిన సోషలిస్టు నాయకులంతా పెట్టుబడిదారివర్గ చరమదశ సమీపించిందని నిర్ధారించారు. క్లిష్టకాలం ఏర్పడడం, అనంతంగా నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోవడం, రైతులూ, మధ్యతరగతి ప్రజలూ అణగారిపోవడం, కార్మికసంస్థలకు పరాజయపరంపర సంభవించడం, పెట్టుబడిదారి వర్గానికి అంతిమదినాలు సమీపించినై, అని సోషలిస్టులు తలచడానికి, ధనికవర్గాన్ని కూలద్రోయడానికి నడుంగట్టి ముందుకు దూకడానికీ ఆస్కారం కలిగించినై.

అయ్యో! శత్రుబలాన్ని ఎంత తక్కువ అంచనావేశామంటేను! ఏమాత్రం పొరపాటులేకుండా పరిస్థితిని విశదంచేసి, ఎన్నికల్లో తాము ఘనవిజయాన్ని సాధిస్తామని సోషలిస్టులు అన్నిచోట్లా బల్లగుద్ది చెప్పారు. ధనికవర్గం ఆ సవాలుకు సరేనంది. బలాబలాలు సరితూకం చూసుకోని, మా బలాన్ని చీల్చి మమ్మల్ని ఓడగొట్టింది ధనికవర్గమే. సోషలిజమంటే పచ్చి నాస్తికవాదమనీ, కేవల దైవోల్లంఘనోద్దేశమే దాని ప్రధాన ఆశయమనీ తన రహస్యపు ఏజెంట్లద్వారా పెద్ద హంగామా చేసిందీ ధనికవర్గమే. అన్ని చర్చిలను, అందులోనూ ప్రత్యేకంగా కథోలిక్కు చర్చిని కార్యరంగంలోకి దూకించి, మారువచ్చే కార్మికుల ఓట్లల్లో కొన్నిటిని దోచుకొందీ ధనికవర్గమే. తన రహస్యపు ఏజంట్లద్వారానే అనుకోండి; గ్రేంజిపార్టీకి ప్రోద్బలంచేసి పట్టణాల్లోకిగూడా పరివ్యాప్తంచేసి గుటగుటలాడ్తోన్న మధ్యతరగతి ప్రజానీకంలోకి దాన్ని ప్రవేశపెట్టిందిగూడా ధనికవర్గమే.

ఏది ఏమైనా, సోషలిస్టులకు మాత్రం ఘోర పరాజయం కలిగింది. కానీ, ఎన్నికల్లో ప్రధానమైన కార్యనిర్వాహకోద్యోగస్థానాల్ని, అన్ని శాసనసభల్లో అత్యధికబలాన్ని సంపాదించడానికిబదులు చాలా తక్కువ సంఖ్యలో వచ్చాం. మేం 50 మంది సభ్యుల్ని కాంగ్రెసుకు ఎన్నుకొన్నమాట నిజమే. కానీ వాళ్లు 1913 వ సంవత్సరం వసంతుర్తువులో పదవీ స్వీకరణచేసినప్పుడు,

తమకు ఏ విధమైన అధికారం లేదని గ్రహించారు. ఐనా, పన్నెండు రాష్ట్ర ప్రభుత్వాల్ని స్వాధీనం చేసుకోనిగూడా వసంతుర్తువులో పదవీ స్వీకరణకు నిరాకరింపబడ్డ గ్రేంజిపార్టీకన్నా, మేమే గుడ్డిలో మెల్ల అనిపించాం. ఇంతకుముందు అధికారంలో ఉన్నవాళ్లు వైదొలగడానికి నిరాకరించారు. న్యాయస్థానాలు మరి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం చేతుల్లో ఉన్నవాయ్. కానీ రాబోయే పరిస్థితులకు ఇది చాలా దూరంలో ఉంది. నేనింకా 1912 వ సంవత్సరం శీతాకాలం నాటి గంద్రగోళ పరిస్థితులు చెప్పాల్సి ఉంది.

దేశంలో గడ్డుపరిస్థితులు ఏర్పడడంవల్ల కొనుగోలుశక్తి బాగాపడిపోయింది. కార్మికులు నిరుద్యోగులైనందువల్ల కొనుక్కోవటానికి వాళ్ళకు డబ్బేలేదు. దీని ఫలితం ఏమిటంటే, ఇదివరకటికన్నా ధనికవర్గానికి మరీ అత్యధిక శేషాలు తయారైనై. ఈ అత్యధిక శేషాల్ని విదేశాల్లో విడుదలచేయాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. తిమ్మిని బమ్మిచేసైనా బమ్మిని తిమ్మిచేసైనా అది తన పెద్దపెద్ద పన్నుగడల్ని సఫలం చేసుకోడానికి, డబ్బు చేసుకోవాలి. ప్రపంచపు మార్కెట్టులో తన అత్యధిక శేషాన్ని విడుదలచేసుకోవడానికి శాయశక్తులా కృషిచేసినందువల్ల, జర్మనీతో ఘర్షణకు దిగింది. సామాన్యంగా, ఆర్థిక సంఘర్షణతో యుద్ధం సిద్ధమౌతుంది. మరిప్పుడేర్పడ్డ సంఘర్షణకుమాత్రం ఆ మార్గంనుంచి తప్పించుకుపోవడం లేమా? రణశూరుడు జర్మనీ చక్రవర్తి యుద్ధానికి సిద్ధపడ్డాడు. అమెరికాగూడా అందుకు సై అంది.

యుద్ధ కారుమేఘాలు ప్రపంచమంతా భయంకరంగా గర్జించినై. ప్రపంచ ప్రళయమే ముంచుకువచ్చే దశ ఏర్పడింది. ఎందుకంటే జగత్తంతా గడ్డుకాలంలో ఉంది. కార్మికుల కష్టాలకు అంతేలేదు. మధ్యతరగతి ప్రాణాలు గుటగుటలాడుతున్నాయ్. నిరుద్యోగుల సంఖ్య నానాటికీ అపరిమితమౌతోంది. ప్రపంచపు మార్కెట్టులో ఆర్థిక ఘర్షణలు చెలరేగినై. సోషలిస్టు విప్లవ నినాదాలు మార్మోగుతున్నాయ్.

జర్మనీతో లడాయిపెట్టుకోడానికి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం అర్రులు చాచింది. అది యుద్ధానికి తహతహలాడడానికి ఇంకా అనేక కారణాలున్నయి. అటువంటి అల్లకల్లోల పరిస్థితుల్లో యుద్ధంవల్ల అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి లాభదాయకమైన అంతర్జాతీయ పునర్నిర్మాణ పరిణామాలూ, కొత్త సంధులూ, కొత్త స్నేహాలూ ఏర్పడుతై. యుద్ధంవల్ల ఇంకా పైగా అనేక జాతీయ అత్యధిక శేషాలు హరించుకుపోతై. దినదినం పెరిగిపోతూ అన్ని దేశాల్లో కంటకప్రాయంగా తయారైన నిరుద్యోగసమస్యా పరిష్కారం కూడా చాలావరకు జరుగుతుంది. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి ఊపిరిపీల్చుకోనే సావకాశం కలుగుతుంది. ఈ వ్యవధిలో తన పన్నుగడల కొక పూర్ణస్వరూపన్నిచ్చి అమలుపర్చడానికి వీలుకలుగుతుంది. అటువంటి యుద్ధంవల్ల అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వానికి ప్రపంచపు మార్కెట్టుమీద ఆధిపత్యం లభిస్తుంది. అదీగాక, ఈ యుద్ధం మూలకాన పెద్దసైన్యం ఒకటి శాశ్వతంగా ఏర్పడుతుంది. ఈ లోపల ప్రజల మనస్సుల్లో సోషలిజమా? అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వమా? అన్న సమస్యకు బదులు; అమెరికా? జర్మనా? అన్నది బైలుదేరుతుంది.

నిజానికి సోషలిస్టుల బెడదేగనక లేకపోతే యుద్ధం ఇదంతా చేసి ఉండేదే. వెల్ వీధిలో ఉన్న మా నాల్గు చిన్న గదుల్లో, పాశ్చాత్యనాయకుల రహస్య సమావేశం ఒకటి జరిగింది. సోషలిస్టులు తీసుకోవలసిన మార్గం మొదటగా ఇక్కడ సమాలోచింపబడ్డది. యుద్ధపిశాచి నెత్తిమీద కాళ్లు పెట్టడం మాకిది మొదటిసారికాదు. కానీ, అమెరికాలో రణరాక్షసి శిరస్తాడనం చేయడం మాత్రం ప్రథమ పర్యాయమే. మా రహస్యసమావేశం తర్వాత, మాకు జాతీయసంస్థతో పరిచయం ఏర్పడింది. వెంటనే, మాకూ అంతర్జాతీయబ్యూరోసంస్థకూ పరస్పరంగా అట్లాంటిక్ సముద్రం ద్వారా సాంకేతిక నిస్తంత్రీ వార్తాప్రచారం నిరభ్యంతరంగా సాగిపోతోంది.

మాతోబాటు పనిచేయడానికి జర్మన్ సోషలిస్టులు సంసిద్ధంగా ఉన్నారు. వాళ్లు 50 లక్షల పైచిలుగ్గా ఉన్నారు. అందులోనూ వాళ్లల్లో చాలామంది సైన్యంలో ఉన్నారు. పైగా కార్మికసంస్థల్లో వాళ్లు మంచిగా ఉన్నారు. రెండుదేశాల్లోనూ సోషలిస్టులు నిర్భయంగా యుద్ధవ్యతిరేక పత్రికటల్ను చేసి, సర్వవ్యాప్తమైన సమ్మె సాగిస్తామనికూడా బెదరించారు. అదీగాక సోషలిస్టుల అంతర్జాతీయ శాంతిసిద్ధాంతాన్ని, ఎంతకైనాసరే తెగించి, ఆఖరికి స్వదేశాల్లో తిరుగుబాట్లూ, విప్లవాలుకూడా లేవదీసి సంరక్షించాలని, అన్నిదేశాల విప్లవసంస్థలూ బహిరంగ ప్రకటనలు చేసినై.

అమెరికన్ సోషలిస్టులమైన మేం ఈ సర్వవ్యాప్తమైన సమ్మెలో ఘన విజయం పొందాం. డిసెంబరు 4 వ తారీఖున జర్మన్ ముఖ్యపట్టణం నుంచి అమెరికన్ మంత్రి ఉపసంహరింపబడ్డాడు. ఆ రాత్రి జర్మన్ నావికాదళం ఒకటి 'హనోలులూ' మీదికి విరుచుకుపడి, మూడు అమెరికన్ క్రూయిజర్లనూ, ఒక రెవెన్యూ కట్టరును ముంచేసి పట్టణంమీద బాంబులవర్షం కురిపించింది. మర్నాడు అమెరికా, జర్మనీలు యుద్ధం ప్రకటించినై. యుద్ధ ప్రకటన వచ్చిన ఒక్క గంటలోపల్నే రెండు దేశాల సోషలిస్టులూ సర్వవ్యాప్తమైన సమ్మెకు పిలుపిచ్చారు.

జర్మన్ ప్రభువు తన సామ్రాజ్య పరిపాలనకు ఆధారమైన ప్రజను ఎదుర్కోవలసిన పరిస్థితి మొదటిసారిగా ఏర్పడింది. వాళ్లు లేకపోతే తన సామ్రాజ్యం ఒక్క రోజుకూడా నడవదు. అసలు తమాషా ఏమిటంటే, వాళ్ళ తిరుగుబాటు 'కొట్టవద్దూ తిట్టవద్దూ......' అనే రకంలో ఉంది. ఏమీ చేయకుండానే చక్రవర్తి చేతులు కట్టేశారు. తన జనంమీదికి యుద్ధ జాగిలాల్ని ఉసికొల్పడానికి తగిన సమయంకోసమే అతడు కాచుకూర్చున్నాడు. కానీ అవకాశం చిక్కలేదు. యుద్ధజాగిలాల్ని ఉసికొల్పలేక పోయాడు. యుద్ధానికి సైన్యాన్ని సమీకరించలేక పోయాడు. అంతేకాదు,

ఎదురు తిరిగిన ఉద్యోగుల్ని కూడా శిక్షించలేకపోయాడు. ఆయన సామ్రాజ్యంలో ఒక్క యంత్రంకూడా ఆడడంలేదు. ఒక్క రైలు నడవడంలేదు. ఒక్క టెలిగ్రాఫ్ వార్తకూడా ప్రయాణం చేయలేదు. ఎందుకంటే. తక్కిన ప్రజల్తోబాటే రైల్వే పనివాళ్ళూ, టెలిగ్రాఫ్ ఉద్యోగులూ పనిచేయకుండా బైఠాయించారు.

జర్మనీలో ఎంత జరిగిందో అమెరికాలోనూ అంతే జరిగింది. చివరికి సుసంఘటిత కార్మికబృందం తన గుణపాఠాన్ని నేర్చుకొంది. తాను ఎన్నుకొన్న రంగంలో పూర్తిగా దెబ్బతిని ఆ రంగానికి స్వస్తిచెప్పి, సోషలిస్టు రాజకీయరంగంలోకి ప్రవేశించింది. ఎందుకంటే, సర్వవ్యాప్తమైన సమ్మె రాజకీయపు సమ్మె. దానికి తోడు సంఘటిత కార్మికబృందం తాను లక్ష్యపెట్టనంతగా దెబ్బతింది. కేవలం నిరాశా నిస్పృహలవల్లనే, అది సర్వవ్యాప్తమైన సమ్మెలో పాల్గొంది. లక్షోపలక్షలు కార్మికులు తమ పనిముట్లన్నీ మూలపారేసి పనులు మానేశారు. ఆ దుంలో ప్రత్యేకంగా గమనింపదగ్గవాళ్ళు యంత్ర కార్మికులు. వాళ్ళ తలలు నెత్తురుముద్దలైనై. వాళ్ళనిర్మాణ సంస్థ పూర్తిగా నాశనమైపోయింది. ఐనా, వాళ్ళు తమ స్నేహితులైన లోహకార్మికుల్తో సహా బైటికివచ్చేశారు.

సామాన్య కార్మికులూ, చెల్లాచెదురుగా ఉన్న తక్కిన కార్మికులూ పనిచేయడం మానేశారు. ఎవళ్ళూ పనిచేయడానికి వీలులేకుండా సమ్మె ప్రతి విషయాన్నీ బంధించివేసింది. పైగా స్త్రీలు, సమ్మెకు బాగా జీవం పోసి, ఉసిచ్చారు. యుద్ధవ్యతిరేకంగా నడుంబిగించి నిలిచారు. తమ మొగవాళ్ళు యుద్ధంలోకిపోయి మరణించడానికి అంగీకరించలేదు. అప్పుడు సమ్మెకూడా ప్రజాభావనను ఆకట్టేసింది. వాళ్ళ పరిహాసాన్ని పటాపంచలు చేసింది. సమ్మె భావం గాలిలాగా ప్రతివాళ్ళల్లోనూ ప్రాకిపోయింది. పిల్లలు బళ్ళకేపోవడం మానుకొన్నారు. వచ్చిన పంతుళ్ళు ఖాళీ బెంచీలు

చూచి ఇంటి మొగం పట్టారు. సర్వవ్యాప్తమైన ఈ సమ్మె ఒక గొప్ప జాతీయ విహార సంతర్పణగా తయారైంది. ఇంతగా రహస్యమైన కార్మిక సుసంఘటిత విధానం అందరి ఊహాలకు బాగానచ్చింది. ఇంతకూ అసలీ బ్రహ్మాండమైన వినోదక్రీడలో వచ్చే అపాయమూ లేదు. ప్రతివాడూ నేరస్థుడైతే, శిక్షించేవాడెవడు ?

అమెరికా స్తంభించిపోయింది. ఏం జరుగుతున్నదీ ఎవరికీ తెలియదు. వార్తా పత్రికలూ, ఉత్తరాలూ, పోస్టురవాణాలూ లేవు. తనకూ తక్కిన సంఘానికీ మధ్య ఒక పదిమైళ్ళ ఎడారి ఏర్పడ్డట్టుగా, సంఘానికీ సంఘానికీ సంబంధం లేకుండా ప్రతి సంఘం, 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్టుగా ఉంది. ఆ మాటకొస్తే ప్రపంచమే నిర్జీవమైపోయిందని చెప్పవచ్చు. ఒక్క వారంరోజులవరకూ సర్వత్రా ఇటువంటి పరిస్థితే రాజ్యంచేసింది.

అఘాతానికి అవతల ఉన్న అక్లండులోగాని బర్క్లీలోగాని ఏం జరుగుతున్నదీ, కనీసం శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్న మాకూ తెలియదు. ప్రతి వ్యక్తీ కుప్పకూలాడు. జగత్సంబంధమైన బ్రహ్మాండమైన జీవి ఏదో మరణించిందనిపించింది. భూమాత నాడికొట్టుకోవడం ఆగింది. నిజానికి జాతే మరణించింది. వీధుల్లో బళ్ళ రావంథాళి లేదు. మిల్లు మూగనోము పట్టింది. విద్యుద్దీపకాంతి పెడమొగం పెట్టింది. ట్రాముల కార్లు చచ్చుబడ్డాయి. వార్తా పత్రికలు అమ్మే కుర్రాళ్ల గొంతులు వినపడడం లేదు. ఇక కాగాపోగా, రహస్య సంచారంచేసే భూతాల్లాగా, తమాం క్రుంగిపోయి, మాటామంతీ లేకుండా మనుష్యులుమాత్రం అడపాదడపా రాకపోకలు సాగిస్తున్నారు.

మౌనముద్రబట్టిన ఆ వారంరోజులూ, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి తగిన గుణపాఠం నేర్పినై. అది ఆ గుణపాఠాన్ని బాగా నేర్చుకొంది. సర్వవ్యాప్తమైన సమ్మెగానికి హెచ్చరికగా పనిచేసింది. ఇటువంటి

పరిస్థితి మళ్ళీ ఏర్పడగూడదు. ఇది జరక్కుండా అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం చూస్తుంది.

ముందుగానే సర్వసన్నాహంచేసికొన్నందువల్ల, వారాంతంలో అమెరికా టెలిగ్రాఫ్ ఉద్యోగులు తమ తమ ఉద్యోగాల్లో మళ్ళీ ప్రవేశించారు. రెండుదేశాల సోషలిస్టు నాయకులూ వాళ్ల ద్వారా, 'యుద్ధాన్ని ఉపసంహరించుకోండి, లేకపోతే సర్వవ్యాప్తమైన సమ్మె కొనసాగుతుంది' అన్న తమ అంత్యనిర్ణయాన్ని ప్రభుత్వాలకు అందజేశారు. అంగీకారానికి రావడానికి అట్టేకాలం పట్టలేదు. యుద్ధం ముగిసింది అన్న ప్రకటన వచ్చింది. రెండు దేశాల్లోని ప్రజలు, మళ్ళీ తమ తమ పనుల్ని ప్రారంభించారు.

శాంతి పునఃప్రతిష్ఠాపనవల్లనే జర్మనీకి అమెరికాకు భాయీ భాయీ భావం ఏర్పడింది. యథార్థానికి, తమ ఉభయులకూ శత్రువైన విప్లవ ప్రజానీకాన్ని ఎదుర్కోవడానికి ఏర్పడ్డ స్నేహభావమిది. జర్మను సోషలిస్టులు తమ చక్రవర్తిని సింహాసనభ్రష్టుణ్ణిచేసినప్పుడు, చివరికి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం ఈ స్నేహాన్ని మహాఘోరంగా విచ్ఛిన్నంచేసింది. ప్రపంచపు మార్కెట్టులో తనకు పెద్ద ప్రత్యర్థిగా తయారైన జర్మనీని తుడిచిపెట్టడం కోసమే, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం ఇంతనాటకమూ ఆడింది. జర్మన్ చక్రవర్తి పతనంతో, జర్మనీలో విదేశాల్లో అమ్ముకోవలసిన అధికశేషం ఉండదు. సోషలిస్టు ప్రభుత్వ సహజస్వభావాన్ననుసరించి, జర్మన్ ప్రజానీకం తాను ఉత్పత్తిచేసిందంతా తానే వినియోగం చేసుకోగలదు. తాను స్వయంగా ఉత్పత్తిచేయని వస్తువుల మారకం కోసం, తన ఉత్పత్తి వస్తువుల్ని విదేశాల్లో అమ్ముతుందనుకోండి. కానీ, ఖర్చుపెట్టలేని అత్యధికశేషంకన్నా ఇది విభిన్నమైన విషయం.

అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం, జర్మనీకిచేసిన ఘోరద్రోహం బట్టబయలైన తర్వాత, "తాను చేసినపని సధర్మమేనని, అల్పసంఖ్యాక నిరంకుశ

ప్రభుత్వం సమర్థించుకొంటుందని పందెంవేసి చెప్తాను. ఇదివరకు మాదిరిగానే, తాను సక్రమమైన పనే చేశానని అది విశ్వసిస్తుంది." అన్నాడు ఎర్నెస్టు.

ఏ అమెరికన్ ప్రజల శ్రేయస్సుకోసం తాను పాటుబడుతున్నానని దంభాలు చెపుతున్నదో, ఆ ప్రజలకోసమే ఈ పనిచేశానని అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం బహిరంగంగా సమర్థించుకొంది. తన ప్రతిశక్తికి, ప్రపంచపు మార్కెట్టునుంచి ఉద్వాసన చెప్పింది. మా అత్యధిక శేషాన్ని ఆ మార్కెట్టులో విడుదలచేసుకోవడానికి వీలుకల్పించింది.

"నిజంగా అటువంటి బుద్ధిహీనులు మన శ్రేయస్సుకోసం యాజమాన్యం వహిస్తుంటే, ఏమిచేయిలేకుండా, నెత్తీ నోరూ బాదుకొంటూ ఆక్రందించడమే మనలో ఉన్న పెద్దలోపం. విదేశాల్లో ఎక్కువ అమ్మకం సాగించే సదుపాయం వాళ్లు కల్పించారు. అంటే, స్వదేశంలో తక్కువ ఖర్చుచేసే పద్ధతికి మనల్ని ముక్కుకు తాడేసి లాగుతున్నారన్నమాట." అని జరిగిన పరిస్థితులమీద ఎర్నెస్టు వ్యాఖ్యానించాడు.

## ౧౪

1913వ సంవత్సరం జనవరి మొదట్లోనే, పరిస్థితుల నిజస్వరూపాన్ని ఎర్నెస్టు ఆకళింపు చేసుకొన్నాడు. కానీ, తన మనస్సులో సాక్షాత్కరించిన ఉక్కుపాద స్వరూపాన్ని, తన తోటి నాయకులు దర్శించేటట్లు చేయలేకపోయాడు. అవి ఆంతరంగిక విషయాలు. ఉచ్ఛస్థాయి పొందడానికి సంఘటనలు త్వరత్వరగా నెట్టుకువస్తున్నై. ప్రపంచ పరిస్థితుల్లో ప్రళయం ముంచుకువచ్చింది. అమెరికా అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం, ప్రపంచపు మార్కెట్టును తన గుప్పెట్లో పెట్టుకొంది. కొన్ని డజన్ల దేశాలు, అమ్మలేని, ఖర్చుపెట్టలేని అత్యధిక శేషాల్తో ప్రపంచపుమార్కెట్టునుంచి అలో లక్ష్మణా అని నెత్తిన గుద్దేసుకొని బైటికివచ్చేసినై. పునర్ని

ర్మాణవిధానంతప్ప అటువంటిదేశాలకు తరణోపాయమే లేదు. ఆ దేశాలు ఇంకా అత్యధిక శేషాల్ని ఉత్పత్తిచేసే పంథాను అనుసరించలేవు. ఆ దేశాల విషయంలో పెట్టుబడిదారీవర్గం ఘోర పతనం చెందింది.

ఈ దేశాల పునర్నిర్మాణ విధానం విప్లవ స్వరూపాన్ని దాల్చింది. అది కంద్రగోళసమయం. హింసాకాలం. ప్రతిచోటా సంస్థలూ, ప్రభుత్వాలూ పతనం చెందుతున్నయ్. రెండుమూడు దేశాల్లో మినహా, పెట్టుబడిదారీవర్గ యజమాన్లు తమ ఆధిపత్యంకోసం కాయశక్తులా పోరాడుతున్నారు. కానీ, ఉత్సాహవంతులైన కార్మికులు, వాళ్ల నెత్తినమొట్టి ప్రభుత్వాలు ఊడ లాక్కొంటున్నారు. "ప్రత్యేక పెట్టుబడిదారీవర్గపు చరమదశా యమమహిష ఘంటారావం వినబడుతోంది. పీడకులు పీడవదిలిపోతారు." అన్న కారల్ మార్క్స్ సుభాషితం చిట్టచివరికి అక్షరాలా జరిగింది. పెట్టుబడిదారీ ప్రభుత్వాలు ఎంత త్వరగా పతనంచెందినయ్యో, అంత త్వరలో వాటిస్థానే కోఆపరేటివ్ కామన్‌వెల్తు ప్రభుత్వాలు వెలసినై.

"అమెరికా వెనకబడి ఉండటానికి కారణమేమిటి?" "ఓ అమెరికన్ విప్లవవాదుల్లారా! త్వరపడండి!" "అమెరికా విషయం ఏమిటి?" అని ఇతర దేశాల్లో విజయంసాధించిన కామ్రేడ్స్‌నుంచి మాకు వార్తలు వచ్చినై. కానీ మేం నిలదొక్కుకోలేకపోయాం. మా మార్గానికి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం సైంధవుడిలా అడ్డపడ్డది.

"వసంతుర్తువులో మేం అధికారంలోకి వచ్చేదాకా ఆగండి. ఇకప్పుడు చూద్దురుగాని మా తడాఖా." అని మేం సమాధానం చెప్పాం.

మా రహస్యం దాని వెనకాల దాగి ఉంది. గ్రేంజర్లను గెలిచాం. ఎన్నికల పుణ్యమా అంటూ, వసంతుర్తువులో ఒక డజను ప్రభుత్వాలు వాళ్ల చేతుల్లోకిపోతై. వెంటనే ఒక డజను కోఆపరేటివ్ కామన్‌వెల్తు ప్రభుత్వాలు వెలువడతై. దాని తర్వాత అంతా, నల్లేరుమీది బండి నడకే.

"గ్రేంజర్లే అధికారంలోకిరాక పరాజయంపొందితేనో మరి?" అని ప్రశ్నించాడు ఎర్నెస్టు. ఆయన స్నేహితులందరూ ఆయన్ను రథసారథుడు అనీ శకునపక్షి అనీ పిలిచారు.

కానీ, అధికారం సంపాదించకుండా పరాజయంపొందడమే ప్రధాన ప్రమాదం అన్నదికాదు ఎర్నెస్టు బుర్రలో ఉంది. పెద్ద కార్మికసంస్థలు పతనంచెంది, వర్గాలు తలెత్తుతై అన్నది ఆయన భవిష్యద్దర్శనం.

"ఆ పని ఎట్లాచెయ్యాలో అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి 'ఘెంటు' నేర్పే ఉంచాడు. 'కరుణాకర భూస్వామ్యవిధానం' అన్న ఆయన గ్రంథాన్నుంచి, వాళ్లు పాఠ్యగ్రంథాన్ని తయారుచేయించారని పందెంవేసి చెప్తున్నా." అన్నాడు ఎర్నెస్టు.

ఒక అరడజనుమంది నాయకుల్తో తీవ్రంగా వాదించిన తర్వాత నావేపు తిరిగి, ప్రశాంతకంఠంతో, "అదే తేలుస్తుంది. ఉక్కుపాదం విజయం పొందింది. అంత్యదశ కనుచూపుదూరంలో ఉంది." అని ఎర్నెస్టు చెప్పిన ఆ రాత్రిని జన్మజన్మేపీ మరచిపోలేను.

మా ఇంట్లో జరిగింది అనధికార సమావేశం. కానీ, వచ్చే సర్వవ్యాప్తమైన సమ్మెలో తమ ప్రజలు పాల్గొనేటట్లు చేస్తామని, కార్మిక నాయకుల దగ్గర్నుంచి వాగ్దానాలు తీసుకోవడంకోసం, తక్కిన కామ్రేడ్సు మాదిరిగానే, ఎర్నెస్టూ కృషిచేస్తున్నాడు. యంత్ర కార్మిక సంస్థకు అధ్యక్షుడైన, 'ఓ, కన్నార్,' అక్కడ హాజరైన అరడజనుమంది నాయకుల్లో, అటువంటి వాగ్దానం చేయడానికి నిరాకరించిన వాళ్ళల్లో అగ్రగణ్యుడు.

"సమ్మెలో, బహిష్కరణోద్యమంలో మీపూర్వ వ్యూహాలమీద చావుదెబ్బ తగిలిందని మీరందరూ కళ్ళారా చూచే ఉన్నారుగా." అని ఎర్నెస్టు గట్టిగా అన్నాడు. ఓకన్నారు, తదితర్లూ తలలూపారు.

"సర్వవ్యాప్తమైన సమ్మె ఏం చేయగలదో కూడా చూచారు. మనం, జర్మనీతో యుద్ధాన్ని అటకాయించాం. ఇంత సుసంఘటితశక్తి, కార్మికబలం ఇంతకు ముందెన్నడూ ప్రదర్శించబడలేదు. కార్మికులు ప్రపంచాన్ని పాలించగలరు. పాలిస్తారుగూడా. మాతో బాటే మీరూ, నరకమో స్వర్గమో అని పూర్వంమాదిరిగానే కలిసివస్తే, పెట్టుబడిదారి వర్గానికి సమాధికడ్తాం. మీకున్న ఆశల్లా అదొక్కటే. అది మీకు తెలుసు. మరో మార్గమేలేదు. పాత పద్ధతుల్లో మీరేమైనా చేయండి, మీకు అపజయం వచ్చేరాత తప్పదు. మరేంకారణం అవసరంలేదు. యజమాన్లు కోట్లని చేతుల్లో పెట్టుకొన్నారు."

"నీవు మహావేగంతో ముందుకు పరుగెత్తుకుపోతున్నావ్. ఉన్న మార్గాలన్నీ మీకు తెలియదు. మరోమార్గంకూడా ఉంది. ఏం చెయ్యాలో మాకు తెలుసు. సమ్మెల్తో మాకు తల ఈపనగాయ పుట్టిపోయింది. వాళ్ళు మన వెన్నెముక విరగ్గొట్టారు. మళ్ళీ మనవాళ్ళను పిలవాల్సిన అవసరం ఇక కలుగుతుందనుకోను" అన్నాడు ఓ కన్నార్.

"నీకున్నమార్గం ఏమిటి ?" అని ఎర్నెస్టు నిష్కర్షగా అడిగాడు.

ఓ కన్నార్, నవ్వితలూపి, "ఈమాత్రం చెప్పగలను. మేం నిద్రపోవడంలేదు. ఇప్పుడు మేం పగటికలలుగూడా కనడంలేదు." అన్నాడు.

"భయపడాల్సిన అగత్యంగాని, సిగ్గుజెందాల్సిన అవసరంకానీ లేదనుకొంటా" అని ఎర్నెస్టు సవాలు విసిరాడు.

"మీ అందరికన్నా మాకర్తవ్యమేంటో మాకే బాగా తెలుసుననుకొంటా" అని తిరుగు సమాధానం వచ్చింది.

"అది దొంగచాటు పని. దాన్ని మీరు అసలు మార్గంనుంచి దాస్తున్నారు." అని ఎర్నెస్టు కోపోద్రిక్తంగా మాట్లాడాడు.

"మేం చెమటోడ్చి, నెత్తురుకార్చి అనుభవం సంపాదించాం. మాకు వచ్చేదంతా సంపాదించాం. 'ఇంటగెల్చి రచ్చగెలవాలి.' " అన్నాడు ఓ కన్నార్ జవాబుగా.

"మీకున్న మార్గాన్ని మీరు చెప్పడానికి భయపడ్తూంటే, నేను మీకు చెప్తా. మీరు దొంగలూ దొంగలూ ఊళ్లు పంచుకొనే వ్యవహారంలోకి దిగ బోతున్నారు. మీరు శత్రువుతో మంతనాలాడారు. మీరు ప్రపంచ కార్మిక ప్రయోజనాన్నే అమ్మేశారు. చచ్చు పిరికిపందలు మాదిరిగా మీరు రణరం గాన్ని వదలి వెళ్తున్నారు." ఎర్నెస్టు రక్తం తుక తుకలాడ్తోంది.

"నేనేమీ అనడంలేదు. మాకు శ్రేయోదాయకమైన పద్ధతి ఏదో అది మీకన్నా, మాకే కొంచెం బాగా తెలుసుననుకొంటున్నా." అని ఓకన్నార్ కోపంతో సమాధానం చెప్పాడు.

"తక్కిన కార్మికులకంతా శ్రేయోదాయకమైన విషయాన్ని మీరు దమ్మిడీ ఎత్తుగూడా లక్ష్యపెట్టరు. ఆ విషయాన్ని గుంటలోత్రొక్కేస్తారు."

"యంత్రకార్మికసంస్థకు అధ్యక్షుణ్ణనీ, నేను ప్రాతినిధ్యంవహిస్తున్న ప్రజల శ్రేయస్సును ఆలోచించడం నా పని అనీతప్ప, మరేమీ చెప్పడంలేదు, అంతే."

కార్మిక నాయకులు వెళ్ళిపోయినతర్వాత, పరాజయ ప్రశాంతతతో, జరగబోయే పరిస్థితులవిధానాన్ని, రేఖామాత్రంగా ఎర్నెస్టు నాకుచెప్పాడు.

"సుసంఘటితులైన కార్మికులు, పారిశ్రామికరంగంలో పరాజయం పొందినప్పుడు, రాజకీయరంగంలో ప్రవేశించేరోజు వస్తుందని, సోషలిస్టులు చంకలెగరేసుకొంటూ మహదానందంతో జోస్యం చెప్పేవాళ్లు. అది సరే. ఉక్కుపాదం, కార్మికసంస్థల్ని పారిశ్రామికరంగంలో ఓడించి, రాజకీయ రంగంలోకి తరిమేసింది. ఈ సంఘటన మనకు సంతోషాన్ని కల్గించడానికి బదులు దుఃఖం తెచ్చిపెట్టింది. ఉక్కుపాదం తన గుణపాఠాన్ని నేర్చుకొంది. సర్వవ్యాప్తమైన సమ్మెలో దానికి మన బలం రుచి చూపించాం. మరో సర్వవ్యాప్తమైన సమ్మె రాకుండా అది తగిన బందోబస్తుచేసుకొంది."

"కానీ, అదెట్లా?" అని ప్రశ్నించా.

"పెద్ద సంస్థలకు ధనసహాయంచేయడమే. వాళ్ళు మళ్ళీవచ్చే సమ్మెలో చేరరు. అందువల్ల అది సర్వవ్యాప్తమైన సమ్మెకాదు."

"కానీ, ఉక్కుపాదం ఎల్లప్పుడూ అంత ఎక్కువ ఖర్చుతోకూడిన విధానాన్ని అనుసరించలేదు." అని ఆక్షేపణ తెలిపా.

"ఓ! అది అన్నిసంస్థలకూ ధనసహాయంచేయదు. అది అవసరంకూడా కాదు. జరగబోయే దిదిగో. రైల్వేసంస్థకూ, ఇనుమూ, ఉక్కూ కార్మికసంస్థలకూ, ఇంజనీర్, యంత్రకార్మికసంస్థలకూ, ముందు ముందుగానే జీతాలు చెల్లించి, పనిచేసే గంటలు తగ్గించబోతున్నారు. ఈ సంస్థల్లో అదనపు సౌకర్యాలు కల్పించబడబోతున్నాయ్. ఈ సంస్థల్లో సభ్యత్వం, స్వర్గసింహాసనాన్ని అధిష్టించడంగా తయారౌతుంది."

"ఐనా నాకర్థంకావడంలేదు. తక్కిన సంస్థలవిషయం ఏమిటి? ఈ సంస్థల సమైక్యతకన్నా, ఇందులో చేరని సంస్థలింకా బోలెడన్ని బైట ఉన్నయ్ గదా!" అని అభ్యంతరం తెలిపా.

"తక్కిన సంస్థలన్నిటినీ నామరూపాలులేకుండా మట్టిలో కాళ్ళతో మట్టగిస్తారు. ఈ మన యంత్రి నాగరికతలో, అత్యవసరమైన ప్రధానమైన పనంతా, రైల్వేవాళ్ళు, యంత్రి కార్మికులూ, ఇంజనీర్లూ, ఇనుము, ఉక్కూ కార్మికులూ నిర్వహిస్తున్నారని నీకు తెలిసిన విషయమేగా. వీళ్ళంతా విశ్వాసనీయులేఅన్న నమ్మకంగట్టిగా ఏర్పడ్డతర్వాత, ఇక తక్కిన కార్మికులందరిమీదికీ ఉక్కుపాదం తన రాక్షస హస్తాలు చాస్తుంది. మొత్తం పారిశ్రామికరంగానికి, ఇనుము, ఉక్కు, బొగ్గు యంత్రాలూ, సరఫరా వెన్నెముకలాంటివి."

"కానీ బొగ్గో? దాదాపుగా పది లక్షలమంది బొగ్గు కార్మికులున్నారుగా?" అని ప్రశ్నించా.

"వాళ్ళంతా నిపుణులైనవాళ్ళు కారు. వాళ్లు లెక్కలోకి రారు. వాళ్ళ జీతాలు తీసికట్టయ్, పనిచేసే గంటలు హెచ్చుతై. తక్కిన మనకు మాదిరిగానే వాళ్ళూ బానిసలౌతారు. మనకన్నా పశుప్రాయులౌతారు.

తమను నిలువుదోపిడీ చేసిన యజమాన్లకోసం, తప్పనిసరిగా పరిశ్రమించే రైతులు మాదిరిగానే, వీళ్ళనూ మెడలువంచి మరీ పనిచేయిస్తారు. ఈ సమైక్యతలో కలవకుండా బైటఉన్న సంస్థలన్నిటికీ ఇదే. వాళ్ళు ఇరకాటంలో పడి, ఛిన్నాభిన్నమైపోతారు చూడు. ప్రభుత్వశాసనాలవల్ల, కాలేకడుపుల్తో బానిసల్లాగా పరిశ్రమించాల్సినపరిస్థితి, వాళ్ళ సభ్యులకు పట్టుతుంది."

"ఫార్లేకూ, అతడి సమ్మె విధ్వంసకులకూ ఏంజరుగుతుందో తెలుసా? నేచెప్తావిను. వృత్తిగాఉన్న సమ్మె విధ్వంస కార్యక్రమం ఆగిపోతుంది. ఇక ముందు సమ్మెలేఉండవ్. సమ్మెల స్థానంలో బానిసల తిరుగుబాట్లు బైలుదేరుతై. ఫార్లే, అతని ముఠా, బానిసల్ని పారద్రోలే వృత్తికి దిగుతారు. ఓహో! దాన్ని అట్లా పిలవగూడదు. కార్మికుల్ని పనిచేయించడంకోసం ప్రభుత్వ శాసనాల్ని అమలుజరపడం అని పిలుస్తారు. కాకపోతే, ఈ పెద్ద సంస్థల విద్రోహచర్య, పోరాటాన్ని ఇంకా కొంచెంకాలం పొడిగిస్తుంది. అంతే. విప్లవం, ఎప్పుడు, ఎక్కడ విజయం పొందుతుందో దైవానికే తెలుసు."

"కానీ, పెద్దసంస్థలూ, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం కలిసిన ఇటువంటి శక్తిమంతమైన సమైక్యతముందు, ఎప్పుడైనా విప్లవం విజయం పొందుతుందని నమ్మడానికి ఆస్కారముందా? ఈ సమైక్యత ఎప్పుడూ ఉండవచ్చుగదా?" అని ప్రశ్నించా.

"వర్గంమీద, కులంమీద ఆధారపడ్డ ప్రతివిధానంలోనూ దానివిధ్వంస క్రిములుంటై అన్నది, మన సామాన్య సూత్రాల్లో ఒకసూత్రం. వర్గాధారంపై సృష్టింపబడ్డ విధానంలో కులతత్వం ప్రవేశించకుండా ఎట్లా అడ్డగలం? దాన్ని అటకాయించడం, ఉక్కుపాదం తరంగాదు. చివరికి కులమే ఉక్కుపాదాన్ని ముక్కలుచేస్తుంది. ఈ పాటికే అల్పసంఖ్యాక నిరంకుశాధికార్లల్లోనే కుల తత్వాలు ప్రబలిపోయినై. కానీ, అభిమాన సంస్థల్లోకూడా కుల

తత్వాలుప్రబలేదాకా వేచిఉండు! దాన్ని నిరోధించడానికి ఉక్కుపాదం తన అధికారాన్నంతా వినియోగిస్తుందికాని అపజయం పొందుతుంది."

"వాళ్ళ ఆదరాభిమానాలు చూరగొన్న సంస్థల్లో నిగ్గుదేరిన అమెరికన్ కార్మికులున్నారు. వాళ్ళు బలిష్టులు. సమర్థులు. స్థానంకోసం పోటీబడి వీళ్ళు సంస్థల్లో సభ్యత్వం సంపాదించారు. అమెరికాలో నిపుణుడైన ప్రతి కార్మికుడికీ, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ అభిమాన సంస్థల్లో సభ్యుడిగా చేరాలనే పెద్ద అభిలాష రేకెత్తుతుంది. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం వాడిలోఉన్న దురాశను రెచ్చగొట్టి పోటీని పురికొల్పుతుంది. ఈ విధంగా, విప్లవవాదులుగా ఉపయోగపడే బలిష్టకార్మికుల్ని బుట్టలో వేసుకొని, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం, తనబలాన్ని ఇంకా ఎక్కువ చేసుకొంటుంది.

"అట్లాగాకపోతే, అభిమాన సంస్థల్లోఉన్న కులాలవారి కార్మికులు, తమ సంస్థల్ని సన్నిహితాలైన కార్పొరేషన్లుగా రూపొందించుకోడానికి కృషి చేస్తారు. వాళ్ళ కృషి సఫలమౌతుంది. కులాలవారి కార్మికుల్లో సభ్యత్వం వంశపారంపర్యం క్రిందకు దిగుతుంది. తండ్రులతర్వాత కొడుకులు వస్తారు. శాశ్వత బల ఖనియైన సామాన్య ప్రజానీకంలో కొత్త శక్తి సంపదవచ్చి చేరదు. అంటే, కార్మిక కులాలు క్షీణదశకు రావడమన్నమాట. చివరకు చివరకు వాళ్ళు నానాటికి తీసికట్టు నాగంభొట్లుగా తయారౌతారు. అదే సమయంలో, ఒక సంస్థగా ఉన్నవాళ్ళు తాత్కాలికంగా సర్వశక్తిమంతులౌతారు. పాత రోములోఉన్న రాజప్రసాదాన్ని సంరక్షించే కాపలాదారులుగా తయారౌతారు. ఇక అంతరంగికవిప్లవాలు బైలుదేరుతై. దాంతో కార్మిక కులాలు అధికారపాశాన్ని హస్తగతం చేసుకొంటై. ఇక అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వంయొక్క, ప్రతి విప్లవాలు బైలుదేరుతై. కొంతకాలం అది, కొంతకాలం ఇది అధికారంలో ఉంటుంది. దీనిద్వారా, ఇదివరకు తప్పించు

కోడానికీ వీలుగాకుండా తయారైన కార్మిక కులాలు బాగా బలహీనపడిపోయి, చివరకు సామాన్య ప్రజలు తాము తాముగా నిలబడ్తారు.”

పెద్ద సంస్థలు ధర్మచ్యుతాలు కావడంతో ఎర్నెస్టు మొదటిగా నిస్పృహతో క్రుంగిపోయినప్పుడు, మెల్లమెల్లగా వచ్చే సాంఘిక పరిణామంమీద పడబోతున్న నీలిచ్ఛాయల్ని విశదీకరించాడు. ఈ విషయంలో ఆయనతో నేనెన్నడూ ఏకీభవించలేదు. పూర్వంకన్నా హృదయపూర్వకంగా ఈవాక్యాలు రాస్తున్న ఈనాడుగూడా ఆయనతో విభేదిస్తున్నా. ఎందుకంటే, ఎర్నెస్టు మరణించినప్పటికీ, ఇప్పటికిసైతం, అన్ని అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వాల్ని పూర్తిగా తుడిచిపెట్టేశే తిరుగుబాటుకు అతి సామీప్యంలో ఉన్నాం. ఐనా, ఇక్కడ నేను ఎర్నెస్టు జోస్యాన్ని చెప్పా. ఎందుకంటే, అది ఆయన జోస్యం కాబట్టి. ఆ విషయంలో ఆయనకు విశ్వాసం ఉన్నప్పటికీ, దానికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన కృషిచేశాడు. ఇప్పటికికూడా బ్రద్దలుకాబోయే సూచన్లకోసం ఎదురుచూస్తోన్న తిరుగుబాటును సాధ్యమయ్యేటట్లుగా, తక్కిన వాళ్ళకన్నా ఎక్కువగా కృషిచేశాడు.

“కానీ, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం హతం వేసుకొని కూర్చుంటే, ప్రతి సంవత్సరం దానిపాలబడే అత్యధిక శేషంగతి ఏమౌతుంది?” అని ఆ సాయంత్రం ఆయన్ను అడిగా.

“అత్యధిక శేషం ఏదోవిధంగా పీడవదలించాల్సిందే. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం దానికి మార్గం కనుక్కుంటుంది. నమ్ము. బ్రహ్మాండమైన రాస్తాలు నిర్మించబడుతై. విజ్ఞాన శాస్త్రంలో, అందులోనూ ప్రత్యేకంగా కళల్లో ఘన విజయాలు సాధిస్తారు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాలు ప్రజలమీద పూర్తిగా పెత్తనం సంపాదించినప్పుడు, వాటికి ఇతర విషయాలనుగూర్చి ఆలోచించే తీరిక చిక్కుతుంది. వాళ్ళు సౌందర్యోపాసకులౌతారు. వాళ్ళు కళారాధకులౌతారు. భూరి బహుమానాలు పొంది, వాళ్ళ

అజమాయిషీలో కళాపేత్తలు పరిశ్రమిస్తారు. అప్పోక పెద్దకళగా రూపొందుతుంది. నిన్నటివరకూ మాదిరిగా, ఇకముందు కళాకారులు మధ్యతరగతియొక్క బూర్జువాఅభిరుచులకు పక్కతాళంవేయరు. అదోకపెద్దకళ అవుతుంది. నే చెప్తున్నాగా. ప్రాచీన నగరాలను దిష్టిబొమ్మలుగాచేసి, తీసికట్టు అనిపించే అద్భుత నగరాలు వెలుస్తై. ఈ మహానగరాల్లో అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికారులు నివసిస్తూ, సౌందర్యోపాసన చేస్తుంటారు."

"ఈ విధంగా, కార్మికులు పరిశ్రమిస్తూ ఉంటే, అత్యధిక శేషాలు నిరంతరంగా ఖర్చుచేయబడతై. ఈ పెద్ద పెద్ద కట్టడాలు, మహానగరాలు నిర్మించడంవల్ల, లక్షోపలక్షలు సామాన్య కార్మికులకు ఉపాధ్యాలుండే దశ కలుగుతుంది. ఎందుకంటే, అంతూ పొంతూలేకుండా పెరిగిపోతున్న ఈ అత్యధిక శేషాలకు తగినట్లుగా అత్యధిక వ్యయంకూడా కావాల్సి ఉంటుంది. మరి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లు, వేయి సంవత్సరాలవరకేగాదు, పదివేల సంవత్సరాల పర్యంతం ఈరకంగానిర్మిస్తూనే ఉంటారు. ఈజిప్షియన్లూ, బాబిలోనియన్లూ కలలోగూడా ఊహించలేనివి వీళ్లు నిర్మిస్తారు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లు అంతమొందిన తర్వాత వాళ్ళు నిర్మించిన పెద్దపెద్ద రాస్తాలూ, మహాద్భుత నగరాలూ, నిలబడిపోతై. కార్మికసోదరబృందం ఆ రాస్తాలమీద ప్రయాణాలుచేస్తారు. ఆ మహాద్భుత నగరాల్లో నివసిస్తారు."

"అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధినేతలు ఈ పనుచేస్తారు. ఎందుకంటే వాళ్ళీ పనుచేయకుండా ఉండలేరు. పూర్వకాలంలో ఈజిప్టు పరిపాలక వర్గం తాను ప్రజలనుంచి దోచుకొన్న అధిక శేషాన్ని వ్యయించడానికి దేవాలయాలూ, పిరమిడ్లు నిర్మించినట్లుగానే, అత్యధిక శేష వ్యయం కూడా ఈ స్వరూపాల్ని ధరిస్తుంది. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వంలో మతాచార్య వర్గం అభివృద్ధిచెందదు. అభివృద్ధిచెందేది కళాకార్లు. బూర్జువా వ్యాపారవర్గ స్థానంలో కార్మిక కులాలు తలెత్తుతై. ఇక అట్టడుగున, అన్నంలేక మలమల

మాడి నీరసించి, తనంతటతాను కోలుకోలేని అఖండప్రజా అగాధంగా ఉంటుంది. చివరకు, ఏనాడో ఎవరికిమాత్రం ఏం తెలుసు? ఆ అగాధంలోనుంచి ప్రజలు విజృంభిస్తారు. ఆనాడు కార్మిక కులాలూ, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాలూ మట్టిలో కలుస్తయ్. ఆఖరికి, ఇకప్పుడు, శతాబ్దాల నికృష్టకాలానంతరం, అది, సామాన్య మానవుడి రోజవుతుంది. ఆ పర్వదినాన్ని చూద్దామని పూర్వం అనుకొన్నా. కానీ, ఆ సుదినాన్ని నేనెన్నడూ చూడలేను అని ఇప్పుడు తెలుసుకున్నా.'' అని కొంచెంసేపు ఆగి, నావైపు చూచి మళ్ళీ ఉపక్రమించాడు.

''ఓ మధురహృదయమా! సాంఘిక పరిణామం మరీ తాబేటి నడకలో ఉందిగదూ?''

నా బాహులతలు ఆయన్ను పెనవేసుకొన్నయ్. ఆయన శిరస్సు నా వక్షోజంపై వాలింది.

''నాకు జోలపాడి జోకొట్టు. నాకేదో స్వప్నదర్శనం అవుతోంది. నేను బాహ్యాన్ని మరుద్దామనుకొంటున్నా.'' అని అపూర్వానుభవంతో మంద స్థాయిలో మధురంగా మాట్లాడాడు.

౧౫.

అభిమానించిన సంస్థలపట్ల అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం యొక్క దృక్పథంలో కలిగిన మార్పు 1918 సంవత్సరం జనవరి నెల చివరి రోజుల్లో బహిరంగమైంది. రైల్వే ఉద్యోగులకూ, ఇనుమూ ఉక్కు కార్మికులకూ, ఇంజనీర్లకూ, యంత్రకార్మికులకూ అపూర్వంగా జీతాలు హెచ్చించారనీ, పనిచేసే గంటలు తగ్గించారనీ వార్తాపత్రికలు ప్రచురించినై. కానీ, మొత్తం నిజం మాత్రం బైటబడలేదు. మొత్తం నిజం చెప్పడానికి, అనుమతించడానికి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి దమ్ములుచాల్లేదు. నిజానికి, ఇంతకు

పూర్వానికన్నా జీతాలు హెచ్చించబడ్డయ్. వాటితోబాటే అదనపు సౌకర్యాలుకూడా కలిగించబడ్డాయి. ఇదంతా రహస్యం. కానీ పరమరహస్యాలు బట్టబయలుకాక తప్పవ్. అభిమాన సంస్థల సభ్యులు తమ పెళ్ళాలకు చెప్పారు. ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదుగా మరి. వాళ్ళేమో అక్కడక్కడా గుసగుసలాడారు. ఆ చెవినా ఆ చెవినాపడి మొత్తం కార్మిక లోకానికి జరిగినదంతా తెలిసిపోయింది.

19-వ శతాబ్దంలో దొంగలూ దొంగలూ ఊళ్ళు పంచుకొన్నారనే పద్ధతికి ఇది సహేతుక క్రమాభివృద్ధిమాత్రమే. ఆ కాలంలో జరిగిన పారిశ్రామిక పోరాటంలో లాభాలు పంచుకోటానికి ప్రయత్నాలు జరిగినై. అంటే, కార్మికులకు వాళ్ళకృషిలో ధనవ్యామోహం చూపి, వాళ్ళ కోప ఉపశమనం చేయడానికి చూచారన్నమాట. అసలు లాభం పంపిణీ విధానమే అవహేళనాస్పదం. అసంగతంకూడా. పారిశ్రామిక సంఘర్షణలో కొన్ని ప్రత్యేక విషయాల్లో మాత్రమే లాభపంపిణీ సంగతవౌతుంది. ఎందుకంటే, మొత్తం శ్రామికులూ, మొత్తం పెట్టుబడిదారులూ సరిసమానంగా లాభాలు పంచుకొంటే, అసలు లాభ పంపిణీ అంటూనే లేనికాలంలో ఏ పరిస్థితులుండేవో, అదేమాదిరి పరిస్థితులేర్పడుతై.

అందుకే, లాభపంపిణీ అన్న అనాచరణీయమైన భావనునుంచి, ఆచరణసాధ్యమైన, "దొంగలు దొంగలు ఊళ్ళపంపకం" అన్నది మొలకెత్తింది.

"మాకు ఎక్కువ జీతాలు యివ్వండి. ప్రజలమీద పన్నులువేయండి" అన్నది బలిష్టమైన సంస్థల నినాదం. మరి అక్కడక్కడా ఈ 'చిన్నినా పొట్టకు శ్రీరామరక్ష' అన్న సిద్ధాంతం కొంతవరకు జయప్రదంగానే సాగింది. ఆ భారాన్ని ప్రజలమీద వేయడంలో, సుసంఘటితంగాని పెద్ద కార్మిక సమూహంమీద, నిర్మాణబలహీనదశలో ఉన్న కార్మికులమీదా పడ్డది. కార్మిక గుత్త సంస్థల్లో బలిష్టసభ్యులైన సోదరులకు హెచ్చుజీతాలు చెల్లిం

చింది, నిజానికి ఈ కార్మికులే. నేను చెప్పినట్లుగా ఈ భావన, భారీఎత్తున అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాలు, అభిమాన సంఘాల కలయికవల్ల, కేవలం సహేతుక పరిణామాన్ని పొందింది.

ఈ అభిమాన సంఘాల విద్రోహచర్యల రహస్యం బైటికి పొక్కిన వెంటనే, కార్మిక జగత్తులో అలజడి బైలుదేరింది. దాని తర్వాత, ఈ అభిమాన సంఘాలు అంతర్జాతీయ సంఘాలనుంచి బైటికివచ్చేసి, వాటితో తమకున్న సంబంధబాంధవ్యాలన్నీ వదులుకున్నై. ఇకప్పుడు క్లిష్టకాలంవచ్చింది. హింసలు చెలరేగినై. అభిమానసంఘ సభ్యుల్ని దేశద్రోహులకిింద జమకట్టారు. పెద్ద కొట్లల్లో, వ్యభిచారగృహాల్లో, రోడ్లమీద, కర్మాగారాల్లో పనిచేస్తుండగా, అసలు ఒకచోటేమిటి, అన్నిచోట్లా, నష్టబడ్డ ముంచబడ్డ కార్మికులు, వీళ్ళమీదకు దాడిచేశారు.

ఎన్నో తలలు పప్పుపప్పైనై. చాలామంది చచ్చారు. అభిమాన సంఘాల సభ్యుడెవడూ క్షేమంగాలేడు. ముఠాలుముఠాలుగానే పనిలోకి పోతున్నారు. తిరిగి ఇళ్ళకు వచ్చేటప్పుడూ గుంపులుగానే వస్తున్నారు. వీధులమధ్యలోనే నడిచేవాళ్ళు. వీధులకొక ప్రక్కనడిచారో, ఇళ్ళమీదనుంచీ కిటికీల్లోనుంచీ ఇటుకలూ, కంకర్రాళ్ళూ దూకి, వాళ్ళకు కపాలమోక్షం జరిగిందన్నమాటే. వాళ్ళు ఆయుధాలు ధరించవచ్చు. అధికార్లు అన్నివిధాలా సహాయం చేశారు. వాళ్ళను హింసించినవాళ్ళకు సుదీర్ఘ కఠినకారాగారశిక్షలు పడ్డయ్. అభిమానసంఘ సభ్యుడు కానివాడు ఆయుధాలు ధరించడానికి అనుమతించలేదు ప్రభుత్వం. ఈ శాసనధిక్కృతి మహాపరాధంగా పరిగణించి తగిన శిక్షలు విధించారు.

ఈ దేశద్రోహులమీద రెచ్చిపోయిన కార్మికులు కసిదీర్చుకుంటూనే ఉన్నారు. ఎవళ్ళ ప్రమేయంలేకుండానే కార్మికకులాలు ఏర్పడ్డయ్. మోసగించబడ్డ కార్మిక సంతానం, విద్రోహకర కార్మిక సంతానంమీదికి కత్తిగట్టి

పగసాధించింది. చివరకు, విద్రోహకర కార్మిక సంతానం, గోడ్లమీదకువచ్చి ఆడుకోవడానికిగాని, బళ్ళల్లోకిపోయి చదువుకోడానికిగాని వీలుగానిపరిస్థితి దాకా వచ్చింది. దేశద్రోహ కార్మికకుటుంబాలు ఇళ్ళల్లోన్నేపడి క్రుగ్గిపోయినై. వీళ్ళకు సరుకులు అమ్మిన చిల్లరవర్తకుల్ని బహిష్కరించారు.

అన్నిమూలలనుంచీ తరిమికొట్టబడ్డఫలితంగా, ఈ దేశద్రోహులు, వీళ్ల కుటుంబాలూ, తక్కినవాళ్ళతో సంబంధంలేకుండా ప్రత్యేకంగా ఉండాల్సిన గతిపట్టింది. తాము మోసగించిన ప్రజలమధ్యలో నివసించడమనేది ఇక దుస్సాధ్యమన్న విషయం తెలుసుకోని, కొత్తచోట్లకుపోయి తామే కట్టుకట్టుకోని నివసించారు. ఈ విషయంలో వీళ్ళను అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వం ఆదరించింది. లంకంత దొడ్లతో, గాలీ వెలుతురూ బాగావచ్చే ఆరోగ్యకరమైన ఆధునిక ఫక్కీలో, ఇళ్లుకట్టించి ఇచ్చింది. ఆటస్థలాలూ, విహారవనాలూ ఏర్పాటుచేశారు. వీళ్ళకోసమే ప్రత్యేకంగా స్థాపించిన పాఠశాలల్లోకిపోయి, పిల్లలు చదువుకొన్నారు. చేతిపన్లలో, సాధారణవిజ్ఞానశాస్త్రంలో ప్రత్యేక శిక్షణ ఇచ్చారు. ప్రత్యేకంగా ఉన్నందువల్ల, తప్పించడానికి వీల్లేకుండా మొదట్లోనే కార్మికకులం తలెత్తింది. అభినూత్న సంఘసభ్యులు ధనిక కార్మికులైనారు. వీళ్ళను తక్కిన కార్మికులనుంచి ప్రత్యేకంగా ఉంచారు. మిగతావాళ్ళకన్నా వీళ్ళకు మంచి ఇళ్ళూ, మంచి గుడ్డలూ, మంచి తిండీ ఏర్పడింది. బాగా ఆదరణ చిక్కింది. కసిపోక మసిపూసుకొన్నట్లుగా, దొంగలూ దొంగలూ కలిసి ఊళ్లుపంచుకొనే లెక్కలోకి దిగారు.

ఈ మధ్యకాలంలో, మిగతా కార్మికులు మరీ కఠినంగా చూడబడ్డారు. వాళ్లకున్న కొద్దిసౌకర్యాలుకూడా ఊడబెరికేశారు. వాళ్ల జీతాలూ, జీవనస్థాయీ క్రమక్రమేపీ పడిపోయినై. కాకతాళీయంగా వాళ్ల పాఠశాలలూ తీసికట్టులోకి వచ్చినై. నిర్బంధ విద్యావిధానం అదృశ్యమైపోయింది. చదువనూ, వ్రాయనూ చేతగాని యువకులు అమితమైనారు.

## ఉక్కుపాదం.

ప్రపంచపు మార్కెట్టును అమెరికా గుత్తచేసుకోవడంతో తక్కిన లోకమంతా దెబ్బతినిపోయింది. ప్రతిచోటా సంస్థలూ- ప్రభుత్వాలూ పతనం కావడమో మారిపోవడమో జరుగుతోంది. జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, న్యూజిలాండు సహకార కామన్వెల్తు వీర్యాట్లల్లో ఊపిరిసల్పకుండా ఉన్నయ్. బ్రిటీష్ సామ్రాజ్యం ఒకచెంప పడిపోతోంది. ఇంగ్లండు చేతులకు బాగా పని తగిలింది. భారతదేశంలో తిరుగుబాటు మంచి ఉధృతంగా ఉంది. "ఆసియా, ఆసియావాసులకే" అన్న నినాదం ఆసియాఖండమంతా మార్మ్రోగుతోంది. ఈ నినాదానికి జపాను తన కంఠంగూడా తోడు కలిపింది. శ్వేతజాతికి ప్రత్యర్థులుగా పసుపు, గోధుమవర్ణ జాతులకు బాగా తోడ్జు ఇచ్చి ఉసికొల్పుతోంది. ఆసియాఖండ సామ్రాజ్యస్థాపనకోసం కలలు కని, తన కలల్ని యథార్థాలుచేసుకోవడానికి శాయశక్తులా కృషిచేస్తూనే జపాను, తనదేశంలో బైలుదేరిన కార్మిక విప్లవాన్ని అణిచేసింది. అది వర్గాల మధ్య చెలరేగిన యుద్ధం మాత్రమే. ఆ యుద్ధం కూలీలకు యజమానులకుమధ్య ఏర్పడింది. లక్షలాది కూలీసోషలిస్టులు ఉరికంబాలు కౌగలించుకొన్నారు. టోకియోనగరవీథుల్లో జరిగిన పోరాటంలో, మికడో ప్రాసాదంపైన నిష్ఫలమైన దాడిలో 46 వేలమంది చంపబడ్డారు. 'కోబె' ఒక కసాయిదుకాణమైంది. మెషిన్‌గన్లతో నూలువస్త్రకార్మికుల్ని చిత్రహింసచేయడం చాలా ప్రాముఖ్యం వహించింది. ఆధునికయుద్ధ మారణయంత్రాలింతకుముందెన్నడూగూడాచేయలేని దారుణాన్ని నిర్వహించడంలో, జపానులో తలెత్తిన అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వం అన్నిటికన్నా పచ్చినెత్తురుతాగే పరమ కిరాతకంగా ఉంది. జపాను తూర్పునంతా ఆక్రమించుకొని, ఒక్క భారత దేశాన్ని మినహాయించి, మొత్తం ఆసియా ప్రపంచపు మార్కెట్టును తన గుప్పెట్లో పెట్టుకొంది.

కాళ్ళుపట్టుకు లాగుతుంటే చూరుపట్టుకు వ్రేళ్ళాడిన సామెతగా;

భారత దేశాన్ని అంటిపెట్టుకొని ఉండడానికి ఇంగ్లండు తాను భారత దేశంలో కొనఊపిరితో ఉండే దశకు వచ్చినప్పటికీ, తన దేశంలో బైలుదేరిన ప్రజా విప్లవాన్ని అణిచివేసింది. తన పెద్ద పెద్ద వలసరాజ్యాలు చేజారి పోయే పరిస్థితి కలిగింది. అందువల్ల ఆస్ట్రేలియా, న్యూజిలాండును సహకార కామన్‌వెల్తు దేశాలుగా ఉండేటట్లు చేయడంలో సోషలిస్టులు సఫలులైనారు. అదే కారణంగా, మాతృదేశాన్నుంచి కెనడా దూరమైంది. కానీ ఉక్కుపాదం సహాయంద్వారా కెనడా, తన దేశంలో వచ్చిన సోషలిస్టు విప్లవాన్ని అణగద్రొక్కింది. అదే సమయంలో తిరుగుబాట్లను అణగద్రొక్కడానికి ఉక్కు పాదం, మెక్సికో, క్యూబాలకు సహాయంచేసింది. దీని ఫలితమేమిటంటే, కొత్త జగత్తులో ఉక్కుపాదం లోతుగా వేళ్ళూనుకు నిలిచింది. పెనామా కాలువ మొదలుకొని, ఆర్కిటిక్ మహాసముద్రం పర్యంతం మొత్తం ఉత్తర అమెరికాఅంతా, ఆ ఉక్కుపాదం, ఒకేఒక రాజకీయ స్తంభంగా నిలబడింది.

ఇంగ్లండు, తనకున్న పెద్దపెద్ద వలస రాజ్యాలన్నిటినీ వదలుకొని, భారత దేశాన్ని మాత్రం నిలుపుకోకలిగింది. ఇదికూడా తాత్కాలికమే. భారత దేశంకోసం జపానువాళ్ళతోటీ, తక్కిన ఆసియాతోటి పోరాటంలో కొంచెం ఆలస్యం జరిగింది. అంతే. కొద్ది కాలంలోనే ఇంగ్లండు భారత దేశాన్ని వదులుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. దానివెనకాల సమైక్య ఆసియా ఖండానికి, ప్రపంచానికీ మధ్య పోరాటాన్ని కల్పిస్తోంది.

ప్రపంచమంతా ఘర్షణల్తో చిందరవందరైనప్పుడు. అమెరికా వాసుల మైనమేం ఏమీపట్టనట్లుగా ప్రశాంతంగాలేం. పెద్ద సంస్థల విద్రోహంతో, మా ప్రజాసామాన్యపు తిరుగుబాటుకు అడ్డుకలిగింది. కానీ అన్నిచోట్లా హింసలు చెలరేగినై. కార్మికుల కష్టాలకూ, కర్షకుల, మిగిలిన మధ్యతరగతి ప్రజల అసంతృప్తికితోడు, మత పునరుద్ధారణ విధానాలు చెలరేగినై. ప్రపంచ నాశనం జరుగుతుందనిచెప్తూ సెవెంత్ డే యాడ్వెంటిస్టు (Seventh-day

Adventists) శాఖఒకటి ఉన్నట్లుండి ప్రాముఖ్యంలోకి వచ్చింది. "మరీ అధ్వాన్నస్థితి ఏర్పడింది. అడ్డదిడ్డమైన ప్రయోజనాల్తోటీ, ఘర్షణల్తోటీ, ఐక్యతకోసం మనమెట్లా ఆశించగలం?" అని ఎర్నెస్టు ఆక్రోశించాడు.

మత పునరుద్ధరణ మరి నిజానికి భయంకర పరిస్థితుల్ని ఏర్పర్చింది. చాలా నికృష్ట హైన్యస్థితిలో మురిగి ఉన్నందువల్లనైతేనేమి, ఐహిక విషయాలన్నిటి మీదా నిరాశా నిస్పృహాలుకలిగి ఉన్నందుననేమి ప్రజానీకం, కుంజర యూధంబు దోమకుత్తుక జొరలేనట్లుగా, పారిశ్రామిక రాక్షసవర్గం ప్రవేశించలేని స్వర్గంకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూ సర్వసిద్ధంగా ఉన్నారు. ఏకాక్షి రాక్షస మతబోధకులు దేశమంతా చెదలువ్యాపించినట్లు వ్యాపించారు. సివిల్ అధికారుల నిషేధాజ్ఞలున్నప్పటికీ, శాసన ధిక్కృతికి శిక్ష ఉన్నప్పటికీ లెక్కలేనన్ని క్యాంపు సభలద్వారా మత మహాగ్నిజ్వాలలు బాగాచెలరేగినై.

ప్రపంచ ప్రళయానికి నాందీపఠనం ఇది అని వాళ్ళు చెప్పారు. జంఝూమారుతం గొలుసులు త్రెంచుకొని బైటపడ్డదనీ, పుష్కలావర్తక మేఘాలు స్వేచ్ఛావిహారం సాగించనై అనీ, భగవంతుడు జాతిచరమ శ్లోకాలాపన సాగించడనీ చెప్పారు. అది అద్భుతాల సమయం. పగటికలల వేళ. క్రాంతికాలం. దీర్ఘదర్శులూ, జోస్యులూ కుప్పలుతెప్పలుగా తయారయ్యారు. ప్రజలు పన్లుకట్టేసి, 144 వేల ప్రజల్ని స్వర్గానికి ఉద్ధరించడానికి భగవదవతరణకోసం నిరీక్షించడానికి కొండల్లోకి పరుగెత్తుకుపోయారు. కానీ, ఈలోపల భగవదవతరణ జరగలేదు. వాళ్ళుమాత్రం కూడూ నీళ్ళూలేకుండా అలమటించి అసంఖ్యాకంగా మరణించారు. వాళ్ళంతా నిరాశా నిస్పృహల్తో తెగించి పంటుపొలాలన్నీ భగ్గంపాడు జేశారు. దీనివల్ల గ్రామసీమల్లో అరాచకం, అలజడి పెచ్చుపెరిగినై. పొలాలు పోగొట్టుకొని అలమటిస్తోన్న రైతుల దుఃఖాలు మరింత ఎక్కువైనైగాని సత్ఫలితం ఏమీ కలగలేదు.

క్షేత్రాలు, స్టోర్సులూ ఉక్కుపాదం అధీనమైనై. సైన్యాలు స్వేచ్ఛా విహారం చేసినై. మూఢప్రజానీకాన్ని, బాకులు చూపించి పట్టణాల్లో పను చేయించడానికి గొర్రెలమందల్ని తోలుకు వచ్చినట్లు తోలారు. అక్కడ ప్రజలు అనేక పర్యాయాలు తిరగబడ్డారు. వాళ్ళనాయకుల్ని రాజద్రోహ నేరంక్రింద ఉరిదీశారు. లేదా ఉన్మాద చికిత్సలయాల్లో పారేశారు. ఉరిదీయబడ్డవాళ్ళు వీరపురుషుల్లాగా చిరునవ్వులతో మృత్యువుకు స్వాగతం పల్కారు.

అది ఉద్రిక్త పరిస్థితి. అశాంతి వ్యాపించింది. ఫ్లోరిడానుంచి అలాస్కా వరకూ ఉన్న మధ్యప్రదేశాల్లోనూ, ఎడారుల్లోనూ, బీళ్ళల్లోనూ, మృత్యు గహ్వరంనుంచి తప్పించుకొన్న కొద్దిమంది భారతీయులు, ఉన్మాదావేశంతో చిందులుతొక్కుతూ, తమను రక్షించే భగవదాగమనంకోసం నిరీక్షించారు.

వీటన్నిటిద్వారా భయంకరమైన నిశ్చయంతో, యుగయుగాల తర బడిగా వస్తూన్న అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వ రాక్షసత్వం, అభివృద్ధిచెంద సాగింది. ఉక్కుచేతుల్తో, ఉక్కుపాదంతో, అది ఉదధిలాగా ఉప్పొంగి పోయే ప్రజల్ని అదుపులోకి తెచ్చింది. అల్లకల్లోలంనుంచి క్రమపద్ధతి ఏర్పర చింది. ఈ ప్రళయంలోనుంచే తన పునాదుల్ని ఏర్పర్చుకొని నిర్మాణం పూర్తిచేసుకొంది.

"మనం అధికారంలోకి ప్రవేశించేదాకా వేచి ఉండండి. మేం స్వాధీనంచేసుకొన్న ప్రభుత్వాన్ని చూడండి! సోషలిస్టులైనమీరు మాకు అండదండగా ఉంటే, మేం ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకొన్నప్పుడు, వాళ్లను మరోపాట పాడేటట్లుచేస్తాం" అని వెల్ వీధి నివాసగృహంలో తమకు కాల్విన్ చెప్పాడని గ్రేంజరుపార్టీవాళ్లు చెప్పారు.

"ఆకటితో అలమటిస్తూ అసంతృప్తి పెరిగిన లక్షలాది ప్రజానీకం మా పక్షం. గ్రేంజరుపార్టీవాళ్లూ, రైతులూ, మధ్యతరగతివాళ్ళూ, కార్మికులూ మాలోనే వచ్చిచేరారు. పెట్టుబడిదారిపద్ధతి ఛిన్నాభిన్నమైపోతూంది. ఇంకో

నెలకి, మేం కాంగ్రెసుకు ప్రతినిధిమందిని పంపుతాం. రెండుసంవత్సరాల తరువాత అధ్యక్షుడు మొదలుకొని ఆఖరికి బిళ్లబంట్రోతువరకూ ప్రతి ఆఫీసు మాదే అవుతుంది" అన్నారు సోషలిస్టులు.

ఎర్నెస్టు, అందరిమాట విని అనంగీకారంగా తలూపి ఇట్లా అనేవాడు.

"మీకు ఎన్ని తుపాకులున్నయ్? మీకు తుపాకిగుండ్లకు కావలసినంత సీసం ఎక్కడ లభ్యమవుతుందో తెలుసా? అది పొడిరూపందాలిస్తే, కృత్రిమ మిశ్రమాలకన్నా, రసాయనికమిశ్రమాలు శ్రేష్టం. నా మాట నమ్మండి."

## ౧౬

ఎర్నెస్టూ, నేనూ వాషింగ్టన్‌కు పోవాల్సిన అవసరంవచ్చినప్పుడు, నాన్నమాత్రం మాతోబాటు రాలేదు. ప్రాలిటేరియన్ జీవితంలో ఆయన బాగా ముగ్ధుడైపోయాడు. మా చుట్టుప్రక్కలవున్న నికృష్ట దరిద్రజీవ నివాసస్థలం ఆయనపాలిటికి ఒకపెద్ద సాంఘికపరిశోధనాలయమైంది. అంతూ పొంతూలేని సుస్పష్ట సాంఘిక పరిశోధనలో బాగా నిమగ్నుడైనాడు. శ్రామికులకు సఖుడైనాడు. సామాన్య ప్రజల గృహాల్లో అత్యంత సన్నిహితుడైనాడు. చిల్లర మల్లర ఉద్యోగాలు చాలా చేశాడు. ఆ ఉద్యోగాలన్నీ ఆయనకు ఆటలుగానేగాకుండా, విషయగ్రహణ పరిశోధనలకు ఉపకరించినై. ఎందుకంటే, ఆ వృత్తుల్లో చాలా సంబరం చూపించి, ఇంటికి వచ్చేటప్పుడు తాను గ్రహించిన విషయాలకు చక్కగా నోట్సు వ్రాసుకొని, కొత్త కొత్త సాహసకృత్యాలకు బాగా ఉప్పొంగిపోయేవాడు. ఆయన పరిపూర్ణ శాస్త్రజ్ఞుడు.

ఇంతకూ మా నాన్న పనిచేయాల్సిన అవసరమేలేదు. ఎందుకంటే, ఎర్నెస్టు అనువాదాలమీదవచ్చే ఆదాయంతో, మేం ముగ్గురం గుండెదిగులు లేకుండా జీవించవచ్చు. కానీ, తనకు బాగా ఇష్టమైన గతకాలదృశ్యాల్ని

తాను చేస్తున్న ఉద్యోగాల్లో దర్శించడంనుంచి నాన్న విరమించుకోలేదు. వీధుల్లో తిరిగి అమ్మే మేజోళ్లూ, మేజోళ్లు బిగించేతాళ్లూ మా నాన్న తీసుకు వచ్చిన ఆనాటి సాయంకాలాన్నిగానీ, వీధి మలుపులో ఉన్న చిన్న దుకాణంలో వస్తువులు కొనడానికి నేను పోయినప్పుడు, ఇతను సహాయంగా నిరీక్షించిన సమయంగానీ, ఎన్నడూ మరచిపోలేను. దాని తర్వాత, వీధి దాటే దగ్గర ఉన్న సారాదుకాణంలో ఒక వారంరోజులపాటు సారా అందిచ్చేవాడుగా నాన్న పనిచేసినప్పుడూ, ఏమీ ఆశ్చర్యంకలగలేదు నాకు. రాత్రి కాపలాదారుడుగా, బంగాళాదుంపలు వీధుల్లోతిరిగి అమ్మేవాడుగా, ధాన్యపు కొట్లో చీట్లుంటించేవాడుగా, కాగితపుపెట్టెల కర్మాగారంలో సహాయంచేసేవాడుగా, ట్రాంరోడ్లు నిర్మించే ముఠాకూలీలకు నీళ్లు మోసేవాడుగా నాన్న పనిచేశాడు. ఆఖరికి, ఇంకా కొద్దిరోజుల్లో పతనమైపోతుందనగా, ప్లేట్లు కడిగేవాళ్ళ సంఘంలో కూడా చేరాడు.

దుస్తులవిషయంలో మటుకు, నాన్నకు బిషప్ విధానం బాగా నచ్చిందని అనుకొంటున్నా. ఎందుకంటే, నడుం దగ్గర గట్టిగా బెల్టుతో బిగించి, సామాన్య కార్మికులు ధరించే చౌకబారు అంగరఖాను, అచ్చగా బిషప్ ధరించినట్లే ధరించేవాడు. ఐనా, పూర్వజీవితానికి సంబంధించిన ఒక అలవాటు మాత్రం వదలకుండా ఆయన్ను అంటిపెట్టుకొనే వస్తోంది. భోజనాల సమయంలో మాత్రం ప్రత్యేక దుస్తులు మునుపటిమాదిరిగానే ధరిస్తున్నాడు.

ఎర్నెస్టుతో నే నెక్కడున్నా నాకు పరమానందమే. మారిన పరిస్థితుల్లో నాన్నకు కలిగిన ఆనందం, నాకు అపరిమితానందాన్ని కలిగించింది.

"నేను పిల్లవాడిగా ఉన్నప్పుడు ప్రతివిషయాన్నీ తెలుసుకోవాలని ఉవ్విళ్లూరుతుండేవాణ్ణి. వస్తుస్వరూపం ఏమిటి? దాని సృష్టి ఎట్లా జరిగింది? అన్న జిజ్ఞాసతో ఉండేవాణ్ణి. నేను భౌతికశాస్త్రజ్ఞుణ్ణయిందందుకే. పూర్వం నా బాల్యంలో విషయగ్రహణ కుతూహలం ఎంతగా ఉండేదో, ఈనాటి

జీవితంలోనూ అంతగా ఉంది. విషయగ్రహణాశక్తే అసలు జీవితసాఫల్యం"
అన్నాడొకప్పుడు నాన్న.

ఒక్కొక్కప్పుడు సంతబజారు ఉత్తరపు దిశలో, దుకాణాలూ, సినిమాలూ ఉండే చోటికి కూడా పత్రికలమ్మడానికీ, వార్తలందించడానికీ, అశ్వశకటాలు ఎక్కి, దిగేవాళ్ళకు, బండితలుపులు మూయడానికీ, తెరవడానికీ పనిచేసేవాడుగా పోయేవాడు. అక్కడ, ఒకరోజు బండితలుపులు మూస్తూ, నాన్న, మిస్టర్ విక్సన్‌ను కలుసుకొన్నాడు, ఆ రోజు సాయంత్రం, జరిగిన సంగతిని నాన్న పరమోత్సాహంతో వర్ణించాడు.

"నేను, విక్సన్‌బండి తలుపుమూసేటప్పటికి, అతడు నావైపు తీక్షణంగా చూచి, 'మంచిది. నన్ను భ్రష్టుపట్టిస్తారు' అని సణిగాడు. అతడు గొణిగింది సరిగా అదే. అతడి మొగం కందగడ్డయింది. నాకు కూలీ డబ్బు ఇవ్వడం కూడా మరచిపోయేటంతగా గాభరా తిన్నాడు. కానీ తొందర్లోనే తెప్పరిల్లుకొన్నట్టున్నాడు. ఎందుకంటే, ఆ బండి ఒక 50 అడుగులు దూరంకూడా పోకముందే మళ్ళీ వెనక్కు తిరిగి నా దగ్గరకు వచ్చింది. బండి తలుపులోనుంచి తొంగిచూచి,

"ప్రొఫెసర్! ఇటు చూడు! ఈ స్థితి మరీ అతిగా ఉంది. నీ కేం సహాయం చేయమంటావ్ నన్ను?" అన్నాడు.

"నీవు బండెక్కిన తర్వాత, నీ కోసం తలుపులు మూశా. మామూలుగా నీవు పదిసెంట్లు మాత్రం ఇవ్వాలి నాకు." అని సమాధానం చెప్పా.

"పదిసెంట్లకోసమా పరితపిస్తున్నావ్! నీకు బాగా సహాయపడే ఉపకారాన్ని గూర్చయ్యా నేను అడిగింది." అని,నిట్టూరుస్తూ అతడు మాట్లాడాడు.

"అతడు నిజంగా గంభీరంగా ఉన్నాడు. ఊగిసలాడ్తోన్న మనస్సుతో ఎందుకో బాధపడ్డాడు. అందుకని ఆ విషయాన్ని కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించా.

"నా సమాధానాన్ని ప్రారంభించేటప్పుడు, అతడి మొగంలో, కుతూహలం ఉద్రిక్తమైంది. కానీ, నా సమాధానాన్ని పూర్తిచేసినప్పుడు, అతడి మొగకవళికల్ని నీవు చూచి ఉండాల్సింది.

"నా ఇంటిని, సియెరా మిల్లుల్లో ఉన్న నా సరుకును తిరిగి ఇవ్వు." అన్నానని, నాన్న కొంచెం ఆగాడు.

"అతడేం చెప్పాడు?" అన్నా ఆదుర్దాతో.

"ఏం చెప్తాడతడు? ఏమీ అనలేదు, కానీ నేను, 'నీవు సంతోషంగా ఉన్నావనుకొంటూ?' అన్నా అతడితో. నా వేపు విచిత్రంగా చూచాడు. 'సంతోషంగా ఉన్నావా? చెప్పు! అన్నా మళ్ళీ.

"బండివాడిని బండి తోలమనిచెప్పాడు. నన్ను కఠోరంగా తిడుతూ వెళ్లాడు. ఇంటినీ, సరుకునూ, ఎగనామం పెట్టినట్లుగానే, పదిసెంట్లుకూడా ఇవ్వకుండా వెళ్ళిపోయాడు. చిట్టీ! చూచావా? వీధుల్లో కొలువుచేసే మీ నాన్న జీవితం నిరాశల్తో ఎట్లా తల్లకిందైందో?" అన్నాడు నాన్న.

నేనూ, ఎర్నెస్టూ, వాషింగ్టన్‌కు వెళ్లినపుడు, నాన్న పెల్‌వీధి నివాసగృహంలోనే ఉండిపోయాడు. అంతిమపరిపూర్ణస్థితిమినహా, పూర్వ విధానమంతా అదృశ్యమైంది. నేను కలలుగన్నదానికన్నా ముందుగానే, చరమపరిపూర్ణస్థితి చాలా సమీపంలోకి వచ్చింది. సోషలిస్టు కాంగ్రెసు వ్యక్తులు తమస్థానాన్ని స్వీకరించడానికి, ప్రభుత్వం ఏ విధమైన ఆటంకాలూ పెట్టలేదు. ఇది మేం ఊహించిన వాటికి విరుద్ధంగా జరిగిన విషయం. ప్రతి విషయం ప్రశాంతంగా జరిగిపోయింది. ఈ ప్రశాంతతే, భవిష్యత్తులో పెద్ద ప్రళయాన్ని తెచ్చిపెట్టుందని, ఎర్నెస్టు వ్యాఖ్యానించినప్పుడు, నేను ఆయన్ను అపహాస్యం చేశా.

మా సోషలిస్టు మిత్రులు, తమశక్తి సంపదల్లో దృఢమైన ఆత్మవిశ్వాసం గలవాళ్ళనని, చేయదలచుకొన్న విషయాల్లో ఆశావాదులే అనీ మేం

గ్రహించాం. కాంగ్రెసుకువెన్నికైన కొద్దిమంది గ్రేంజరుపార్టీ సభ్యుల్తో మాబలం ఇంకొంచెం పెరిగింది. ఈ సంయుక్తబలంతో, ముందు చేయాల్సిన విధానాలకు స్పష్టమైన ఒక పెద్ద ప్రణాళిక తయారుచేశాం. ఇందులో ప్రత్యేకంగా పొరిగిపడేదేమిలేదని, "చూర్ణదశకు వచ్చినప్పుడు, కృత్రిమ మిశ్రిమాలకన్నా, రసాయనికి మిశ్రిమాలేసయం. నామాట నమ్మండి!" అని అంటున్నప్పటికీ, ఏమాత్రం నమ్మకం లేకపోయినప్పటికీ, ఈ విషయా లన్నింటిలో, ఎర్నెస్టు, చాలా ఉత్సాహంతో, వినయంతో, సహకరించాడు.

జరిగిన ఎన్నికల్లో, వివిధ రాష్ట్రాల్లో అధికారాన్ని సంపాదించిన గ్రేంజర్లతో మొదటిగా చిక్కు ప్రారంభమైంది. ఒక డజను రాష్ట్రాల్లో వాళ్ళున్నారు. ఏంలాభం? ఎన్నుకోబడ్డ గ్రేంజర్లను అధికారంలోకి రావడా నికి అనుమతించలేదు. అంతకుముందు అధికారంలో ఉన్నవాళ్ళు వైదొలగడా నికి నిరాకరించారు. దానికి కారణం చూపించడం చాలా సులభం. ఎన్ని కల్లో వాళ్ళు గెలిచినపద్ధతి శాసన విరుద్ధమని దోషారోపణ చేశారు మొత్తం విషయాన్ని, ఎన్నాళ్ళకూ తెమలని, అంతూ పొంతూలేని శాసన గహ్వరం లోకి నెట్టేశారు గ్రేంజర్లకు అధికారం లేదు. వాళ్ళకు శరణ్యం న్యాయ స్థానాలే. న్యాయస్థానాలన్నీ వాళ్ళ శత్రువుల చేతుల్లో ఉన్నాయ్.

ఇది చాలా ప్రమాద సమయం. మోసగించబడ్డ గ్రేంజర్లు హింసా చర్యలకు పూనుకొన్నారో మొత్తం సర్వనాశనమాతుంది. వాళ్ళు హింసా కృత్యాలకు దిగకుండా సోషలిస్టులమైన మేం ఎంత విశ్వప్రయత్నం చేశామం లేను! ఎర్నెస్టు కనీసం కన్నుమూయని దినాలు చాలా ఉన్నాయ్. గ్రేంజరు పార్టీలోని పెద్దపెద్ద నాయకులు ప్రళయాన్ని గుర్తించారు. వాళ్ళంతా మాతో కలిశారు. కానీ ఇదంతా ఏం లాభంలేకపోయింది. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి కావలసింది హింస. అందుకే అది సంక్షోభకారులైన ఏజెంట్లను నియమించింది. రైతు తిరుగుబాటుకు ముఖ్య కారకులు సంక్షోభ కారులైన ఏజెంట్లే అని నిరాక్షేపణీయంగా చెప్పవచ్చు.

ఒక దశను ప్రభుత్వాల్లో తిరుగుబాటు బాగా విజృంభించింది. భూము ల్నుంచి వెళ్ళగొట్టబడ్డ రైతులు రాష్ట్ర ప్రభుత్వాల్ని పట్టబలవంతాన స్వాధీనం చేసుకొన్నారు. ఇది రాజ్యాంగతంత్ర విరుద్ధమే అనుకోండి. అమె రికా తన సిపాయి దండునుకూడా రంగంలోకి దూకించిదనుకోండి! ప్రతి చోటా సంక్షోభకారకులైన ఏజెంట్లు ప్రజలమీద వత్తిడి తెచ్చారు. ఉక్కు పాదం నియమించిన, విద్రోహకారులైన ఈ ఏజెంట్లు, నిపుణులైన పనివా ళ్ళుగా, రైతులుగా, పొలాల కూలీలుగా మారువేషాలు వేసుకొన్నారు. కాలి ఫోర్నియా రాజధానియైన 'సాక్రమెంటో'లో ఏ విధమైన అలజడి కలగ కుండా గ్రేంజర్లు చేయకలిగారు. ఈ పట్టణంలోకి, మిరతల దండుల్లాగా వేలాదిగా రహస్యపు ఏజెంట్లు దూసుకువచ్చారు. వీళ్లే, ముఠాలు ముఠాలుగాచేరి కాల్పులం సాగించారు. ఇళ్లూ, ఫ్యాక్టరీలూ దోచుకొన్నారు. ప్రజలుకూడా వీళ్లతోబాటే దోపిడీలకూ హత్యలకూ, దిగేటట్లుగా పనిచే శారు. బీద ప్రజానీకం బాగా రెచ్చిపోయేటందుకు, పీపాలకు పీపాలుసారా సహాయం చేశారు. ఇకప్పుడు, అంతా సిద్ధమైన తర్వాత, అమెరికా సిపాయి బృందం రంగంలో ప్రత్యక్షమైంది. ఈ సిపాయి బృందం నిజానికి ఉక్కు పాదానికి సంబంధించిందే. సాక్రమెంటో వీధుల్లో కాల్చిచంపబడ్డవాళ్లుగానీ, ఇళ్లల్లో హత్య చేయబడ్డవాళ్లుగానీ, ఆడా, మగా, పిల్లజెల్లా అంతా కలిసి పదకొండువేల మందైనారు. రాష్ట్ర ప్రభుత్వాన్ని జాతీయ ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది. కాలిఫోర్నియా-పనంతా ముగిసింది.

కాలిఫోర్నియాలో ఏం జరిగిందో తక్కిన అన్నిచోట్లా సరిగ్గా అదే జరిగింది. ప్రతి గ్రేంజరురాష్ట్రం హింసల్లో చెలరేగి రక్తవర్షంలో స్నానం చేసింది. ఉక్కుపాదం, మొదట తన రహస్యపు ఏజంట్లద్వారా, దొంగ ముఠాలద్వారా అల్లకల్లోలం సృష్టించింది. తర్వాత సిపాయిమూకల్ని పిలి పించింది. దేశం లోపలిభాగంలో ఉన్న జిల్లాలన్నిట్లోనూ, దొమ్మి, మంది

పరిపాలన రాజ్యంచేసిన్నై. అహోరాత్రాలూ విధివిరామంలేకుండా తగలబడు తోన్న పొలాలు, సరుకుల గిడ్డంగులూ, పల్లెలూ, పట్టణాలకూ ఇక లెక్కే లేదు. మంటలపొగ ఆకాశమన్నంతా అలిమింది. బాంబులు ప్రత్యక్షమైనై. రైలు వంతెన్లనూ, సొరంగాల్ని గాలిలోకి ఉప్పున ఊదేసిన్నై. రైళ్లను నుగ్గు నుగ్గు చేసిన్నై. బీదరైతాంగాన్ని కాల్చిచంపారు. చాలామందిని ఉరితీశారు. మహా భయంకర ఫలితాలు సంభవించిన్నై. చాలామంది ధనికులూ, సైనికోద్యోగులూ హత్య చేయబడ్డారు. ప్రజల హృదయాల్లో రక్తం తుకతుకలాడ్తోంది. ప్రతీకారవాంఛ పరుగులుతీస్తోంది. భారతీయుల్ని కిరాతకంగా హింసించినట్లుగా, పోలీసులు రైతుల్ని దారుణంగా హింసించారు. పోలీసులట్లా ప్రవర్తించడానికి తగినకారణం ఉంది. ఆర్గన్‌లో బ్రహ్మాపరిశయంగా బాంబులు పేలినప్పుడు, రెండువేల ఎనిమిదివందలమంది పోలీసులు ఒక్కపెట్టున తుడిచిపెట్టుకుపోయారు. వివిధ స్థలాల్లో, వివిధ సమయాల్లో, దాదాపు ఒక రైలు బండెడు పోలీసులు సర్వనాశనమైపోయారు. అందుకోసమే, రైతులకు మాదిరిగానే, పోలీసులుకూడా తమ ప్రాణాలకోసం హాహారాహారిగా పోరాడారు.

ఇక మిల్టరీ విషయానికివస్తే; 1908 లో చేసిన మిల్టరీ శాసనాన్ని అమలుపరచారు. ఒక రాష్ట్రానికి సంబంధించిన వ్యక్తులు మరో రాష్ట్రంలో ఉన్న తమ సోదర వ్యక్తుల్ని కాల్చిచంపడానికి పట్టుబలవంతాన ఉపయోగించబడ్డారు. లేకపోతే మరణశిక్ష విధిస్తానంది ఉక్కుపాదం. మొదట, మిల్టరీ శాసనం ప్రశాంతంగా పనిచేయలేదనుకోండి! చాలామంది మిల్టరీ ఉద్యోగుల్ని హత్య చేశారు. గొరిల్లతలకాయ కోర్టుమార్షల్ శాసనంతో చాలామంది మిల్టరీవాళ్లకు ఉరిశిక్షలు పడ్డయ్. మిష్టర్ కొవాల్ట్; మిష్టర్ అస్మన్‌సెన్ విషయాల్లో, ఎర్నెస్టు చెప్పిన జోస్యం అక్షరాలా రుజువైంది. ఇద్దరూ మిల్టరీలో చేరడానికి అర్హులే. కాలిఫోర్నియానుంచి, మిస్సోరీ రైతులపైకి

దండయాత్రకు బైలుదేరిపోయే సైన్యంలోకి ఇద్దర్నీ చేర్చుకొన్నారు. ఇద్దరూ మిల్టరీలో చేరడానికి నిరాకరించారు. వాళ్లిద్దర్నీ దైవానికి అంతిమ స్తోత్రాలు చెప్పుకోమన్నారు. వాళ్లవంతు గొర్రె తలకాయ కోర్టుమార్షల్ శాసనం. మిల్టరీ ఉరిశిక్ష వాళ్ల భరతవాక్యం. తుపాకుల మొగాలకు వాళ్లిద్దరి వీపులూ ఎదురుగా పెట్టించి కాల్చేశారు.

మిల్టరీలో చేరకుండా తప్పించుకోడానికి చాలమంది యువకులు కొండల్లోకి పరుగెత్తిపోయారు. అక్కడవాళ్లు ప్రభుత్వ న్యాయరక్షణనుంచి బహిష్కృతులైనారు. బాగా ప్రశాంత పరిస్థితులు ఏర్పడిన తర్వాతగాని వాళ్లందరికీ శిక్షలు పడలేదు. అది చాలా దారుణమైంది. శాసనానికి కట్టుబడ్డ పౌరులందర్నీ కొండలు వదలి రావలసిందని, మూడు నెలలపాటు ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. ప్రకటన ఐపోయిన వెంటనే ప్రాతమయాలైన జిల్లాలన్నింటికీ, 5 లక్షలమంది సిపాయిలను పంపింది. విచారణాలేదు గిచారణాలేదు. మనిషి ఎక్కడ కనబడ్డే, అక్కణ్ణే నిలువునా కాల్చి చంపారు. ప్రభుత్వ న్యాయరక్షణ బహిష్కృతుడైనవాడు ఏ ఒక్కడుగూడా కొండల్లో సజీవంగా ఉండరాదు, అన్న నిర్ణయంతో ఈ సిపాయిదండు స్వేచ్ఛావిహారం సాగించింది. బలమైన స్థావరాల్లో ఉన్న జనం ముఠాలుగట్టి, వీరోచితంగా పోరాడారు. కానీ, చివరకు, మిల్టరీలో చేరని ప్రతివ్యక్తీ మరణించాడు.

కానాస్ మిల్టరీకి శిక్షలు పడడంతోటి, వెంటనే, ప్రజల మనస్సుల్లో ఒక గుణపాఠం ముద్రపడింది. గ్రేంజర్లకు ప్రతిగా మిల్టరీ ప్రయోగాలు సాగుతున్న ప్రథమ దశలోనే, కానాస్ సిపాయి తిరుగుబాటు సంభవించింది. ఆరువేలమంది మిల్టరీవాళ్లు తిరుగుబాటు చేశారు. చాలా వారాల వరకూ ఏమాత్రం లొంగకుండా కోపోద్రిక్తులుగానే ఉన్నారు. అంగుకనే

వాళ్లను క్యాంపులోనే అట్టేపెట్టేశారు. ఎట్లాగైతేనేం, సంక్షోభకారకులైన ఏజెంట్లే, నిస్సందేహంగా ప్రత్యక్షపు తిరుగుబాటును లేపారు.

ఈ సిపాయీలు, ఏప్రిల్ 22వ తేదీ రాత్రి ఒక్కుమ్మడిగా విజృంభించి తమ అధికార్లను హత్యచేశారు. ఏ కొద్దిమంది అధికార్లోమాత్రం చావు తప్పి కన్నులొట్టబోయి బైటపడ్డారు. ఈ సంఘటన, ఉక్కుపాదం అంచనాకుగూడా అందనిది. ఎందుకంటే, సంక్షోభకారులైన తన ఏజెంట్లు, చూచి రమ్మంటే కాల్చివచ్చినట్లుగా, తమ పనిని కొంచెం అతిగా చేశారు. ఉక్కుపాదానికి అడ్డేలేదు. తిరుగుబాటుకు అది సర్వసిద్ధం చేసింది. మరి, అంతమంది అధికార్లను చంపిన ఘటన, తర్వాత జరిగినదాన్ని తాను సమర్థించుకోడానికి బాగా ఉపకరించింది. ఇంద్రజాల మహేంద్రజాలంవల్లనో అన్నట్లు, నలభై వేలమంది శాశ్వత సిపాయీలు, తిరుగుబాటుచేసిన మిల్టరీవాళ్లను ఒక్కసారి చుట్టుముట్టారు. అదొక పెద్దవల. తమ మెషిన్‌గన్‌లు పాడైపోయినవనీ, తాము వశపర్చుకొన్న మందుగిడ్డంగుల్లోని తూటాలు తమ తుపాకులకు పట్టవనీ, సంపూర్ణ నిస్సహాయస్థితిలో ఉన్న మిల్టరీవాళ్లు గ్రహించారు. లొంగిపోయినట్లుగా తెల్లజెండాను ఎత్తారు. కానీ, ఆ జెండాను ప్రభుత్వం లక్ష్యపెట్టలేదు. బ్రతికిబైటపడ్డవాడొకడూ లేడు. మొత్తం ఆరువేలమందీ అమాంతం మసైపోయారు. దూరంనుంచి వాళ్లమీదకు తుపాకి గుండ్లూ, చిన్న చిన్న ఫిరంగి గుండ్లూ వర్షించినై. ఇక తెగించి వాళ్లు, తమను చుట్టుముట్టిన వాళ్ల మీదకు లాఠీలు తీసుకొని ఎగబడితే, మెషిన్‌గన్‌లతో వాళ్లను నేలమట్టం చేశారు. దీన్నంతా కళ్లారాచూచిన ఒక వ్యక్తితో నేను మాట్లాడా. మిల్టరీవాడు మహావస్తే, మెషిన్‌గన్‌కు 150 గజాలదూరం వరకూ వచ్చాడు అని అతడు చెప్పాడు. భూదేవి శవాల తివాసీతో అలంకరించబడింది. కాల్బలం పదతాడనల్తో, ఆశ్వికదళ ఖురఘట్టనల్తో, ఫిరంగులూ, తుపాకుల గుండ్ల వర్షంతో క్షతగాత్రులు మట్టిలో కూరుకుపోయారు.

గ్రేంజర్ల పతనంతో బాటే, బొగ్గుగని కార్మికుల తిరుగుబాటు బైలు దేరింది. సుసంఘటిత కార్మికబృందంయొక్క అంతిమ ప్రయత్నమిది. 'యశోవా మృత్యుర్వా' అని దిగారు. పది లక్షల మంది గని కార్మికుల్లో ముప్పాతిక మువ్వీసం సమ్మెచేశారు. కానీ, తమ బలానికి అనుకూలంగా ఒక్క చోటతేకుండా, వాళ్ళంతా దేశం మొత్తంమీద అక్కడక్కడా చెదురు చెదురుగా ఉన్నారు. ఏ జిల్లా వాళ్ళను ఆ జిల్లాలోనే ప్రత్యేకంచేసి, లొంగిపోయేటట్లుగా దెబ్బతీసింది ఉక్కుపాదం. ఇది మొదటుగా జరిగిన పెద్ద వ్యాపారం. 'షా కాక్' బానిస వ్యాపారంలో బాగా మొనగాడైనాడు. అతడంటే ప్రజానీకంలో ఆరని ద్వేషాగ్ని రగుల్కొంది. అనేక పర్యాయాలు అతడి జీవితంపై హత్యా ప్రయత్నాలు జరిగినై. కాని, అతడికి మాయా స్వరూపమేదో ఉన్నట్లుంది. గనికార్మికుల్లో, రష్యన్ పాస్‌పోర్టువిధానాన్ని ప్రవేశ పెట్టడానిక్, దేశంలో ఒక భాగంనుంచి మరోభాగానికి మార్చడానికి వీల్లేని వాళ్ళ హక్కును నిరాకరింపజేయడానికి .అతడే బాధ్యుడు.

ఈ మధ్యకాలంలో సోషలిస్టులు, బాగా స్థిర సంకల్పులైనారు. అగ్నిజ్వాలల్లో, రక్తప్రవాహాల్లో గ్రేంజర్లు తుడిచిపెట్టుకుపోయినప్పుడు, సుసంఘటిత కార్మికబృందం విచ్ఛిన్నమైపోయినప్పుడుగూడా, సోషలిస్టులం ప్రశాంతంగా ఉండి, తమ రహస్య సంస్థను పరిపూర్ణస్థాయికి తీసుకువచ్చారు. గ్రేంజర్లు మాతో శుష్కవాదాలు చేశారు. మేం తిరుగుబాటు చేయడమంటే, మొత్తం విప్లవాన్ని ఆత్మహత్య చేయడమన్నమాటే అని సూటిగా చెప్పేశాం. ఒకేసారి మొత్తం ప్రజాసామాన్యంతో ఎట్లా ప్రవర్తించాలా అని ఉక్కుపాదం మొదట్లో కొంచెం సందిగ్ధావస్థలో పడింది. తర్వాత, ఆ పని అనుకొన్నంత కష్టమైందేమీ కాదని తెలుసుకొంది. మేం కూడా విజృంభిస్తే బాగుండునే అని వేయిదేవుళ్ళకు మొక్కుకొంది. నిజానికి సంక్షోభకారులైన ఏజెంట్లు మా మధ్యలోకూడా తోంబలుగా ప్రవేశించినప్పటికీ, మేం

తిరుగుబాటు సమస్యనే తీసుకురాకుండా చేశాం. ఆ మొదటిరోజుల్లో, ఉక్కుపాదం ఏజెంట్లు తలాతోకాలేని పద్ధతుల్ని అనుసరించారు. వాళ్ళు నేర్చుకోవాల్సింది చాలా ఉంది. వాళ్ళు కొంచెం తెలివితేటల్లోపడేలోపల్నే మా పోరాటపుగుంపులు, ముత్తాన్ని, ఏరిపారేశారు. అది చాలా కఠోరమైన కార్యక్రమం. రక్తపాతకృత్యం. కానీ మేం, జీవితంకోసం, విప్లవంకోసం పోరాడుతున్నాం. మరి మేం, మా శత్రువును వాళ్ళ ఆయుధాల్తోటే ఎదిరించాలిగదా. ఐనా మేం సధర్మంగానే ఉన్నాం. ఉక్కుపాదంయొక్క ఏ ఒక్క ఏజెంటునూ విచారణలేకుండా ఉరిదీయలేదు. మేమూ తప్పులుచేసి ఉండవచ్చు. కానీ అవి చాలా అరుదు. మా కామ్రేడ్సుల్లో మంచి ధైర్యం, బాగా యుద్ధం చేయగలశక్తి, ఆత్మత్యాగం కలవాళ్లు యుద్ధసంఘాల్లోకి పోయారు. పది సంవత్సరాలు గడిచినతర్వాత ఒకసారి, యుద్ధ సంఘనాయకులు ఇచ్చిన అంకెల్నిబట్టి, ఎర్నెస్టు లెక్కలు తయారుచేసి, సభ్యత్వాన్ని పొందినతర్వాత, మొగవాళ్లుగాని ఆడవాళ్ళుగాని సరాసరి ఐదేండ్లపాటు మాత్రం జీవిస్తారని తేల్చాడు. యుద్ధసంఘాల్లో చేరిన కామ్రేడ్సు అందరూ వీరాధివీరులే. కానీ, వాళ్ళల్లో ఉన్న తమాషా ఏమిటంటే, ప్రాణాన్ని తీయడానికి మాత్రం అంగీకరించరు. తమ సహజ ప్రవృత్తుల్ని కూడా అతిక్రమించారు. ఐనా వాళ్ళు స్వేచ్ఛను ప్రేమించారు. ఆశయసిద్ధికోసం, ఆత్మత్యాగానికన్నా మరో గొప్పత్యాగం వాళ్ళకు తెలియదు.

మేం, మూడు విధాలైన కార్యక్రమాల్ని ప్రారంభించాం. మా మధ్యలో ఉన్న అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వపు రహస్యపు ఏజెంట్లను కలుపుమొక్కలను ఏరిపారేసినట్లు ఏరేయడం మొదటిపని. యుద్ధసంఘాల్ని నిర్మించడం, అవిగాకుండా విప్లవ రహస్య సంస్థను ఏర్పాటుచేయడం రెండో పని. ఇక మూడోపని ఏమిటంటే, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి సంబంధించిన అన్ని శాఖల్లోనూ, అంటే, కార్మిక కులాల్లో, మరీ ప్రత్యే

కంగా టెలిగ్రాఫర్లలో, సెక్రటరీలలో, గుమాస్తాలల్లో, సైన్యంలో, సంక్షోభ కారకులైన ఏజెంట్లలో, ధనికవ్యాపారస్థుల్లో మా రహస్యపు ప్రతినిధుల్ని ప్రవేశపెట్టడం. అది చాలా నెమ్మదిగా జరగాల్సినపని. కాగా, చాలా ప్రాణాంతకమైందికూడా. తరచుగా మా ప్రయత్నాలు అమూల్యనష్టాల్తో విఫలమైనయ్.

ముఖాముఖి యుద్ధంలో, ఉక్కుపాదం విజయం పొందింది. కానీ, క్రొత్తగా ప్రవేశపెట్టిన, అపూర్వమైన, మహాభయంకరమైన, రహస్య యుద్ధంలోమాత్రం మేము జయంపొందాం. అంతా అగోచరమే. అంతా అనూహ్యమే. అంధుడు అంధుడితో పోరాడాడు. ఐనా అందులోనూ ఒక పద్ధతి, ఒక ప్రయోజనం, అజమాయిషీ ఉంది. ఒకచెంప, ఉక్కుపాదం ఏజెంట్లు మా సంస్థల్లోకి జొరబడుతూంటే, మరోచెంప మేం, మా ప్రతినిధుల్తో ఉక్కుపాదం మొత్తంసంస్థను మటుమాయంగా ఆక్రమించుకొన్నాం. అంధకారబంధురమైన, చుట్టుదారుల్తో కూడుకొన్న, కుచ్చితాల్తో కుట్రల్తో పరిపూర్ణమైన, ఎత్తుల్తో, ఎత్తుకుపైఎత్తుల్తో కూడిన యుద్ధమది. దీనివెనకాల అంతా మహాదారుణమైన, మహాభయంకరమైన మృత్యువు. మాకు అత్యంత సన్నిహితులూ, మాప్రాణప్రాణాలూ ఐన మహిళా, పురుష మిత్రబృందం అంతరించి పోయింది. ఈ రోజు వాళ్ళనుచూచాం. రేపటికి వాళ్ళంతా కను మరుగైపోయారు. మళ్ళీ వాళ్ళను చూడనేలేదు. వాళ్ళంతా మరణించారని మాకు తెలుసు.

. హామిగానీ, నమ్మకంగానీ ఎక్కడాలేదు. మాతోఉండి కుట్రపన్నే వ్యక్తి, బహుళా ఉక్కుపాదం ప్రతినిధిఐ ఉంటాడని మాకుతెలుసు. ఉక్కు పాదం సంస్థల్ని మా రహస్యపు ప్రతినిధుల్తో నింపేశాం. తన సంస్థలోనే, ఉక్కుపాదం తిరిగి తన రహస్యపు ఏజెంట్లను నింపింది. మాసంస్థ విషయం కూడా అంతే. హామీగానీ, నమ్మకంగానీ లేకపోయినప్పటికీ, మాప్రతి ప్రయ

త్నంకూడా హామీతోటి, నమ్మకంతోటీ చేయక తప్పిందిగాదు. తరుచుగా, మేం మోసపోయాం. ప్రజలు బలహీనంగా ఉన్నారు. అద్భుత నగరాల్లో ఉన్న వినోదాల్నీ, ఆనందాన్నీ, విశ్రాంతినీ, ధనాన్నీ, ఇంకా తదితర సౌకర్యాలనూ, ఉత్కృష్టపాదం ఇవ్వగలదు. ఉదాత్త ఆశయానికి విశ్వాసంతో కట్టుబడి ఉన్నాం అనే ఆత్మ సంతృప్తిని తప్ప, మేం ఇవ్వగలిగిందేమీ లేదు. ఇక తక్కిన సంగతంటేనో, ఈ ఆశయానికి విధేయులైన వాళ్ళకు మేం చెల్లించేకూలీ, అంతంలేనినాశనం, చిత్రహింసలు, మరణం.

ప్రజలు బలహీనపడి పోయారని చెప్పా. వాళ్ళ బలహీనతవల్ల, మా అధీనంలో ఉన్న మరో బహుమానాన్ని ఇవ్వక తప్పిందిగాదు. ఆ బహుమానం మరణమే. అవసర తీవ్రతవల్ల, మేం, మా విద్రోహుల్ని శిక్షించాల్సి వచ్చింది. మమ్మల్ని పుట్టిముంచిన ప్రతివ్యక్తిమీదికీ, నమ్మకస్తులైన ప్రతీకారం చేయాలని పట్టుబట్టే వాళ్ళొక డజనుమంది విరుచుకుపడ్డారు. 'షాకాక్'లవంటి మా విరోధులమీదకి తీర్పు ఇవ్వడంలో మేం విఫలులం కావచ్చు. కానీ, మా విద్రోహుల్ని శిక్షించే విషయంలో మాత్రం విఫలులం కాలేదని ఘంటాపథంగా చెప్పగలం. మహాద్భుత నగరాల్లో ప్రవేశించి, నిజమైన విద్రోహులకు మేం విధించిన శిక్షల్ని అమలుపర్చడానికి, మా కామ్రేడ్స్‌నే కొంతమందిని విద్రోహులుగా మారినట్లు నటించడానికి అనుమతించాం. నిజానికి, మాకు విధేయులై ఉండడంకన్నా, విద్రోహులుగామారడం ప్రళయాంతకంగా అనిపించేటట్లు, మేం తీవ్రకృషి చేశాం.

విప్లవం, మొత్తంగా మతస్వరూపాన్ని తీసుకొంది. స్వాతంత్ర్య దైవస్థానమైన విప్లవ దైవపీఠాన్ని మేం కొలిచాం. అది మాలో ప్రవేశించిన దైవతేజం. ఈ మహదాశయానికి, ఆడా, మగా అంతా తమ జీవితాల్ని అంకితం చేశారు. నెత్తురు కందులు, పూర్వం దైవారాధన ముద్రితులైనట్లుగా, నేడు ఈ ఆశయానికి ముద్రితులైనారు. మేం మానవతా ఆరాధకులం.

## ౧౨

గ్రేంజరు ప్రభుత్వాలు పతనంకావడంతో, కాంగ్రెసులో ఉన్న గ్రేంజర్లు కూడా అంతర్ధానం చెందారు. వాళ్ళను దేశద్రోహంక్రింద శిక్షిస్తున్నారు. వాళ్ళస్థానాల్ని, ఉక్కుపాదం తొత్తులు ఆక్రమించుకొన్నారు. సోషలిష్టులు మరీ అన్యాయంగా అల్ప సంఖ్యలో ఉన్నారు. తమ చరమదశ సమీపించిందని వాళ్ళకు తెలుసు. కాంగ్రెసుసభలూ, సెనేట్ సమావేశాలూ కేవలం బూటకాలక్రింద, ప్రహసనాలక్రిందా మారిపోయినై. ప్రజాసమస్యల్ని తీవ్రంగా చర్చించారు. వాటిని పూర్వపు ఫక్కీల్లోనే ప్యాసుచేశారు. అసలు నిజానికి జరిగిందేమిటంటే, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ నిర్ణయాలకు, రాజ్యాంగ తంత్రవిధానపు రంగుపూత వేయడమే.

అంతిమదశ సమీపించిన తరుణంలో, ఎర్నెస్టుపోరాటంలో బాగా నిమగ్నుడై పోయాడు. నిరుద్యోగులకు సహాయంచేయాలి అన్న బిల్లు చర్చకు వచ్చింది. తర్వాత సంవత్సరంలో ఏర్పడ్డ క్లిష్ట పరిస్థితులవల్ల అశేష దరిద్ర ప్రజానీకం అమ్మాబువ్వ! అయ్యాబువ్వ! అని అలమటించేస్థితికి దిగజారింది. రోజురోజుకూ విశ్వరూపాన్ని ధరిస్తోన్న సంక్షోభం వాళ్ళను మరింతగా మట్టుగించింది. ఒకచెంప అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లూ, వాళ్ళ జోహుకుందారులూ అత్యధిక శేషాల్తో పొట్టలు పట్టక ఎట్లాగురా దేవుడా హరించుకోనేది అని అల్లాడుతుంటే, మరోచెంప, లక్షలాది ప్రజానీకం అన్నం మెతుకు దొరుకుతే చాలాఅని ఆక్రోశిస్తున్నారు. ఈ నికృష్ట దౌర్భాగ్య ప్రజలకు మేం, అధఃపాతాళ నివాసులని నామకరణం చేశాం. వాళ్ళ దుర్భర దుస్సహబాధా నివృత్తికోసమే, సోషలిష్టులమైన మేం ఈ నిరుద్యోగపు బిల్లును ప్రవేశపెట్టాం. కానీ, ఈ బిల్లు ఉక్కుపాదానికి రుచించలేదు. ఈలక్షలాది ప్రజలకు, తన సొంత విధానంలో పన్లు కల్పించడానికి అది తయారౌ

తోంది. కానీ, దానిమార్గం, మా మార్గంకాదు. అందుకని, మాబిల్లును ఓడించమని అది ఆజ్ఞలు జారీచేసింది. తమ ప్రయత్నం కొరమాలిందని ఎర్నెస్టుకూ, ఆయన అనుయాయులకూ తెలుసు. గెలుస్తుందా, ఓడుతుందా అన్న సందిగ్ధంతో వాళ్ళకు విసుగెత్తింది. ఏదో ఒకటి తేలాలనుకొన్నారు. వాళ్ళు సాధిస్తున్న దేమీలేదు. తమకు సుతరాం ఇష్టంలేకుండా వ్యవహారిస్తున్న శాసనసభా ప్రహసనానికి భరతవాక్యం పాడదామని వాళ్ళు ఆశించారు. అంత్య పరిణామం ఏమిటో వాళ్ళకు తెలియదు. కానీ, వచ్చిన దానికన్నా మరింత ప్రళయం ముంచుకు వస్తుందనిమాత్రం వాళ్ళు అనుకోలేదు.

ఆ రోజున నేను ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చున్నా. ఏదో మహా భయంకర పరిస్థితి ఆసన్నమైందని మాకందరికీ తెలుసు. అది గాలిలో అదృశ్యంగా ఉంది. నడవలో, బారులుతీర్చి సాయుధ సిపాయీలు ఉండడంతో, అసెంబ్లీ భవనపు ద్వారాల్లోనే సైనికోద్యోగులు గుంపులుగట్టి నిలబడడంతో, దాని స్వరూపం గోచరించింది. అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వం సమ్మెకు సన్నద్ధమైంది. ఎర్నెస్టు మాట్లాడుకున్నాడు. వాళ్ళ అంతరాత్మల్ని, హృదయాల్ని ఎట్లాగో ఒకట్లా కరిగించేటట్లు చేయడానికి, నిరుద్యోగుల బాధల్ని అతడు కరుణార్ద్రంగా వర్ణిస్తున్నాడు. కానీ, రిపబ్లికన్ పార్టీ సభ్యులూ, డెమొక్రటిక్ పార్టీ సభ్యులూ ఆయన్ను అవహేళనచేసి అల్లరి పట్టించారు. పాలికేకలు బైలుదేరినై. గంద్రగోళమైంది. ఒక్కసారిగా ఎర్నెస్టు తన రంగాన్ని మార్చాడు.

"మిమ్మల్ని వప్పించేటట్లుగా, మీకు నచ్చేటట్లుగా నే నే రకంగా చెప్పాలో నాకేమాత్రం తెలియదు. మీకు నచ్చచెప్పటానికి, మీ కసలు అంతరాత్మలే లేవు. మీరంతా వెన్నెముకల్లేని దుర్బలజీవులు. మేం, రిపబ్లికుల మనీ, డెమోక్రెట్లమనీ మీరు పెద్దగా బడాయిలు కొట్టుకుంటారు. అసలు రిపబ్లికన్‌పార్టీ లేదు. డెమోక్రెటిక్ పార్టీలేదు. ఈ శాసనసభలో రిపబ్లికన్‌లూ

లేరు. డెమోక్రాట్లూ లేరు. మీరంతా ధనికవర్గానికి తార్పుడుగాళ్ళు. వాళ్ళ ఎంగిలి పుల్లాకులు నాకేవాళ్ళు. వాళ్ళ ...... మన్ను నలిచే బడితొత్తులు. మీకున్న స్వేచ్ఛా పిపాసనుగూర్చి, బూజుపట్టిన ప్రాచీన పదజాలంతో వాగ్వ్యయం చేస్తారు. అదేసమయంలో, ఉక్కుపాదం దుస్తుల్ని అలంకరించుకొంటున్నారు." అన్నాడు.

ఈ ఘట్టం వచ్చేటప్పటికి, "ఆర్డర్! ఆర్డర్!" అన్న అరుపుల్తోటీ, చప్పట్లతోటీ, ఎర్నెస్టు గళం వినిపించలేదు. ఈ గ్రందగోళం కొంత ఉపశాంతించేవరకూ, ఆయన నిర్లక్ష్యంగా ఊరుకొన్నాడు. వాళ్ళందర్నీ ఒక కట్టులో కట్టడానికి ఆయన తన చేతిని ఒక్కసారి విసిరి, తన కామ్రేడ్స్ వైపు తిరిగి,

"తిండితో బాగా మదాయించిన, ఈ మృగాల భయంకరారావాల్ని వినండి!" అన్నాడు.

రాక్షససభ మళ్ళా రంపిల్లింది. రభసరేపింది. ప్రశాంతతకోసం, స్పీకరు, బల్లబాదాడు. గృహద్వారాల్లో నిలబడ్డ సైనికోద్యోగులవైపు సాభిప్రాయంగా దృష్టి ప్రసరించాడు. న్యూయార్కు సభ్యుడైన పెద్ద రాంఢోలు గాడొకడు, ఎర్నెస్టును, 'అరాచక వాది' అని పొలికేక పెట్టాడు. ఎర్నెస్టును చూస్తే ప్రళయభీకరమూర్తిగా ఉన్నాడు. ఆయన్లో ఉన్న ప్రతి జీవనాడీ వీరత్వంతో ఉద్రేకోగ్రత్లూగుతోంది. ఆయన మొగం కాలాంతకమూర్తి మొగంగా ఉంది. ఐనా అంతా తమాయించుకొని ప్రశాంతగా ఉన్నాడు.

"జ్ఞాపకం పెట్టుకోండి! దరిద్ర పరిజానీకానికి మీ రీనాడు దయ చూపించినట్లుగానే, ఒక నాటికి ఈ దరిద్రపరిజానీకమే మీకు దయచూపిస్తుంది." అని ఆ అల్లరినంతా మింగేసే కంఠంతో ఆయన చెప్పాడు.

"రాజద్రోహం" "అరాచకవాది" అన్న పొలికేకలు ఇనుమడించిన్నై.

"మీరీ బిల్లుకు ఓటుచేయాలని నాకు తెలుసు. దీనికి వ్యతిరేకంగా ఓటు చేయమని మీరు మీ మొగుళ్ళదగ్గర్నుంచి హుకుమ్‌లు వచ్చినై. ఐనా, నన్ను మీరు అరాచకవాది అని పిలుస్తున్నారు. ప్రజాప్రభుత్వాన్ని నాశనంచేసిన మీరు, సిగ్గూయెగ్గూలేకుండా, ఉక్కుపాదం దుస్తుల్ని వేసుకొని బహిరంగంగా తిరుగుతోన్న మీరు, నన్ను అరాచకవాది అంటున్నారు. నరకవహ్నిలోనూ, గంధకద్రవంలోనూ నాకు నమ్మకంలేదు. కానీ, ఇటువంటిసమయాల్లో, వాటిని విశ్వసించనందుకు ఎంతగానో పరితపిస్తున్నా. అంతేకాదు, ఇటువంటి సమయాల్లో వాటిని నేను తప్పకుండా నమ్ముతా. తప్పకుండా నరకమనేది ఒకటి ఉండి ఉండాలి. ఎందుకంటే, మీరుచేసిన నేరాలకు తగ్గ శిక్షలుపడాలంటే, నరకానికన్నా ఇంకా తక్కువప్రదేశమే లేదు. మీరున్నంతకాలం, బ్రహ్మాండంలో, నరకాగ్నికి అత్యంత ప్రధానావసరం ఎంతైనా ఉంది."

గృహద్వారాల్లో కదలిక బైలుదేరింది. అదేమిటో చూద్దామని, ఎర్నెస్టూ, స్పీకరూ, తక్కిన సభ్యులూ ఆవేపు తిరిగారు.

"మిస్టర్. స్పీకర్ ! నీ సిపాయి బృందాన్ని లోపలికిపిలిచి, వాళ్ళ పనిని నిర్వర్తించమని అను శాసించలేదేం ? వాళ్ళు మీ పన్నగడల్ని దండయాత్రలద్వారా నిర్వహించాలిగదా" అన్నాడు ఎర్నెస్టు.

"ఇంకా ముందున్నయ్ బోలెడు పన్నగడలు. అందుకే సిపాయీలు ఇక్కడకు వచ్చారు." అన్న తిరుగు సమాధానం వచ్చింది.

"మన వ్యూహాలంటే, హత్యచేయడం, లేకపోతే అటువంటిపనే మరేదో అని అనుకోంటా" అని ఎర్నెస్టు అవహేళనగా మాట్లాడాడు.

కానీ, "హత్య" అన్నపదం నోటినుంచి వచ్చేసరికి, మళ్ళీ పొలికేకలు బైలుదేరినై. ఎర్నెస్టు గొంతు ఆ గలభాలో వినపడలేదు. అందుకని, సద్దుమణిగేదాకా అట్లాగే నిలబడి నిరీక్షించాడు. అప్పుడు జరిగిందది. గ్యాలరీలో

కూర్చున్న నాకు బాంబు ప్రేలిన మంటతప్ప మరేమీ గోచరించలేదు. దాని గర్జారావానికి నాచెవులు దిబ్బెళ్ళు పడ్డయ్. పొగమధ్యలో ఎర్నెస్టు దొర్లు కుంటూ కిందపడిపోవడం, అన్ని మూలలనుంచీ సిపాయి లొక్కసారిగా పరుగెత్తుకురావడం, గమనించా. కోపంతో బాగా రెచ్చిపోయి, ఎటువంటి హింసాచర్యకైనాసరే చేయడానికి సమర్థులైన ఆయన కామ్రేడ్సు, ఒక్క సారి లేచి నిలబడ్డారు. కానీ ఎర్నెస్టు ఒక్కక్షణం తమాయించుకోని, ప్రశాంతంగా ఉండమని తన చేతుల్ని వీచాడు.

"అది ఒక కుట్ర! మీరేంచేయవాకండి! ఏమన్నా చేశారో మిమ్మల్ని నాశనం చేస్తారు." అన్న తన కామ్రేడ్సుకు హెచ్చరిక చేసిన ఎర్నెస్టు కంఠం కంచుమోగినట్లు మోగింది.

తర్వాత ఆయన క్రమక్రిమేపీ క్రుంగి పోయాడు. సిపాయిలు ఆయన దగ్గరకి చేరారు. మరుక్షణంలో, వాళ్ళు గ్యాలరీలను ఖాళీలు చేయించారు. నేనింకా ఏమీచూడలేదు.

ఆయన నా భర్తైనా, ఆయన దగ్గరకి పోవడానికి నాకు అనుమతి ఇవ్వలేదు. నేనెవరోన్ని తెలియచెప్పిన వెంటనే, నన్ను అరెస్టు చేశారు. అదే సమయంలో వాషింగ్టన్ కాంగ్రెసు సభ్యులైన సోషలిస్టులందర్నీ అరెస్టు చేశారు. చివరికి, తన హోటల్లో టైఫాయిడ్ జ్వరంతో మంచమెక్కిన దుర దృష్టవంతుడైన సింప్సన్‌నుకూడా వదలిపెట్టలేదు.

చాలా క్లుప్తంలో కచ్చితంగా విచారణ సాగించారు. అందరి శిక్షలూ ముందుగానే నిర్ణీతమైనై. ఆశ్చర్యమేమిటంటే, ఎర్నెస్టునుమాత్రం ఉరితీయ లేదు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం చేసిన పెద్ద తప్పిదమిది. అందు లోనూ ఘోరమైన తప్పిదం. కానీ, ఆరోజుల్లో అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి అపరిమితమైన ఆత్మవిశ్వాసం ఒకటుంది. విజయోన్మాదంచేత దానికి కిందూమీదూ తెలియని కాలమది. వ్రేళ్ళమీద లెక్కించదగ్గ ఆ కొద్ది

మంది మహావీరులే, తమ పునాదుల్నే లేపేయగలరని అది ఏమాత్రంకూడా ఊహించలేదు. రేపు బ్రహ్మాండమైన తిరుగుబాటు బైలుదేరినప్పుడు, మొత్తం జగత్తంతా, అశేష ప్రజాప్రస్థాన యాత్రలో, వాళ్ళ పదఘట్టనల్తో ప్రతిధ్వనించి పోయినప్పుడు, చేతులుకాలిన తర్వాత ఆకులుకోసం వెతుక్కొన్నట్లు, ఆ కొద్దిమంది వీరులూ, వేయిఏన్గుల బలంతో ఎట్లా అభివృద్ధి చెందారో, అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం గ్రహిస్తుంది.

విప్లవవాదుల వ్యూహాల్నీ, రహస్యాల్నీ, భయాల్నీ, ఆశల్నీ లోపల ఉండి గ్రహించగల, స్వయంగా విప్లవవాదినైన నేను, కాంగ్రెస్ సమావేశంలో బాంబుపేల్చిన నేరస్తులని వాళ్లమీద చేసిన దోషారోపణకు, తగ్గ సమాధానం చెప్పగల కొద్దిమంది వ్యక్తుల్లో బాగా తగినదాన్ని. కాంగ్రెస్‌లో ఉన్న సోషలిస్టులనుగాని, బైటఉన్న సోషలిస్టులనుగాని ఆ విషయంలో ఏమాత్రం ప్రమేయంలేదని, నిస్సందేహంగా ఘంటాపథంగా బల్లగుద్దిచెప్పగలను. బాంబెవరు విసిరిందీ మాకు తెలియదు. అయితే ఒక్క విషయంమాత్రం దృఢంగా చెప్పగలం. అది మేం విసరలేదని.

పైగా, ఉక్కుపాదమే ఈ సంఘటనకు బాధ్యమైందని చూపించడానికి రుజువుకూడా ఉంది. ఐతే, మేం దీన్ని నిర్ధారించలేమనుకోండి. మా నిర్ణయం కేవలం ఊహా మాత్రమే. కానీ, మాకుతెలిసిన కొన్ని సత్యవిషయాలిక్కడున్నయ్. ప్రభుత్వరహస్యశాఖకుసంబంధించిన ఏజెంట్లు, సోషలిస్టు కాంగ్రెస్ సభ్యులు దారుణవిధానాల్ని అనుసరించబోతున్నారనీ, వాళ్ళ దారుణవిధానాల్ని కార్యరూపంలోపెట్టడానికి ఒక రోజుకూడా నిశ్చయించుకొన్నారనీ, స్పీకరుకు రిపోర్టుచేశారు. బాంబు పేలినరోజే అది. అందుగ్గాను, ముందు జాగ్రత్తకోసమని, ముఖ్యపట్టణం సైన్యంతో నిండిపోయింది. మాకు బాంబుల విషయం ఏమీ తెలియకపోవడం, నిజంగా ఒక బాంబు పేలడం, బాంబుపేలడానికి ముందుగానే ప్రభుత్వం ఆయత్తం

కావడం, వీటన్నిటివల్లా, ఉత్క్రపాదానికి సర్వం తెలుసని నిర్ధారించటంలో ఎంతైనా సబబు ఉంది. ఇంకా, ఉత్క్రపాదమే రెచ్చగొట్టిందనీ, నేరాన్ని మా బుజాలమీద మోపి, దానిద్వారా మమ్మల్ని నాశనంచేయడానికి ముందుగానే కుట్రపన్ని రెచ్చిపోవడానికి సన్నాహంచేసిందనీ, ఉత్క్రపాదంమీద మేం దోషారోపణచేస్తున్నాం.

స్పీకరుదగ్గర్నుంచి, ఎర్రదుస్తులు ధరించి అసెంబ్లీభవనంలో ఉన్న వాళ్ళందరికీ, ఈ హెచ్చరిక వ్యాపించింది. ఎర్నెస్టు మాట్లాడుతుండగా, ఏదో దారుణకృత్యం ఒకటి జరుగుతుందని వాళ్లకు తెలుసు. వాళ్ళమీద అభాండంవేయడం దేనికిగాని, ఆ దారుణకృత్యం మాత్రం సోషలిస్టులవల్లనే జరుగుతోందనే ఘట్టి నమ్మకంలో ఉన్నారు. విచారణసమయంలోనూ, అదేనమ్మకంతో, బాంబును విసరడానికి ఎర్నెస్టు సిద్ధపడడం తాము చూశామనీ, కానీ అది ముందుగానే పేలిందనీ, చాలామంది రుజువు పల్కారు. వాళ్లేమీ చూడలేదనుకోండి. భయాందోళనల్తోకూడిన ఊహల్తో తాము చూచామని అనుకొన్నారు. అంతే.

"నేనే బాంబును విసరబోతుంటే, అప్పుడు కాంగ్రెసు సమావేశంలో విసరబడ్డ వత్తి చచ్చుబాంబు వంటిదాన్ని విసురుతానన్నది ఏమన్నా సహేతుకంగా ఉందా? దాంట్లో తగినంత మందులేదు. అది బోలెడంత పొగనుమాత్రం కక్కింది. నన్నుతప్ప యెవర్నీ గాయపరచలేదు. అది సూటిగా నా కాళ్ళదగ్గర్నే పేలింది. ఐనా నా ప్రాణం తీయలేదు. నన్ను నమ్మండి. నేనే బాంబులువిసరడానికి ఉపక్రమిస్తే, అపరిమితనష్టాన్ని కలిగిస్తా. నా ఫిరంగుల్లో ఉండేది పొగగాదు. మృత్యుమార్గం" అని విచారణ సమయంలో ఎర్నెస్టు చెప్పాడు.

అసలు బాంబులో బలంలేకపోవడం సోషలిస్టులతప్పు. ఎర్నెస్టు గాభరా తిని చేతిలోనుంచి జారవిడిచినందువల్లే అది అనుకొన్న దానికన్నా

ముందుగా పేలడం, సోషలిస్టుల మరో తప్పు అని, ఎర్నెస్టు వాదనలకు ప్రతిగా ప్రాసిక్యూషన్ వాదించింది. ఆ వాదాన్ని ఖాయపర్చడానికి, ఎర్నెస్టు గాభరా పడి, బాంబును చేజార్చడం కళ్ళారా చూశామని చాలామంది కాంగ్రెసు సభ్యుల సాక్ష్యాలు తోడిచ్చినై.

మామటుకు మాకు బాంబు ఎట్లా విసిరేయబడిందీ ఒక్కరికీ తెలియదు. ఆ బాంబు పేలేముందు, అది తనపాదాలదగ్గరకు వచ్చి కొట్టుకోవడం ఒక్క క్షణమాత్రం తాను చూచాననీ, విన్నాననీ ఎర్నెస్టు నాతో చెప్పాడు. ఈవిషయాన్నే ఆయన విచారణ సమయంలో గూడా ఉద్ఘాటించాడు. కానీ ఆయన్ను ఎవరూ విశ్వసించలేదు. ఇదంతా గాకుండా పైపెచ్చు, దాన్ని గ్రామ్యంలో చెప్పాలంటే 'మసిపూసిన మారేడుకాయ' అన్నారు. ఉక్కు పాదం మమ్మల్ని నాశనం చేయడానికి పూనుకొంది. ఇక దాన్ని ఆపడమంటూ లేనేలేదు.

నిజం బైటపడక తప్పదన్న జనశ్రుతి ఒకటుంది. ఆ జనశ్రుతిని అనుమానిస్తున్నా. పందొమ్మిది సంవత్సరాలు చెల్లిపోయినై. విసుగూ విరామం లేకుండా మేం కృషి చేస్తున్నప్పటికీ, నిజంగా బాంబును విసిరిన వ్యక్తినే కనుక్కోలేక పోయాం. నిస్సందేహంగా అతడు ఉక్కుపాదం రహస్యపు ఏజెంటై ఉంటాడు. కానీ అతడు గుర్తింప బడకుండా తప్పించుకొన్నాడు. అతణ్ణి గుర్తుపట్టడానికి అణుమాత్రంకూడా ఆధారం లభించలేదు. ఇక ఇంతకాలం గడిచిపోయిన ఈనాడు, ఆ సంఘటన, చరిత్రలో జరిగిన విచిత్రవిషయాల్లో ఒకటిగా మిగిలి పోవడంతప్ప మరేమీలేదు.

## ౧౮

ఆ కాలంలో నన్నుగూర్చి చెప్పాల్సిన విషయం అట్టే ఏమీలేదు. నామీద ఏమీ నేరారోపణ చేయక పోయినప్పటికీ, అర్ధ సంవత్సరంపాటు

నన్ను జైల్లో అట్టేపెట్టారు. నేను అనుమానితురాలిని. ఈ పదం భయాన్ని కలిగించేదని, విప్లవవాదులందరూ వెంటనే తెలుసుకొన్నారు. కానీ, అప్పుడే మొలకెత్తిన మా రహస్యపుశాఖ పనిచేయడం ప్రారంభించింది. నేను జైల్లో ఉన్న రెండోనెల చివర్లో, ఈ మా రహస్యశాఖతో పరిచయంవల్ల, జైలర్లల్లో ఒకతను తానువిప్లవవాదినైనానని స్వయంగా నాకువెల్లడించాడు. కొన్ని వారాల తదనంతరం, అప్పుడే కొత్తగా నియమించబడ్డ జైలు డాక్టరు జోసఫ్ పార్క్‌హర్ట్స్, యుద్ధ సంఘాల్లో చేరిన సభ్యుడిగా రుజువైనాడు.

ఈ విధంగా, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ సంస్థలో మా సంస్థ సాలెగూడు అల్లుకుపోయినట్లుగా అల్లుకుపోయింది. నేను బాహ్య ప్రపంచంలో లేకపోయినప్పటికీ, ఇందువల్ల, జగత్తులో ఏం జరుగుతున్నదీ మొత్తం తెలుసుకొన్నాను. ఇంకాపైగా, ఉక్కుపాదం నౌకర్లుగా మారురూపాలు ధరించిన సాహసోపేతులైన మా కామ్రేడ్సుతో, జైల్లో నిర్బంధింపబడ్డ మాప్రతి నాయకుడూ సంబంధాలు ఏర్పర్చుకొన్నాడు. పసిఫిక్ సముద్రతీరంలో మూడువేలమైళ్ళ దూరంలో ఎర్నెస్టు బందీగా ఉన్నప్పటికీ, ఆయనకూ నాకూ అవిచ్ఛిన్నంగా వార్తలు నడుస్తూనే ఉన్నయ్. మా ఉత్తరాలు అటూఇటూ సక్రమంగా చేరుతూనే ఉన్నయ్.

జైళ్ళల్లోనూ, బైటా ఉన్న నాయకులు పరస్పరంగా చర్చించుకొని, ఉద్యమాన్ని నడపగల్గుతున్నారుకూడా, కొన్ని నెలల్లోగా వాళ్ళల్లో కొందరు జైలునుంచి తప్పించుకుపోవడం జరిగిఉండేదేగాని, మా వ్యవహారాలకు జైళ్లు ఏ విధమైన ఆటంకాలూ కానందువల్ల, పరిపక్వస్థితికి రాకుండానే దేన్నీ జరగకుండా చూడాలని నిశ్చయించుకొన్నారు. ఏభైరెండు మంది కాంగ్రెసు సభ్యులూ, మానాయకుల్లో మూడువందలమంది పైచిల్లుగ్గా, జైల్లో ఉన్నారు. వాళ్ళందర్నీ పర్యాయక్రమంలో విడుదల చేయాలని వ్యూహాంపన్నారు. వాళ్ళల్లో ఒకభాగం తప్పించుకుపోతే, అల్పసంఖ్యాక

నిరంకుశ ప్రభుత్వంయొక్క జాగ్రత్తను మరింత హెచ్చుచేసిన వాళ్ళమై తక్కినవాళ్ళు తప్పించుకుపోకుండా ఆటంకం కలిగించిన వాళ్ళమౌతాం. అట్లాగాక, దేశమంతా పర్యాయక్రమంగా జైలు విడుదల జరిగితే, సామాన్య ప్రజానీకంలో తీవ్రమైన మానసిక ప్రభావం ఏర్పడుతుంది. అది మన బలాన్ని నిరూపించి, మనకు ఆత్మ విశ్వాసాన్ని కలిగిస్తుంది.

ఆర్నెల్ల అనంతరం నేను జైలునుంచి విడుదలైన తర్వాత, అంతర్ధానంచెంది, ఎర్నెస్టు తలదాచుకోటానికి సురక్షితమైన ప్రదేశాన్ని సిద్ధంచేయాలని ఏర్పాటు జరిగింది. అంతర్ధానం కావడమంటే అంత సులభమైన గాదు. నేను జైలునుంచి బైటకివచ్చానో లేదో ఆమరుక్షణంనుంచే ఉక్కు పాదం గూఢచారులు నాపాద ముద్రల్ని పసిగట్టడం ప్రారంభించారు. నాపాద ముద్రలు కనపడకుండా వాళ్ళ కళ్ళల్లో దుమ్ముచల్లాలి, మరి నేను కాలిఫోర్నియాకు చేరుకోవాలి. ఈ ఏర్పాటు చేయబడ్డమార్గం పరిహాసా పాత్రంగా ఉంది.

రష్యన్ పద్ధతుల్లో అప్పటికే ప్యాస్‌పోర్టు విధానం అభివృద్ధి చెందుతోంది. నా అసలు స్వరూపంతో ఖండాన్ని విడిచి దాటిపోవడానికి దమ్ములులేవు. నేను ఏనాటికైనా ఎర్నెస్టును చూడడమే తటస్థిస్తే, నాస్వరూపాన్నే పూర్తిగా తుడిచేసుకోవాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే, ఆయన తప్పించుకొన్న తర్వాత, నాపాద ముద్రల్ని పసిగట్టి, ఆయన్ను మళ్ళీ బంధిస్తారు. నేను ప్రొలిటేరియన్‌గా మారువేషందాల్చి ప్రయాణం చేయలేను. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ సభ్యురాలిగా వేషాన్ని ధరించడం ఒకటీ మిగిలిఉంది. ఇక ప్రధానమైన అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్ల సంఖ్య బహుస్వల్పం. కాగా, అంత ప్రధానులుగాకుండా అంతకన్నా కొంచెం తక్కువ స్థాయిలో, మిస్టర్. విక్సన్‌లాంటి, కొన్ని లక్షల డాలర్లు కలిగి, ప్రధాన అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లను అంటిపెట్టుకొనే

రకాలం బొచ్చెడుమంది ఉన్నారు. ఈ తక్కువరకపు నిరంకుశ ప్రభుత్వాధికార్ల భార్యలూ, కూతుళ్ళూ లక్షోపలక్షలున్నారు. నేను అటువంటి వ్యక్తుల వేషాన్ని ధరించాలని నిశ్చయమైంది. ఇంకా కొన్ని సంవత్సరాలు గడిస్తే ఇది చాలా దుర్లభమైన విషయంగా ఉండేదే. ఎందుకంటే, దేశంలోఉన్న ఏపురుషుడుగాని, స్త్రీగాని, పసిపిల్లగాని, కాలు కదిపితే, వాళ్ళ చర్యలు రిజిస్టరుకాకుండా, లెక్కలోకి తీసుకోకుండా ఉండడానికి వీల్లేనట్లుగా, ప్యాస్‌పోర్టు విధానాన్ని మాంచి పకడ్బందీలో ఉంచబోతున్నారు.

కాలం పరిపక్వమైన తర్వాత నాచర్యల్ని గుర్తించకుండా గూఢచారుల కళ్ళకు దుమ్ముకొట్టాం. ఒకగంటతర్వాత చూస్తే, ఎవిస్ ఎవర్‌హార్డ్ అదృశమైపోయింది. ఆసమయంలో, ఇద్దరు దాసీలు, ఒక్క ముద్దుకుక్క, ముద్దుకుక్క కోసం మరోదాసీతో 'ఫెలిస్ వాన్ వెర్డిఘున్' అనే ఆమె, పుల్‌మన్ అనే పేరుగల బ్రహ్మాండమైన రైల్వే కారు డ్రాయింగ్ రూములో ప్రవేశించింది. కొద్దిక్షణాల్లో, ఆకారు ఆఘమేఘాలమీద, పశ్చిమంగా పరుగెత్తుకు పోయింది.

నాతో వచ్చిన ముగ్గురు దాసీలు విప్లవ వాదినులు. అందులో ఇద్దరు యుద్ధసంఘ సభ్యురాండ్రు. మూడోఆమె 'గ్రేస్‌హోల్ బ్రూక్'ఆ సంవత్సరమే సభ్యురాలిగా చేరింది. ఆర్నెల్ల తదనంతరం ఉక్కుపాదం ఆమెను ఉరిదీసింది. కుక్క కోసం వినియోగింపబడ్డ వ్యక్తి ఆమే. ఇక తక్కిన ఇద్దర్లో, 'బెర్టాస్టోల్' అనే ఆమె. పన్నెండు సంవత్సరాల తర్వాత కనుమరుగైపోయింది. రెండోఆమె 'అన్నారాయల్‌స్టన్' ఇప్పటికీ సజీవంగానే ఉండి, విప్లవోద్యమంలోఅత్యంత ప్రముఖపాత్ర వహిస్తోంది.

పెద్దసాహసమేమీ అక్కర్లేకుండానే మేంకాలిఫోర్నియాకు పోవడానికి సంయుక్తరాష్ట్రాల్ని అధిగమించాం. ఓక్లాండులో పదహారోవీధి స్టేషన్లలో బండి ఆగినప్పుడు, మేం దిగిపోయాం. అక్కడ, ఇద్దరు దాసీల్తోటీ ముద్దుకుక్కతోటీ, ముద్దుకుక్కకోసం ఉన్నదాసీతోటీ, 'ఫెలిస వాన్‌వెర్డిఘున్'

శాశ్వతంగా అంతర్ధానంచెందింది. బాగా నమ్మదగ్గ కామ్రేడ్సువచ్చి దాసీల్ను తీసుకు పోయారు. తక్కిన కామ్రేడ్సు నావిషయం బాధ్యత తీసుకొన్నారు. రైలుబండి వదిలిన అరగంటలోపల్నే, నేనొక చేపలు పట్టుకొనే చిన్న పడవమీదఉన్నా. మరుక్షణంలో శాన్ఫ్రాన్సిస్కో అఘాత జలం మీద ప్రయాణం చేస్తున్నా. వెర్రిగాలులు వీచినై. రాత్రి చాలాభాగం, మేం ఆలోచనారహితంగా మా పడవను నెట్టుకు పోయాం. కానీ ఎర్నైట్టు ఉన్న 'ఆల్కట్రాజ్' ప్రదేశపు దీపాల వెలుగులు నాకు గోచరించినై. ఆయనకు చాలాదగ్గర్లో వచ్చామన్న ఆలోచనవల్ల మనశ్శాంతి కలిగింది. తెల్లవారేటప్పటికల్లా, బెస్తవాళ్ళు మహాద్భుతంగా తెడ్లు వేసినందువల్ల, వాళ్ళ పుణ్యమా అంటూ 'మారిన్' ద్వీపాలకు చేరుకున్నాం. ఇక్కడ పగల్లా దాక్కున్నాం. మళ్ళీ ఆ రోజు రాత్రి, తరంగపువాలులోబడి, కొత్తగాలుల తాకిడితో రెండు గంటల్లోనే 'సాన్‌పాబ్లో' అఘాతాన్ని దాటి, 'పెటల్ మాక్రీక్' దగ్గరకి దూసుకుపోయాం.

ఇక్కడ మరో కామ్రేడ్ గుర్రాల్తో సహా సిద్ధంగా ఉన్నాడు. ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే గుర్రాలెక్కి మే మిద్దరం, మిణుకు మిణుకుమని వెలిగే నక్షత్రకాంతుల్లో దౌడుతీశాం. మాగమ్యస్థానమైన 'సానోమా' పర్వతం చాలా దూరంగా కనబడుతోంది. పాత 'సానోమా' నగరాన్ని మా ఎడమభాగంలో వదిలేసి, ముందుకు చొచ్చుకువచ్చిన కొండల మధ్యలో ఉన్న లోయలోగుండా ప్రయాణం చేశాం. మొదట్లో రథ్యగాఉన్న లోయమార్గం కొంతదూరం సాగేటప్పటికి వీధి అయింది. ఇంకొంచెం పోయేటప్పటికి వీధల్లా గొంది అయింది. పోను పోను గొందికూడా తగ్గి తగ్గి పోయి పోయి, పీఠభూమి పచ్చికబయళ్ళలో ఆగిపోయింది. ఏకాఏకి సానోమా పర్వతం మీదగా దౌడుతీశాం. అదే అన్నిటికన్నా సురక్షితమార్గం. అక్కడ మా గమనాన్ని గుర్తించే యంత్రబ్రహ్మగాడెవడూ లేడు.

మేం ఉత్తర శిఖరాగ్రం దగ్గరకు వచ్చేటప్పటికి, తూర్పురేఖలు తెల్లవారుతున్నయ్. పీడోక్కులుతీసుకొంటున్న. గ్రీష్మ దీర్ఘనిశ్వాసంతో వెచ్చగా ఉండి బాగా లోతైన ఎర్ర అరణ్యపు లోయల్లోకి, ఆ మసక వెల్తుర్లో, అక్కడనుంచి దిగాం. నేను ప్రేమించిన చిరపరిచితమైన ప్రదేశం అది. వెంటనే నేనే మార్గదర్శకురాలినైనా. నా భూభాగంలోనే తల దాచుకోబోతున్నా. దాన్ని నేనే ఎన్నుకొన్నా. అక్కడున్న అవరోధాలన్నీ అధిగమించి, పీఠభూమిలో ఉన్న పచ్చికబయలు దాటిపోయాం. అక్కణ్ణించి ఒక చెట్లతో ఆవరింపబడి, పల్లంగా ఉన్న యిరుకుమార్గంగుండా పోయి, మరో చిన్న పచ్చికబయల్లోకి దిగాం. మళ్ళీ మేం ఒక చిన్న ఇరుకుమార్గానికి ఎక్కాం. ఈ మార్గంలో ఇంకా ఎర్రటి వృక్షాలు చాలా ఉన్నయ్. మేం ఎక్కిపోతోంటే, ఉదయభాస్కరుని, లేతబంగారుకిరణాలు మా వీపుల మీద ప్రసరిస్తున్నయ్. మా గుర్రాల డెక్కల చప్పుడు విని, ఆ చెట్లగుంపులోంచి పక్షిబృందం ఒకటి రెక్కలల్లార్చుకుంటూ లేచిపోయింది. పెద్ద అడవి కుందేలొకటి, లేడిమాదిరిగా చడీచప్పుడు లేకుండా, మా మార్గానికడ్డంగా మహావేగంతో ఎగిరిగంతేసి పారిపోయింది. సూర్యుడి స్వర్ణారుణకిరణాలు మెడమీద, భుజాలమీద ప్రసరిస్తుండగా, ఒక లేడి, సూదిమొనల్లాంటి కొమ్ములు గల జింక ఒకటి, మా ముందుగానే లోయవిడిచి పరుగుతీసినై.

ఆ జింకను అనుసరించి మేం కొంతదూరం వెళ్ళాం. ఆ జింక వంకర టింకర మార్గంగుండాపడి, ఎర్ర అరణ్యాల్లోకి అదృశ్యమైపోయిన చోటికి పోయి నిలిచాం. ఈ ఎర్ర అరణ్యపు చెట్లు, పర్వత ధాతుజలనీలమైన ఒక కుంట చుట్టూ ఉన్నయ్. నాకు ఆ మార్గంలో ప్రత్యంగుళం తెలుసు. రచయితయైన నా మిత్రుడి కొకడికి పూర్వం ఇక్కడ పశువులఫారం ఉండేది.! కానీ, అతడూ నాకన్నా ప్రళయాంతకుడైన విప్లవవాదిగా మారాడు. ఎందుకంటే, అతడు అప్పుడే మరణించాడు. ఎక్కడ? ఎట్లా? మరణించాడో

ఎవరికీ తెలియదు. నేనీనాడు తలదాచుకోవడానికి రావలసిన ప్రదేశంయొక్క రహస్యం, అతడు బ్రతికిఉండగా, అతడికొక్కడికే తెలుసు. అతడా బీడును అందంకోసం కొన్నాడు. ఆ బీడుకు పెద్ద ధరకూడా పెట్టాడు. అక్కడ స్థానికంగా ఉన్న రైతులు, వీడెక్కణ్నుంచి వచ్చాడ్రా పీడా కారమ్మండాకొడుకు అని తనని తిట్టుకొంటూండేవాళ్ళు అని, చాలాసేపు లెక్కలు కట్టుకొని, "పోరా! నీవు మాక్కూడా అందని ధర పలికి కొనుక్కున్నావుగాని, ఆఖరికి దీనిమీదవచ్చే ఆదాయం, మహాఅస్తే నీ పెట్టుబడి మీద నూటికి ఆరురూపాయలు గిట్టింపవుతయ్యేమో కాని, అంతకన్నా మా నోళ్ళుకొట్టి, నీవు బావుకొనేది ఏమీలేదంటూండే వాళ్ళు" అని, అతడు నవ్వుతూ నాతో చెప్తూండేవాడు.

కానీ అతడీనాడు మరణించాడు. ఆ పశువులపారం అతడి సంతానానికి సంక్రమించనూలేదు. అది ఈనాడు మిస్టర్. విక్సన్ ఆస్తి. స్పైకిల్స ఎస్టేటు మొదలుకొని బెన్నెట్ లోయ విభాగంవరకూ ఉన్న సానోమా పర్వతాలకు తూర్పు, ఉత్తర వాలుప్రదేశమంతా అతడి అధీనంలోనే ఉంది. ఆప్రదేశంలో అతడొక బ్రహ్మాండమైన మృగదావాన్ని ఏర్పాటుచేశాడు. కొన్ని వేలఎకరాలవరకూ, పచ్చికమైదానాలూ, ఏటవాలు ప్రదేశాలు,లోయలూ ఉన్నయ్. అక్కడ లేళ్ళు విశృంఖల విహారం చేస్తుంటై. ఆ భూములకు సంబంధించిన ప్రజలందర్నీ గెంటేశారు. అక్కణ్ణే స్థిరనివాసులుగా ఉండే అనాగరిక జనుల్నికూడా, లేళ్ళకు స్థలంకోసం, తరిమేశారు.

అన్నిటికన్నా తమాషా సంగతేమిటంటే నేను దాక్కొన్న ప్రదేశాన్నుంచి, విక్సన్ వేటగృహం ఒక రెండు ఫర్లాంగుల దూరంలోనే ఉంది. ఈ విషయం ప్రమాదానికన్నా, మరింత సురక్షితమే. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లల్లో, ఒకవ్యక్తి నీడలోనే మేం ఆశ్రియం కల్పించుకొన్నాం. అసలు పరిస్థితియొక్క స్వభావాన్నిబట్టె అనుమానం అనేది

ఆమడదూరానికి పోయింది. నాతో ఎర్నెస్టు కలుసుకొన్న తర్వాత, ఆయన కోసం నాకోసం, ఉక్కుపాదం గూఢచారులు వెతకుతుంటే, వాళ్ళకు కలలో గూడా తట్టని ప్రదేశమిది. ఇది మి. విక్సన్ తేళ్ళ ఉద్యానవనం.

ఆ ఎర్రి అరణ్యాల్లో, ఆ కుంటదగ్గర మాగుర్రాల్ని కట్టేశాం. శిథిలావస్థలో ఉన్న పెద్ద బోలుమొద్దుకు అవతలవైపుగా ఉన్న ఒక రహస్యపు ప్రదేశంనుంచి, 50 పౌన్ల పిండిబస్తా ఒకటి, డబ్బాల్లో నిలవచేసిన అన్ని రకాలైన ఆహార పదార్థాలు, వంటపాత్రలు, దుప్పట్లు, పెద్ద కాన్వాస్ పరజా ఒకటి, పుస్తకాలు, వ్రాత పరికరాలు, ఒక పెద్ద ఉత్తరాలబొత్తి, 5 గాలన్ల కిరసనాయిలు డబ్బా, ఆఖరికి చాలా ప్రధానమైన పెద్ద లావాటి మోకుతో సహా అనేక రకాలైన వస్తువుల్ని నా స్నేహితుడు తీసుకువచ్చాడు మేం తలదాచుకొనే చోటికి వాటిని పట్టుకు వెళ్ళాలంటే, అక్కడికీ ఇక్కడికీ పొద్దుగూకులూ తిరిగేటంత సామాను సప్లయిచేశాడు.

కానీ మా ఆశ్రయం చాలా దగ్గర్లోనే ఉంది. తాడు తీసుకొని, దారి చూపిస్తూ, అటూ ఇటూ బాటలుతిప్పి ఉన్న చెట్ల గుంపుల్లోనుంచి, తుప్పల్లోనుంచి ప్రయాణమైపోయాం. ఆ ఇరుకుదారి పోయిపోయి, ఒక ప్రవాహంయొక్క నిట్రంగా ఉన్న తీరందగ్గర కచ్చితంగా ఆగిపోయింది. అది ఊటలవల్ల ప్రవహించేచిన్నప్రవాహం. మంటలుమండే ఎండాకాలంలో కూడా ఆ ప్రవాహంలోని నీళ్ళు తీసిపోవు.

అది సంపూర్ణ సురక్షితమైన ఆశ్రయం. ఆఖరికి, 'గ్లెన్ఎలెన్' పల్లె పిల్లల్తోసహా, ఆచాయలకు ఒక్క వ్యక్తీ రాడు. ఈ సారంగమేగనక, కొండలోయ గర్భంలో, ఒకమైలో, లేక చాలామైళ్ళ పొడవో ఉన్నదైతే, అది అందరికీ తెలిసి ఉండేదే. కానీ ఇది లోయకాదు. ఆ ప్రవాహం పుట్టుకనుంచి ఆఖరయ్యేవరకూ ఉన్న పొడవు ఐదువందల గజాలకు మించదు. సారంగానికి మూడువందల గజాలకుపైన ఒక పచ్చికబయలు పాదందగ్గర, ఊటబావిలో

నుంచి ఈప్రవాహం పుట్టింది. సొరంగానికి క్రింద భాగంలో ఒకవంద గజాల వరకూ, ప్రధాన ప్రవాహాన్ని కలుపుతూ, పచ్చికబయళ్ళమీద జలజలా ప్రవహిస్తూ కొంచెం దేశంలోకి పరుగులు తీసింది.

నా స్నేహితుడు, ఆ మోకును చెట్టుకొక వరసచుట్టి, నన్ను రెండో చివర కట్టేసి, క్రిందకు దించాడు. కన్నుమూసి తెరిచేలోపల అడుక్కు చేరా. కొద్ది క్షణాల్లో, ఆ రహస్యపుస్టోర్సునుంచి సామానంతా పట్టుకు వచ్చేసి, కిందకు అందిచ్చాడు. మళ్ళీ మోకును పైకిగుంజుకొని, దాచిపెట్టాడు. అతడు నన్ను వదలివెళ్ళేప్పుడు, మందహాసవదనంతో నాదగ్గర శలవుతీసుకు వెళ్ళాడు. .

ఇక నేను నా పనికి ఉపక్రమించబోయేముందు, ఈ కామ్రేడ్ 'జాన్ కార్లసన్' ను గూర్చి ఒకటి రెండు ముక్కలు చెప్పాలనుకొంటున్నా. విప్లవోద్యమంలో, ఏ విధమైన, ఆడంబరం, బడాయికోరుతనంలేని వ్యక్తి. విప్లవ ఉన్నత సంస్థలోని అసంఖ్యాక విశ్వాసయుత సభ్యుల్లో ఒకడు. వేటగృహానికి సమీపంలోఉన్న కొట్టాల్లో, విక్సన్ నౌకరుగాపనిచేస్తున్నాడు. నిజానికి, సొనోమా పర్వతంమీద ప్రయాణంచేసింది మేము విక్సన్ గుర్రాల మీదనే. ఇప్పటికి యిరవై సంవత్సరాలనుంచీ 'జాన్ కార్లసన్' ఈ రహస్య ప్రదేశానికి అధిపతిగా ఉంటున్నాడు. ఇంతకాలం అతడి బుర్రలో అవిధేయత అన్న పదమే ప్రవేశించలేదని నేను గట్టిగా చెప్పగలను. తననునమ్మిన వాళ్లకు ద్రోహంచెయ్యడమనేది కలలోగూడా అతని మనస్సుకు తట్టని విషయం. అతడు చాలా మందబుద్ధి. ఎంత మూఢుడంటే, అతణ్ణి చూస్తే, అరే విప్లవానికీ ఇతడిబుర్రకీ సంబంధమేమిట్రా ? అని ఆశ్చర్యపడకపోం. ఐనప్పటికీ, అతడి అంధకారమయమైన ఆత్మలో ప్రేమ, స్వేచ్ఛాజ్యోతులు నిశ్చలంగా ప్రకాశిస్తున్నయ్. అతడు పెద్ద తెలివితేటలు గలవాడు కాకపోవడం, చపలబుద్ధి కాకపోవడం పైగా కొన్ని విషయాల్లో సుగుణమే.

అతడెప్పుడూ మతి తప్పి చరించలేదు. ఆజ్ఞల్ని శిరసావహించడమే - అతడి పని. అంతేకాని, ఆ ఆజ్ఞలో ఏముందో, ఎందుకుచేశారో, అని లేనిపోని పిచ్చిపిచ్చి ఆసక్తిచూపించేవాడుగాడు. అత డసలెట్లా విప్లవవాదిగామారాడో తెలుసుకోందామని, అతన్నే ప్రశ్నించా.

"నేను యువకుడిగా ఉన్నప్పుడు జర్మనీలో సిపాయిగా ఉండేవాణ్ణి. యువకులంతా ఆ దేశంలో సైన్యంలోచేరాల్సిందే. కాబట్టే నేనూ సైన్యంలో చేరా. అక్కడ మరో యువకుడైన సిపాయి ఉండేవాడు. వాళ్ల నాన్న, మీరు వ్యవహరించే ఆందోళన కారకుడు. చక్రవర్తిని గురించి నిజంచెప్పడం అని మీరంటారే, అందుకు రాజద్రోహంక్రింద అతణ్ణి జైల్లో బంధించారు. అతడి కొడుకైన ఈ యువకుడు, ప్రజల్ని గురించీ, పరిశ్రమనుగురించీ, పెట్టుబడిదారులు ప్రజల్ని దోచుకొనే విధానాన్నిగురించి నాతో చాలా చాలా మాట్లాడేవాడు. విషయాల్ని కొత్తవిధానంలోనుంచి చూసేటట్లు చేశాడు నన్ను. నేనిక సోషలిస్టునైనా. అతడు మాట్లాడిందంతా అక్షరాలా నిజం. మంచిదిగూడా. నేను దాన్ని ఎన్నడూ మరచిపోలేదు. నేను అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వచ్చినప్పుడు, సోషలిస్టులవెంటబడి తిరిగా. S. L. P. రోజున నేనొక శాఖలో సభ్యుణ్ణైనా. దాంట్లో కలతలు ఏర్పడ్డ తర్వాత స్థానికంగా ఉన్న S. P. లో చేరా. అప్పుడు నేను శాన్‌ఫ్రాన్సిస్కోలో బాడిగగుర్రాల శాలలో పని చేస్తుండేవాణ్ణి. భూకంపానికి ముందు సంగతి అది. ఇరవైరెండు సంవత్సరాలపాటు నేను చెల్లించాల్సిన మొత్తమంతా చెల్లించేశా. ఇప్పటికీ నేను సభ్యుణ్ణే. ఈ నాటికి నేను ఇవ్వవలసింది ఇస్తూనే ఉన్నా. కానీ, ఇప్పుడుమాత్రం రహస్యంగా చేస్తున్నా ఆ పని. ఎప్పటికీ నేను ఇవ్వాల్సినమొత్తం ఇస్తూనే ఉంటా. సహకార కామన్‌వెల్తు వస్తే, అప్పుడు బాగా సంతోషిస్తా" అని చెప్పాడు.

నన్నతడు వదిలివెళ్ళిన తర్వాత, ఆయిల్‌స్టౌమీద నా భోజనాన్ని

శుండుకోడానికి, నా యింటిని యేర్పాటుచేసుకోడానికి ఉపక్రమించా. చాలా ప్రొద్దున్నే గాని, సాయంకాలం చీకటిపడ్డ తర్వాతగాని, 'కార్లసన్' దొంగతనంగా తరచు అక్కడికివచ్చి, రెండుగంటలపాటు పనిచేస్తుండేవాడు. మొట్టమొదట నా ఇల్లు కాన్వాస్‌పరజా. తర్వాత ఒక చిన్న గుడారం లేపాం. ఇంకా కొంతకాలంపోయిన తర్వాత, ఇక ఇక్కడ ఏ విధమైన భయం లేదురా, అన్న నమ్మకం కుదిరిన వెంటనే, ఒక చిన్న ఇల్లే నిర్మించాం. పోతూపోతూ సొరంగం చివరనుంచి ఎవడైనా ఒకవేళ చూచినా అతడికి మా ఇల్లు ఏమాత్రం కనబడదు. మా ఆశ్రయంలో దట్టంగా పెరిగిన తరుగుల్మాదులు మాకు సహజ కవచంగా ఉపకరించినై. మా ఇల్లు నిటారుగా ఉన్న గోడకు కట్టుకొన్నాం. ఆ గోడలోనే, గట్టి కలపమొద్దులు పోటీపెట్టి, గాలీ వెలుతురూవచ్చే రెండు చిన్న గదుల్ని త్రవ్వాం. ఓ! నన్ను నమ్మండి. మాకు అక్కడ సమస్త సౌకర్యాలూ ఉన్నయ్. జర్మన్ టెర్రరిస్టు, 'బియెడన్‌బక్' కొంతకాలం తర్వాత మాతోబాటు దాక్కున్నప్పుడు, చలికాలపు రాత్రుల్లో కట్టెలు మండించి చలిగాచుకుంటూ కూర్చుంటానికి అవకాశం ఉండేటట్లు, పొగ పైకిపోకుండా ఉండేగకంగా ఒక చిన్న ఉపాయంకూడా చేశాడు.

మొత్తం విప్లవంలో, మరీ ఇంత అన్యాయంగా ఎవర్నీ అపార్థం చేసుకోని, ఈ సరళ హృదయుడైన టెర్రరిస్టు కామ్రేడును గూర్చి ఇక్కడ నేనొకమాట చెప్పాలి. కామ్రేడ్ 'బయెడన్‌బక్' ఆశయ విద్రోహుడు కాలేదు. కాక, అందరూ అనుకొంటున్నట్లుగా, అతణ్ణి, కామ్రేడ్స్ ఉరి తీయనూలేదు. ఈ అబద్ధ ప్రచారాన్ని సాగించిన వాళ్ళు అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్ల తొత్తులు. కామ్రేడ్ 'బయెడన్‌బక్' కొంచెం పరధ్యానం కలవాడు. జ్ఞాపకశక్తి తక్కువ. మా రహస్యపు గుర్తుల్ని మరచిపోయినందువల్ల, అతడు కార్మెల్ గుహలో దాక్కొన్నప్పుడు, మమ్మల్ని కాపలా

కాచే వాళ్ళల్లో ఒకడు కాల్చి చంపాడు. అది విషాదకరమైన ప్రమాదం. అతడు తన యుద్ధసంఘ విశ్రాంతి పొందనాడన్నది శుద్ధ అబద్ధం. ఆశయంకోసం, అతడికన్నా నిజమైనవాడూ, విధేయతకలవాడూ ఎవడూ కృషి చేయలేదు.

నేను ఎన్నుకొన్న ఆశ్రయాన్ని, ఇప్పటికి పందొమ్మిది సంవత్సరాల నుంచీ నిరంతరంగా ఎవళ్ళో ఒకళ్ళువచ్చి ఆక్రమించుకొంటూనే ఉన్నారు. ఒక్కసారితప్ప, ఇంతకాలంలోనూ దీన్ని కనుక్కొన్న పరాయివాడెవడూ లేడు. ఐనా అది, విక్సన్ వేట విశ్రాంతిగృహానికి రెండు ఫర్లాంగులదూరం లోనూ, 'గ్లెన్ ఎలెన్' గ్రామానికి ఒక మైలులోపు దూరంలోనే ఉంది. ప్రొద్దుటా, సాయంకాలం, వచ్చిపోయే రైళ్ళధ్వని నాకు శుభ్రంగా వినపడు తూనే ఉండేది. మిలుకూతనుబట్టి నాగడియారం టైం సరిదిద్దుకుంటుండేదాన్ని.

## ౧౯

"మళ్ళీ నిన్ను నీవు మరోరకంగా చేసుకోవాలి. ఇప్పుడున్న నీవు ఇకముందు నీవుగా ఉండరాదు నీవు మరో స్త్రీవి కావాలి. నీవు ధరించేగుడ్డల వల్లనేగాదు, గుడ్డల్లోఉన్న నీ శరీరం లోపలిభాగంలోనే మరో మహిళవు కావాలి. నేను నిన్ను తెలుసుకోలేనట్లుగా, అంటే, నీ స్వరం, నీ కవళికలు నీ అలవాట్లు, నీ అంగాంగచలనం, నీ నడక, ప్రతివిషయమూ నేను తెలుసుకో లేనట్లుగా నీవు మళ్ళీ మరో నీవు కావాలి." అని ఎర్నెస్టు నాకు ఉత్తరం వ్రాశాడు.

ఈ ఆజ్ఞను నేను శిరసావహించా. శాశ్వతంగా, ఈ పాత ఎవిస్ ఎవర్‌హార్డును మరో స్త్రీయొక్క శరీరంక్రింద, అంటే నా యొక్క మరో రూపంక్రింద అణచిపెట్టేసేందుకు, రోజూ గంటలతరబడీ అభ్యాసం చేశా. చిరకాల అభ్యాసంవల్లనే అటువంటి ఫలితాలు కలగటానికి అవకాశం ఉంది. నా కొత్త కంఠస్వరం ప్రయత్నంలేకుండానే దానంతటదే స్థిరపడిపోయేదాకా

కృత్రిమమైన, ప్రయత్నపూర్వకమైన కృషి చాలాకాలం చేశా. ప్రయత్న సహితంగా కొత్తపాత్రను ధరించగలగడాన్నే ఆత్మసంయమనశక్తి అంటారు. తనను తానే మోసగించుకోవాలంటే, ఆ వ్యక్తి చాలా నిపుణుడై ఉండాలి. అదెట్లా ఉంటుందంటే, కొత్తభాషను; అంటే ప్రస్తుతానికి 'ఫ్రెంచి'భాషను ఉదాహరణకు తీసుకొందాం; నేర్చుకొన్నట్లుంటుంది. మొదట ఫ్రెంచి భాషలో మాట్లాడటమంటే, మన చైతన్యానికి తెలిసి, మనం ఇచ్ఛాపూర్వకంగా మాట్లాడుతాం. విద్యార్థి తాను మాట్లాడేముందు ఇంగ్లీషులో ఆలోచించి, తర్వాత దాన్ని ఫ్రెంచిలో పెడ్తాడు. అట్లానే చదివినదాన్ని అర్థం చేసుకొనేపూర్వం చదవడమైతే ఫ్రెంచి చదివినా, ఇంగ్లీషులోకి మార్చుకొంటాడు. కొంతకాలం గడచిన పిమ్మట అతడికి కొత్తభాషలో బాగా పట్టు చిక్కి, ఇంగ్లీషుసంగతి ఆలోచించకుండానే, ఎకాఎకి ఫ్రెంచిలోనే చదువుతాడు, వ్రాస్తాడు, ఆలోచిస్తాడు.

మా మారురూపాల విషయంకూడా అంతే. మేం అనుకొన్న స్వరూపాలు యథార్థమయ్యేంతవరకూ, మా అసలు స్వరూపాలమీద జాగ్రత్తతో కూడిన ఆత్మస్వేచ్ఛను గట్టిగా ఉపయోగించేంతవరకూ, అభ్యాసం చేయాల్సిన అవసరముంది. మొదటగా, చాలా తప్పుల్తోకూడిన పరిశోధనగా ఉంటుంది. మేం కొత్తకళను సృష్టిస్తున్నాం. మేం కనుక్కోవాల్సింది ఇంకా చాలా ఉంది. కానీ ప్రతిచోటా ఈ కృషి జరిగిపోతోంది. ఈ కళలో మొనగాళ్ళు అభివృద్ధి చెందుతున్నారు. బోలెడన్ని జిత్తులు, ఆవశ్యకమైనవన్నీ సమకూర్చుకొంటున్నాం. ఈ మా నిధి అంతా ఒకరకమైన పాఠ్య గ్రంథంగా తయారై విప్లవ పాఠశాలల్లో బోధించవలసిన ప్రణాళికలో ఒకటిగా ఉపయుక్తమౌతోంది.

ఈ సమయంలోనే మా నాన్న అంతర్థానమైపోయాడు. ఆయన దగ్గర్నుంచి నాకు సక్రమంగా రావాల్సిన ఉత్తరాలు ఆగిపోయినై. ఆయన

మా వెల్ వీధి నివాసప్రాంతంలో ఉండటంలేదు. ఆయనకోసం మా కామ్రేడ్స్ అన్నిచోట్లా గాలించారు. మా రహస్యపుశాఖ దేశంలోఉన్న ప్రతి జైలునూ పరిశోధించింది. ఒక్కసారిగా ఆయన్ను భూమాత కబళించిందా అన్నట్లుగా ఉన్నట్లుండి మాయమైనాడు. మరి ఈనాటి వరకూ ఆయన అంతిమదశకు సంబంధించిన చిక్కుముడి విడనేలేదు.

ఆర్నెల్లపాటు నేను ఈ ఆశ్రయంలో ఏకాంత నివాసం చేశా. కానీ, ఆ ఆరునెలలూ గోళ్ళు గిల్లుకుంటూ వ్యర్థకాలక్షేపం చేసిన సమయంగాదు. మా సంస్థ చాలా అభివృద్ధి చెందింది. మేం చేయాల్సిన పనులు కొండలుగా పేరుకొనే ఉండేది. ఎర్నెస్టూ, ఆయనతోపాటు పనిచేసే నాయకులూ, జైళ్ళల్లో ఉండి, ఏంచెయ్యాలో నిర్ధారించారు. బైటఉన్న మేం దాన్నంతా చేయాల్సిన బాధ్యతఉంది. ఒక వ్యక్తినుంచి మరోవ్యక్తికి, వాగ్రూపంలో ప్రచారంచేసే సంస్థ ఒకటుంది. ఈ సంస్థ, మా గూఢచారి విధానం, రహస్య ముద్రణ యంత్రస్థాపన, లక్షోపలక్షలుగా ఉన్న మా రహస్య స్థావరాలన్నింటినీ అల్లుకొనిపోయిన భూగర్భరైల్వే నిర్మాణం, దేశమంతటా మేం నిర్మించిపోయిన గొలుసులకు ఎక్కడైతే అతుకులు ఊడిపోయినవో అక్కడ కొత్త ఆశ్రయాల్ని ఏర్పాటుచేయడం, మొదలైన తన వివిధ శాఖల్తోటీ పనిచేయాలి.

అందుకే, ఈపని ఎన్నడూ జరగలేదని నేను చెప్పడం. ఆర్నెల్ల అనంతరం, ఇద్దరు కామ్రేడ్స్ రాకతో, నా ఒంటరితనంకాస్తా ఊరేగిపోయింది. వాళ్ళిద్దరూ యువతీమణులు. ధైర్యసాహసాలుగలవాళ్ళు. స్వేచ్ఛను మహాగాఢంగా ప్రేమించేవాళ్లు. అందులో ఒకామె, 1922 లో అంతర్ధానం చెందిన 'లూరా పెటర్సన్'. రెండోఆమె 'కబెబియర్సు'. ఈమె తర్వాత 'డుబోయ్' ను వివాహమాడింది. నూతనభవిష్యత్ భాస్కరోదయంకోసం ఎదురు చూస్తూ ఈనాటికీ మాతోనే ఉంది.

ఈ ఇద్దరుయువతులూ చాలా తత్తరపాటుతో, అపాయంతో, మృత్యుగహ్వరం మధ్యలోనుంచి ఊడిపడ్డారు. చేపలుపట్టే బోటులోఉన్న జన

సమూహంలో, వీళ్ళను 'శాన్‌పాబ్లో' అఘాతంనుంచి దాటేసినవ్యక్తి గూఢచారి. ఉక్కుపాదం బడితొత్తైన అతడు, విప్లవగూఢచారిగా మస్కావేసి, మా సంస్థలోఉన్న రహస్యపులోతుల్లోకి వెళ్ళిపోయాడు. నిస్సందేహంగా అతడు నన్ను పసిపట్టడానికే పాకులాడుతున్నాడు. ఎందుకంటే, నా అంతర్ధానం, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ రహస్య శాఖకు, అత్యవసరంగా తెలుసుకోవాల్సిన సంఘటన అయిందని మాకింతకుముందే తెలుసు. అదృష్టవశాత్తూ, అతడు కనుక్కొన్న విషయాలేవీ ఇతర్లకెవరికీచెప్పలేదు, అని తర్వాత ఫలితాన్నిబట్టి రుజువైంది. నన్నూ, నేను దాక్కొన్న రహస్యస్థలాన్నీ కూడా కనుక్కొని, విజయం సాధించామురా; అనే నిర్ణయం చేసుకొనేంత వరకూ, తనకు యిప్పటివరకూ తెలిసిన విషయాలు పై అధికారులకు తెలియజేయకుండా ఉండడానికే అతడు నిశ్చయించుకున్నాడు. అతడు సేకరించిన సమాచారం అతడితోనే మటుమాయమైంది. ఈఇద్దరు యువతులూ 'పెటలు మాక్రీక్' లో దిగి గుర్రాలదగ్గరకు తీసుకురాబడేటప్పటికి ఏదోవంక పెట్టుకొని, అతడు బోటునుంచే తప్పించుకుపోగల్గాడు.

సొనోమా పర్వతంమీద మార్గంచీలేంతవరకూ, కార్లసన్ తన గుర్రాన్ని ముందు నడిపిస్తూ ఆ యువతుల్ని ముందుకుపోనిచ్చాడు. తాను మళ్ళీ కాలినడకన వెనక్కిపోయాడు. అతడికి అనుమానాలు బయలుదేరినై. అతడు గూఢచారిని పట్టుకొన్నాడు. ఆ తర్వాత ఏం జరిగిందో 'కార్లసనే' స్వయంగా ఒకమంచి చిత్రణ ఇచ్చాడు.

"అతడిమీద నిఘాఉంచా" అని జరిగిన సంగతిని ఏవిధమైన కల్పన లేకుండా అతడు వర్ణించినవిధానం. "అతడిమీద నిఘాఉంచా." అన్నాడు మళ్ళీ. అప్పుడతని కళ్ళల్లో నిప్పులు కురుస్తున్నయ్. అతి పరిశ్రమలో వంకర్లు తిరిగిన పెద్ద చేతుల్ని వెంటవెంటనే తెరుస్తూ ముడుస్తున్నాడు. "అతడు కుయ్ కయ్ మనలేదు. అతణ్ణి దాచేశాను. ఈ రాత్రికిపోయి అతణ్ణి లోతుగా గోతిలో పూడుస్తా."

ఆ కాలంలో నా మారు రూపాలను నేనే ఆశ్చర్యపడేదాన్ని. కాలేజి నగరంలో ఎప్పుడైనా ప్రశాంతంగా జీవించానా లేక హింసా దృశ్యాలకూ, మరణానికీ అలవాటుపడ్డ విప్లవవాదినిగా జీవిస్తున్నానా అని కొన్ని సమయాల్లో నా మటుకు నాకే అసాధ్యంగా తోచేది. ఈ రెండిట్లో ఒకటి జరగడానికి వీల్లేదు, ఒకటి సత్యం. మరొకటి స్వప్నం. కానీ ఏది నిజం? ఏది కల? సారంగంలో దాక్కొన్న ఈ ప్రస్తుత విప్లవవాదిని పరిస్థితి పీడకలా? లేక, పూర్వ జీవితంలో, బర్కిలో నివసించి, టీపార్టీలు, నృత్యాలూ, చర్చా సంఘాలూ, ఉపన్యాస గృహాలూ, వీటికన్నా మరో తీవ్రమైన కృషిలేదని ఎక్కడో, ఎట్లాగో కలలుగన్న విప్లవవాదినిగా ఉండడమా? కానీ, సర్వ మానవ సౌభ్రాతృతా చిహ్నమైన అరుణపతాకచ్ఛాయల్లో పరిక్రమిస్తున్న మా అందరి అనుభవాలూ సామాన్యంగా ఇటువంటివేనని అనుకొన్నా.

ఆ మరో జీవితానికి సంబంధించిన వ్యక్తులు నాకు తరచు గుర్తుకు వస్తుండేవాళ్ళు. ఈ నా నవ్యజీవితంలో, ఆ వ్యక్తులు చిత్రంగా అప్పుడప్పుడూ దర్శనమిస్తూ, అదృశ్యమౌతుండేవాళ్ళు. బిషప్ మూర్‌హౌస్ ఒకాయన. మా సంస్థ బాగా అభివృద్ధి చెందినతర్వాత, ఆయనకోసం గాలించాం కానీ ఫలితం శూన్యమైంది. ఒక పిచ్చాస్పత్రినుంచి మరో పిచ్చాస్పత్రికి క్రమ క్రమంగా ఆయన్ను తరలించారు. 'నాపా ప్రభుత్వ ఉన్మాద చికిత్సాలయంలో, అక్కణ్ణుంచి స్టాక్టన్ పిచ్చాస్పత్రిలో, అక్కణ్ణుంచి సాంటాక్లారా లోయలో ఉన్న ఎగ్న్యూస్ పిచ్చాస్పత్రిలోకి మారడంవరకూ మాకు తెలుసు. ఇక అక్కణ్ణుంచి ఆయనజాడ తెలియలేదు. ఆయన మరణించినట్లు రికార్డు లేదు. ఏదోరకంగా ఆయన తప్పించుకొని ఉంటాడు. చికాగో కమ్యూన్‌లో చెలరేగిన హత్యా జంఝామారుతంలో మహావేగంతో పరిక్రమిస్తున్న దృశ్యాల్లో, ఆ భయంకరవిధానంలో మళ్ళీ ఒక్కసారి ఆయన్ను చూస్తానని కలలోగూడా అనుకోలేదు.

ఉక్కుపాదం.

మరొక వ్యక్తి, సియెర్రా మిల్స్‌లో చేతిని పోగొట్టుకొని, నేను విప్లవ వాదినిగా మారడానికి కారణభూతుడైన జాక్‌సన్. అతణ్ణి మళ్ళీ చూడలేదు. కానీ, అతడు చావబోయేముందు చేసినపని మాకందరికీ తెలుసు. అతడెన్నడూ విప్లవవాదుల్లో చేరలేదు. తన దురదృష్టానికి మరీ చేదైన జీవితంతో, తనకు సంభవించిన అధర్మాన్నే మాటిమాటికీ తలపోసుకుంటూ, అతడొక అరాచకవాదిగా మారాడు. అతడేమీ వైదాంతిక అరాచకవాది కాడు. విద్వేషంతో పిచ్చెక్కి, కసి తీర్చుకొందామనే ఉసిగొల్పే మృగప్రాయమైన అరాచకవాది. ఐతే, అతడు తనకున్న కసి బాగా తీర్చుకొన్నాడు. రాత్రిపూట అందరూ బాగా నిద్రపోతుండగా, కాపలాదారుల కళ్ళల్లో దుమ్ముకొట్టి, పెర్రిన్‌వైత్ సుందర ప్రాసాదాన్ని, అణువులణువులుగా ఆకాశంలోకి ఉప్పున ఎగరగొట్టేశాడు. కాపలాదారుల్తోసహా ఒక్కజీవి మృత్యువువాత పడకుండా తప్పించుకోలేదు. విచారణకాలంలో, జైల్లో, అతడు తన పక్క దుప్పటి ఊపిరాడకుండా మొగానికి చుట్టేసుకొని చచ్చాడు.

డాక్టర్. హామర్‌ఫీల్డు, డాక్టర్. బాలింగ్‌ఫోర్డుల అదృష్టాలుమాత్రం జాక్‌సన్ అదృష్టాలకు విభిన్నమైనవి. వాళ్ళు తాము ఎవరిఉప్పు తిని బ్రతుకుతున్నారో, వాళ్ళపట్ల విశ్వాసయుతంగానే ఉన్నారు. అందుకనే వాళ్ళకు దేవేంద్ర భవనాల్లాంటి చర్చిప్రాసాదాలు దక్కినై. వాళ్ళు దాంట్లో కాలు మీద కాలేసుకొని రాజెవరిబిడ్డరా! అన్నట్లు ప్రశాంత కాలక్షేపం చేస్తున్నారు. ఉభయులూ అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి క్షంతవ్యులే. ఇద్దరూ బాగా కొవ్వెక్కారు. "తన ఆధ్యాత్మిక వాదాన్ని, ఉక్కుపాదానికి భగవంతుడి అనుగ్రహం లభించేటట్లుగా మలచడంలో, ఎక్కువ సౌందర్యారాధన చేర్చడంలో, హెకెల్ వర్ణించిన అదృశ్య అంతరాత్మలస్థాయికి దిగజార్చడంలోనూ, డా॥ హామర్‌ఫీల్డు కృతకృత్యుడైనాడు. డా॥ హామర్‌ఫీల్డుకూ, డా॥ బాలింగ్‌ఫోర్డుకూ ఉన్న భేదమల్లా ఒకటే. డా॥ బాలింగ్

ఫోర్డు అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ దైవానికి ఇంకొంచెం నిరాకారత్వం ప్రసాదించి, సాకారాన్ని సగానికి తగ్గించాడు.'' అని ఒకసారి ఎర్నెస్టు, వీళ్ళిద్దర్నీ గురించి చెప్పాడు.

నేను జాక్‌సన్ కేసును విచారణజరిపే సందర్భంలో సియెరా మిల్సులో కలుసుకొన్న, ప్రధానమైన ఫోర్మన్, పీటర్ డాన్నెలి, విషయమే మాకందరికీ ఆశ్చర్యం కలిగించింది. 1918 వ సంవత్సరంలో నేను 'ఫ్రిస్కో-రెడ్స్' సమావేశానికి హాజరైనా. మాయుద్ధ సంఘాలన్నిట్లోకీ ఇది అత్యంత కష్టమైన, మహా భయంకరమైన, నిర్దాక్షిణ్యతమమైన సంస్థ. అది నిజంగా మాసంస్థలోని విభాగంకాదు. దాని సభ్యులు, ఆలోచనా రహితమైన దృఢ నమ్మకంగల వాళ్ళు. పిచ్చివాళ్ళు. అటువంటి ఉత్సాహాన్ని ప్రోత్సహించడానికి మేం భయపడ్డాం. ఇదిగాక, వాళ్ళు మాకుసంబంధించినవాళ్ళు కాకపోయినప్పటికీ, మేం వాళ్ళతో సుహృద్భావంతోనే ఉన్నాం. ఆరోజురాత్రి నేనొక అత్యంత ప్రధాన విషయంవల్ల అక్కడికి వచ్చా. అక్కడ సమావేశమైన ఇరవైమంది లోనూ, నేనొక్కదాన్నే ముఖాచ్ఛాదన లేకుండా ఉన్నదాన్ని. నేనక్కడకు వచ్చిన విషయసమాలోచన ముగిసిన తర్వాత, వాళ్ళల్లో నన్నొకడు తీసుకు వెళ్ళాడు. చీకటిగా ఉన్న మార్గంలో, ఈ మార్గదర్శి, ఒక నిప్పుపుల్ల వెలిగించి, దాన్ని తన మొగానికి దగ్గరగా పట్టుకొని, తన ముసుగును తొలిగించాడు. ఒక్క క్షణకాలం, క్రోధద్వేషపూర్ణ చిహ్నమైన పీటర్ డాన్నెలీ ముఖాన్ని శ్రద్ధతో పరికించా. ఇంతలోకే నిప్పుపుల్ల ఆరిపోయింది.

"నన్ను నీవు తెలుసుకోగలందుకే ఇదిచేశా. సూపరింటెండెంట్ 'డాల్స్' నీకు జ్ఞాపకమేనా?" అని అతడా చీకట్లో మాట్లాడాడు.

సియెరా మిల్సుకు సంబంధించిన గుంటనక్క మొగం సూపరింటెండెంటు గుర్తుకువచ్చి, ఆఁ అన్నట్లు తలూపా.

"మొట్టమొదట అతడి అంతుతేల్చా. ఆ తర్వాతనే 'రెడ్స్'లో చేరా.'' అని డాన్నెలీ సగర్వంగా మాట్లాడాడు.

“మరి, నీవిక్కడకు రావడం ఎట్లా సంభవించింది? నీ భార్యా బిడ్డలో?” అని ప్రశ్నించా.

“చచ్చారు. అందుకే. కాదు. వాళ్లకోసం కసిదీర్చుకొంటానికి కాదు. వాళ్లు వాళ్ల పక్కల్లో సులభంగా చచ్చారు. ఎప్పుడు చూచినా రోగాలేగా. వాళ్లు బతికున్నన్నాళ్లు నా చేతులు కట్టేశారు. ఇప్పుడు వాళ్లు వెళ్లిపోయిన తర్వాత, నాలో ఉన్న ఈ వెధవ మానవత్వంమీద కసిదీర్చుకొంటానికి వెంపర్లాడుతున్నా. నేనొకప్పుడు, ప్రధానమైన ఫోర్మన్ పీటర్ డాన్నెలీని. కానీ, ఈ రాత్రి, నేను, ‘ఫ్రిస్కో–రెడ్స్’లో 27వ సంఖ్యను. ఇకరా. నిన్ను దీన్ని దాటిస్తా” అని అతడు సమాధానం చెప్పాడు.

అతణ్ణి గురించి తర్వాత చాలా విన్నా. అందరూ చచ్చారు అని అతడు చెప్పినపుడు, అతడి మార్గంలో నిజమే చెప్పాడు. కానీ, అతడి సంతానంలో ‘టిమొతి’ ఒకడు బ్రతికేఉన్నాడు. కానీ అతడు డబ్బుకోసం గడ్డితిని ఉక్కు-పాదం సేవలో దిగినందున, వాణ్ణి అతడు చచ్చిన వాడికిందనే జమకట్టాడు. సంవత్సరానికి పన్నెండుమందిని చంపుతానని ‘ఫ్రిస్కో–రెడ్స్’ లోని ప్రతి సభ్యుడూ ప్రమాణస్వీకారం చేశాడు. ఆ ప్రకారం చేయలేకపోతే మరణమే శిక్ష. తాను వాగ్దానం చేసిన ప్రకారం ఆ సంఖ్యను పూర్తిచేయలేని ఒక సభ్యుడు ఆత్మహత్య చేసుకొన్నాడు. ఈ హత్యలు అల్లరి చిల్లరగా చేసేవి కావు. ఈ పిచ్చివాళ్లంతా అడపా దడపా కలుసుకొని, తమను వ్యతిరేకించిన సభ్యులమీదా, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వదాసులమీదా మూకవుమ్మడి తీర్పులిస్తుంటారు. ఆ తర్వాత తొంబగా వాళ్ళను చంపుతారు.

నిజానికి, ఆ రాత్రి నే నక్కడకు రావడానికి కారణం విచారణ సందర్భమే. స్థానికంగా ఉన్న ఉక్కు-పాదం రహస్యశాఖలో చాలా సంవత్సరాలపాటు విజయవంతంగా గుమాస్తాగిరి నిర్వహించిన మా కామ్రేడ్ ఒక ‘ప్రిస్కో–రెడ్స్’ నిషేధవ్యక్తుల్లో పడ్డాడు. అతణ్ణి విచారిస్తున్నారు. అతడైతే

హాజరుకాలేదనుకోండి! అతడిమీద తీర్పుచెప్పే వాళ్ళకు, అతడు మా మనుష్యుల్లో ఒకడు అన్న సంగతికూడా తెలియదనుకోండి! అతడిగుర్తుల్ని, విధేయతనూ నిర్ధారించడానికి నేను రాయబారం వెళ్ళా. అసలు ఆ సంగతి మాకెట్లా తెలిసిందా అని ఆశ్చర్యం కలగవచ్చు. సమాధానం తేలికే. మా రహస్య ప్రతినిధుల్లో ఒకడు 'ఫ్రిస్కో-రెడ్స్' లో సభ్యుడు. శత్రువుమీద కన్నేసి ఉంచినట్లే, మిత్రులమీదా ఒక కన్నువేసి ఉంచడం మాకు అవసరం. మా నిఘా నుంచి తప్పించుకుపోయేటంత అప్రధానులుకారు ఈ పిచ్చిగుంపుకూడా.

కానీ, మళ్లీ, పీటర్ డాన్నెలీ, అతడి కొడుకు విషయానికి వద్దాం. ఆ సంవత్సరం, ఉరితీయబడడానికి తన పాలబడ్డ గుంపులో, 'టిమొతిడాన్నెలీ' అనే వ్యక్తిని గుర్తించేంతవరకూ, డాన్నెలీ విషయం అంతా సక్రమంగా జరిగిపోయింది. రక్తసంబంధమైన మమకారం డాన్నెలీ హృదయంలో గట్టిగా తిష్టవేసింది. తన కొడుకును రక్షించడానికి, అతడు తన కామ్రేడ్స్‌కు ద్రోహంచేశాడు. ఈ విషయంలో పక్షపాతం చూపించి అతన్ని వదిలేశారు. కానీ ఒక డజనుమంది 'ఫ్రిస్కో-రెడ్స్'ను ఉరితీశారు. మొత్తం గుంపును నాశనం చేశారు. చావగా మగిలినవాళ్లు, ప్రతీకారంగా, విద్రోహంవల్ల తాను సంపాదించుకొన్న మరణాన్ని, డాన్నెలీకి ప్రసాదించారు.

టిమొతిడాన్నెలి మాత్రం ఎన్నాళ్లో జీవించలేదు. అతణ్ణి చంపుతాం అని 'ఫ్రిస్కో-రెడ్స్' ప్రతిజ్ఞచేశారు. అతణ్ణి రక్షించడానికి అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం అన్ని ప్రయత్నాలూచేసింది. దేశంలో ఒకభాగంనుంచి మరోభాగానికి అతణ్ణి బదిలీచేశారు. అతణ్ని పట్టుకోడానికి ప్రయత్నించి విఫలులై ముగ్గురు 'రెడ్స్' ప్రాణాలు కోల్పోయారు. ఆ ముఠాలో కేవలం మొగవాళ్లే ఉండేవాళ్లు. చివరికి, మా కామ్రేడ్స్‌లో ఒకరైన, అందుట్లోనూ, 'అన్నారాయల్‌స్టన్' అనే స్త్రీ సహాయాన్ని అర్థించారు. మా ఆంతరంగిక సంఘం ఆమెను నిషేధించింది. కానీ ఆమె బుద్ధికి ఎంతతోస్తే అంతే. క్రమ

శిక్షణకు లొంగదు. పైగా ప్రతిభావంతురాలు. ప్రేమార్హురాలు. మేం ఆమెను ఏవిధంగానూ క్రమశిక్షణలో ఉంచలేకపోయాం. ఆమెకు ఆమే ఒక తరగతి. సర్వసామాన్యమైన విప్లవవాదులు స్థాయితో ఆమె సరిపుచ్చుకు పోయేరకంగాదు.

ఆ పనిని నిర్వహించడానికి మేం అనుమతి నిరాకరించి నప్పటికీ, లెక్కచేయకుండా, ఆమె దానిని నిర్వహించింది. అన్నా రాయల్‌స్టన్ ఆకర్షణీయమైన వ్యక్తి. ఆమె చేయాల్సిందల్లా ఒక పురుషుణ్ణి వలలోవేసుకోవడం. మాయువక కామ్రేడ్సులో అనేకమంది హృదయాల్ని భగ్నం చేసింది. చాలామందిని వలలో వేసుకొంది. వాళ్ళ హృదయ తంత్రుల్ని పట్టుకొని, మా సంస్థలో ప్రవేశించింది. ఐనా పెళ్ళిచేసుకొంటానికి ఆమె సుతరాం ఇష్టపడలేదు. ఆమె పిల్లల్ని ఎక్కువగా ప్రేమించేది. కానీ, ఆమె తనకు సొంతకొడుకు, ఆశయంవల్ల సిద్ధిస్తాడని అనేది. ఆ ఆశయానికే ఆమె జీవితాన్ని అంకితం చేసింది.

టిమొతిడాన్నెలీని బుట్టలో వేసుకొనడం, అన్నా రాయల్‌స్టన్‌కు మంచినీళ్ళప్రాయం. ఆమె అంతరాత్మ ఏమీ ఆమెను బాధించలేదు. ఎందుకంటే, అదేసమయంలో, 'నాష్‌విల్లెహత్య' అన్నది జరిగింది. ఆ హత్యా సందర్భంలో, డొన్నెలీ నాయకత్వాన డబ్బుకోసం ఉక్కుపాదం పక్షాన పనిచేస్తున్నవాళ్ళు ఆ పట్టణంలో ఉన్న చేనేత పనివాళ్ళను ఎనిమిదివందల మందిని, నిజంగా హత్యచేశారు. కానీ ఆమె డాన్నెలీని చంపలేదు. ఆమె, అతణ్ణి, 'ఫ్రిస్కోరెడ్స్'కు ఖైదీగా అప్పగించింది. ఇది జరిగికూడా క్రిందటి సంవత్సరమే. ఇప్పుడామెను మరోపేరుతో పిలుస్తున్నాం. ప్రతిచోటా ఉన్న విప్లవవాదులంతా ఆమెను, 'అరుణకన్య' (Redvirgin) అని పిలుస్తారు.

నేను తర్వాత చెప్పాల్సిన మరో ఇద్దరు వ్యక్తులు ఉన్నారు. వాళ్ళు కర్నల్ ఇన్‌గ్రామ్, కర్నల్ వాన్ గిల్బర్టులు. కర్నల్ ఇన్‌గ్రామ్, అల్పసంఖ్యాక

నిరంకుశ ప్రభుత్వంలో 'ఇంతింతై... జర్మనీకి మంత్రి ఐనాడు. అతణ్ణి రెండు దేశాల ప్రజాసామాన్యం అత్యంతంగా ద్వేషించింది. ఉక్కుపాదానికి విశ్వ సనీయమైన అంతర్జాతీయ గూఢచారిణిగా అతణ్ణి బెర్లినులో కలుసుకొన్నా. అతడు నాకుస్వాగతమిచ్చి, కావలసినసాయమంతా చేశాడు. ఈ నాద్విపాత్రాభి నయంతో, కాకతాళీయంగా. విప్లవానికిసంబంధించిన కొన్ని ముఖ్యవిషయాల్ని సేకరించగలిగాననిచెప్పవచ్చు.

కర్నల్ వాన్‌గిల్బర్టు 'భౌ భౌ' వాన్ గిల్బర్టుగా ప్రసిద్ధికెక్కాడు. చికాగో కమ్యూన్ తదనంతరం కొత్త పారిభాషికపదాల్తో కూడుకొన్న న్యాయశాసనాన్ని సృష్టించడంలో ప్రముఖపాత్ర వహించాడు. కానీ దానికి పూర్వం, విచారణ న్యాయాధిపతిగా ఉన్నప్పుడు, అతణ్ని బాగా ద్వేషించిన ఒక వ్యక్తి ద్వారా, మరణశిక్ష లభించింది. అతణ్ని విచారించి, శిక్ష విధించిన వాళ్లల్లో నే నొకతెను. అన్నారాయల్‌స్టన్ ఈ ఉరిశిక్షను అమలు పరిచింది.

పూర్వజీవితానికి సంబంధించిన మరో వ్యక్తిరూపం నా స్మృతిపథంలో తొంగిచూస్తోందింకా. అతడు జాక్‌సన్ లాయరు. ఈ 'జోసఫ్‌హార్డ్'ను మళ్లీ కలుసుకొంటానని ఏ కోశానా ఊహించలేదు. అది విచిత్ర సమాగమం.

చికాగో కమ్యూన్ జరిగిన రెండు సంవత్సరాల తర్వాత చాలా రాత్రి వేళ, నేనూ, ఎర్నెస్టూ కలిసి, బెన్టన్‌హార్బర్ ఆశ్రయం చేరుకొన్నాం. చికాగోనుంచి అడ్డంగా ఉన్న సరస్సులో మ్యూనిచ్ వద్ద ఈ ఆశ్రయం ఉంది. ఒక గూఢచారియొక్క విచారణ పూర్తినిర్ణయం జరిగేసమయానికి సరిగ్గా వచ్చాం. మరణశిక్ష విధించారు. అతణ్ని తీసుకువెళ్లుతున్నారు కూడా. మేం దర్శించిన దృశ్యమది. మరుక్షణంలో, ఆ దౌర్భాగ్యుడు, తనను పట్టుకొన్నవాళ్ల బంధాలనుంచి ఒక్కఊపున తెంచుకొని నా పాదాలమీద కుప్పకూలాడు. కరుణించమని దేబిరిస్తూ అతడు తన రెండుచేతుల్తో నారెండు

కాళ్లూ గట్టిగా చుట్టేసుకొన్నాడు. అతడు తన బాధామయ వదనాన్ని నా వైపు తిప్పేటప్పటికి, అతణ్ని 'జోసఫ్‌హార్డ్' అని గుర్తించా. నేను చూచిన మహాభయంకర పరిస్థితుల్లోకల్లా, ఈ పిరికిపంద ప్రాణరక్షణార్థం దేబిరించిన పరిస్థితిలో మానసిక దౌర్బల్యాన్ని పొందినట్లుగా ఎన్నడూ పొందలేదు. అతడు ప్రాణంకోసం తాపత్రయపడ్తున్నాడు. అది కరుణార్ద్రమైన దృశ్యం. ఒక డజనుమంది కామ్రేడ్స్ పట్టిపీకినా, అతడు తన చేతుల్ని నా కాళ్లదగ్గర్నుంచి వదిలిపెట్టడానికి ఇష్టపడలేదు. చివరికి అతడు ఓయ్యో మొర్రో అని గోలపెడ్తున్నా పడేసి లాక్కుపోతుంటే, నేను నేలమీద మూర్ఛపోయా. ఒక పిరికిపంద జీవితానికి దేబిరించడం చూడడంకన్నా, వీరుడు ఉరికంబాన్ని కౌగలించుకోవడం చూడడమే చాలా సులభమైన విషయం.

## ౨౦

'ఏకక్రియాద్వ్యర్థకరీబభూవ' అన్నట్లు, నా పాతజీవితాన్ని గుర్తుచేసుకోవడంతో కొత్తజీవితగాధనుకూడా చాలావరకు చెప్పేశా. 1915వ సంవత్సరం ప్రవేశించేదాకా, మాకఉమ్మడిగా జైలువిముదల తటస్థపడనేలేదు. అది కొంచెం కష్టసాధ్యమైన విషయమే ఐనా, ఏ విధమైన అడ్డంకిలేకుండా నిర్వహించాం. అది మాకొక కీర్తిదాయకమైన పరాక్రమకృత్యమై మా కృషిలో అత్యంత ఉల్లాసాన్ని కలిగించింది. క్యూబా మొదల్కొని కాలిఫోర్నియా వరకూ, అన్ని కారాగారాల్లో, మిల్టరీ జైళ్లల్లో, కోటల్లో ఉన్న, మా ఏభై రెండుమంది కాంగ్రెసు సభ్యులకూ యాభై ఒక్కమందినీ, వీళ్లకు తోడు మూడువందల పైచిలుగ్గా ఉన్న తక్కిన నాయకుల్ని, ఒక్క రాత్రిలో విముక్తిచేశాం. ఇందులో మాకు ఒక్క విఘాతంకూడా కలగలేదు. వాళ్లంతా తప్పించుకోవడమేగాకుండా, వాళ్లకోసం ముందుగానే సిద్ధంచేసి ఉంచిన రహస్యాశ్రయాలకు లక్షణంగా చేరుకొన్నారు. మేం బైటికి తీసుకురాలేక

పోయిన కాంగ్రెసు సభ్యుడొక్కడూ 'ఆర్థర్ సింప్సన్' - ఆయన, జైలుఅధికారుల చిత్రహింసలవల్ల ఇంతకుముందే క్యూబనాస్‌లో మరణించాడు.

ఇక అక్కణ్ణుంచి జరిగిన పద్ధెనిమిది నెలలకాలమే ఎర్నెస్టుతో నేను నివసించిన, సుఖతమమైన దశ అనుకొంటూ. ఆ కాలంలో మేం ఒకళ్లను విడిచి ఒకళ్లమెన్నడూ లేం. మళ్ళీ మేం ప్రపంచంలోకి వచ్చి పడ్డతర్వాత ఉభయులం చాలగా విడిపోయాం. ఆ రాత్రి ఎర్నెస్టు ఆగమనంకోసం ఎంత తహతహతో ఎదురు చూశానో, అంత తహతహతోనే ఈ నాడు, విప్లవ మహాగ్ని జ్వాలా జాజ్జ్వల్యమైన రేపటి తిరుగుబాటుకోసం వేచిఉన్నా. ఎంతో కాలంనుంచీ ఆయన్ను నేను చూడనేలేదు. మా ప్రయత్నంలో ఏదైనా పొరపాటు జరిగిగాని, ఏమైనా విఘ్నం తటస్థించిగాని, బహుశా ఆయన విముక్తి కాకుండా ద్వీపంలోనే ఉండి పోవచ్చునేమో అనే ఊహ వచ్చేటప్పటికి, ఇంకేం చెప్పమంటారు, నాకు పిచ్చెక్కినంత పనైంది. గంటలు యుగాలుగా గడిచినై. ఉన్నదల్లా నేనొక్కతెనే. బియెడన్‌బక్, ఇంకా ఈ ఆశ్రయంలోనే ఉంటున్న ముగ్గురు యువకులూ, బైటికి వెళ్లిపోయి, బోలెడంత ఆయుధసామగ్రితో, దేనికైనా 'సై' అనే లెక్కలో కొండమీద ఉన్నారు. ఆ రాత్రి కామ్రేడ్స్ ఎవరూ లేకుండా, దేశంలో ఉన్న రహస్యాశ్రయాలన్నీ బోసిపోతూ ఉంటై అని భావించా.

తూర్పురేఖలు తెలతెలవారుతోన్న సమయంలోనే సరిగ్గా, కొండమీదనుంచి నాకు సంకేతధ్వని వినిపించింది. దానికి ప్రత్యుత్తరంకూడా ఇచ్చా. మసక మసక వెల్తుర్లో. మొట్టమొదటిసారిగా దిగివచ్చిన బియెడన్‌బక్‌ను కౌగిలించుకొన్నంత పనిచేశా. కానీ మరుక్షణంలో నేను ఎర్నెస్టు బాహుదండాల్లో బందీనైనా. నా స్వరూప స్వభావ స్థితి ఎంతగా మారిపోయిందంటే, ఆ క్షణంలో, పూర్వపు చిరునవ్వుల్తో, అలవాట్లతో, పదాల్తో, పలుకుబడితో ఉన్న ఎవిస్ ఎవర్ హార్డు కావడానికి, ఎంతో ప్రయత్నం చేస్తేకాని లాభం

లేదని గ్రహించా. భగీరథ ప్రయత్నం చేస్తేనే కాని నా పూర్వపు వ్యక్తిత్వాన్ని తీసుకురాలేకపోయా. అప్రయత్న స్వాధీన పరిస్థితికి వచ్చేటట్లుగా సృష్టించుకొన్న కొత్త వ్యక్తిత్వాన్ని, ఒక్క క్షణం కూడా ఏమరలేను.

ఆ చిన్న గదిలో, వెల్తుర్లో ఎర్నెస్టు మొగాన్ని నేనొక్కసారి చూచా. ఖైదులో ఉన్నందువల్ల వచ్చిన, పాలిపోయినతనం తప్ప, ఆయన్లో అంతగా చెప్పుకోదగ్గ మార్పేమీలేదు. ఆయన ఫక్తు నా పూర్వపు ప్రియభర్త. వీరుడు. ఇంకా ఆయన మొగంమీద సుఖాపేక్షరహిత రేఖలు కొంతవరకూ గోచరిస్తూనే ఉన్నయ్. కానీ ఆయన ఆ స్థితి బాగా నిభాయించుకోగలడు. ఎందుకంటే, ఆయన సంక్షోభ జీవిత లక్షణాలను, ఆదికొంత పవిత్రతనూ, ఉదాత్తతనూ ప్రసాదిస్తుంది. పూర్వంకన్నా ఆయన మరింత గంభీర హృదయుడు కావచ్చుకాని, ఆయన కళ్లలో ఇంకా మందహాసరేఖ కాపురం చేస్తూనే ఉంది. ఇదివరకటి కన్నా ఇరవైపౌన్లు బరువు తగ్గాడు. కానీ, అద్భుతమైన శారీరకస్థితిలోనే ఉన్నాడు. ఆయన ప్రవాసంలో ఉన్నన్ని నాళ్లూ శరీర వ్యాయామం తప్పకుండా చేశాడు. ఆయన కండరాలు ఇనుముతో సమానంగా ఉన్నయ్. నిజానికి, ఆయన జైల్లో ప్రవేశించే నాటికన్నా ఇప్పుడే ఇంకా మంచిస్థితి ఉన్నాడు. కొన్ని గంటలు గడిచిన తర్వాత గాని ఆయన దిండుమీద తలమోపలేదు. ఆయన్ను జోకొట్టి నిద్రబుచ్చా. కానీ నాకు మాత్రం నిద్రపట్టలేదు. నేను పరమసంతోషంలో ఉన్నా. జైలు బ్రద్దలు కొట్టినందువల్ల, గుర్రంమీద స్వారీచేసినందువల్లా వచ్చిన అలసట నాది కాదుగా మరి.

ఎర్నెస్టు నిద్రపోతుండగా, నా దుస్తుల్ని మార్చుకొన్నా. నా జుట్టును మరో రకంగా అలంకరించుకొన్నా. మళ్లీ అప్రయత్నసిద్ధమైన కొత్త 'నేను'గా తయారయ్యా. ఇకిప్పుడు, బియొడన్‌బక్, తక్కిన కామ్రేడులూ మేల్కొన్న తర్వాత, వాళ్ల సాయంతో నేనొక కుట్రపన్నా. అంతా

సిద్ధమైంది. ఎర్నెస్టు తలుపు తెరుచుకొని ప్రవేశించేటప్పటికల్లా, వంట ఇల్లుగా, భోజనశాలగాకూడా ఉపయోగించుకొంటున్న గుహలోని గదిలో మేం ఉన్నాం. ఆ సమయంలో బియొడెన్‌బక్ నన్ను 'మేరీ' అని సంబోధించాడు. నేను అతడివైపుతిరిగి సమాధానం చెప్పా. విప్లవంలో అంత పేరు ప్రతిష్టలు సంపాదించిన వీరుణ్ని, మొదటిసారి చూడటంతోటే, విద్రోహం చేయగల ఏ యువక కామ్రేడ్ ఐనా ఎంత విచిత్రకుతూహలంతో చూస్తాడో, నేనూ ఎర్నెస్టును అట్లా వీక్షించా. కానీ ఎర్నెస్టు చూపు నన్నులోగొని, తహతహతో గదంతా గిరుక్రన వెదికిచూచింది. మరుక్షణంలో నేను మేరి హోమ్సుగా పరిచయంచేయబడ్డా.

మోసాన్ని పూర్ణస్థాయికి తీసుకుపోవడానికి, మిగులు కంచం ఒకటి గూడా పెట్టాం. మేం భోజనాలకు కుర్చీలమీద కూర్చునేటప్పటికి, ఇంకో కుర్చీ ఖాళీగానే ఉంది. ఎర్నెస్టులో హెచ్చవుతోన్న తహతహనూ, కలవరపాటునూ గుర్తించిన నేను సంతోషంతో ఒక్కసారి పెద్దగా అరచేదాన్నే. ఆఖరికి ఆయన ఇక తమాయించుకోలేకపోయాడు.

"నా భార్య ఎక్కడుంది?" అని మొగాన్నే అడిగాడు.

"ఆమె, ఇంకా నిద్రపోతోంది." అన్నా.

అగ్నిపరీక్ష కాలం అది. కానీ నా కంఠస్వరం అపరిచితమైంది. అందులో ఆయనకు పరిచితధ్వని వినిపించలేదు. భోజనాలు జరుగుతున్నయ్. వీరారాధకుడు మాట్లాడేట్లుగా, నేను అమితోత్సాహంతో చాలా చాలా మాట్లాడా. ఆయన నా వీరుడన్నదిగూడా స్పష్టమేగా. వీరారాధనలో, ఉత్సాహంలో పూర్ణస్థాయికి వెళ్ళా. నా ఉద్దేశాన్ని ఆయన ఊహించకముందే, నా బాహులతల్ని ఆయన మెడకు మెలేసి, అధరాన్ని చుంబించా. ఆయన నన్ను బారెడు దూరానికి నెట్టేసి, భయాందోళనల్తో నిలువుగ్రుడ్లేసి చూచాడు. అక్కడున్న నల్గురూ, గుహ ప్రతిధ్వనించేట్లుగా నవ్వి, అభి

వందన పూర్వకంగా, ఉన్న చిదంబర రహస్యాన్ని వెల్లడించారు. మొట్ట మొదట సందేహించాడు. సూక్ష్మపరిశీలనచేసి సగం నమ్మాడు. తర్వాత తల అడ్డంగా తిప్పి ఆ కాస్తా నమ్మలేకేపోయాడు. నేను పాత ఎవిస్ ఎవర్‌హార్డును ఐ, ఆయనకూ, ఎవిస్ ఎవర్‌హార్డుకూ తప్ప మరో వ్యక్తికి తెలియని పరమ రహస్యాలు చెవులో ఊదేదాకా, నన్ను నిజంగా తన భార్యే అని అంగీక రించలేదు. పగలు చాలాసేపైన తర్వాత, నన్ను తన భుజపంజరంలోకి తీసుకొని, బహుపత్నీక ఉద్రేకాలు తనకు కలిగినవంటూ, నా మనస్సులో చాలా కలవరం బయలుదేరదీశాడు.

"నీవు నా ఎవిస్‌వి. నీవే మరొక స్త్రీవి గూడా. నీవు యిద్దరు స్త్రీలవు. మరందుకని, నీవు నా జనానావి. ఏవిధంగానైతే నేం, మన మిప్పుడు సురక్షితంగా ఉన్నాం. అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో మన ఉనికి దుర్భర మైతే, ఇంకెందుకూ, నాకు టర్కీలో పౌరసత్వం లభించింది" అన్నాడు.

ఈ ఆశ్రయంలో నా జీవితం మహదానందకరంగా ఉంది. మేం గంటల తరబడీ పరిశ్రమించామన్నది నిజమే. ఐతే ఏం; ఉభయులం కలసి పరిశ్రమించాం. మేం ఒకళ్ళకొకళ్ళంగా అమూల్యమైన పద్ధెనిమిదిమాసాల కాలం ఉన్నాం. మేం ఇద్దరమే కాదు ఉంది. ఎందుకంటే, అక్కడికి ఎప్పుడూ మా నాయకులు, కామ్రేడ్స్ వచ్చిపోతుండేవాళ్ళు. మా యుద్ధ శాఖలనుంచి చిత్రవిచిత్రమైన పోరాటగాథల్నీ, యుద్ధగాథల్నీ తీసుకువచ్చే, రహస్య వ్యూహాలకూ, విప్లవానికి సంబంధించిన రహస్యజీవితాన్ని గడుపు తోన్న కొత్తగొంతులు వినిపిస్తుండేవి. మేం ఆపామాషీరకపు కుట్రదారులం కాదు. బాగా కష్టించాం. ఎక్కువగా బాధలను అనుభవించాం. మా ఉన్నత సంస్థల్లో ఏర్పడ్డఖాళీలు భర్తీచేశాం. పురోగమించాం. కృషిద్వారా, జీవన్మరణ క్రీడలద్వారా సంతోషంతో నవ్వడానికి, ప్రేమించడానికి మాకు సమయంలభించింది. మాలో, కళాకారులూ, శాస్త్రవేత్తలూ, కొమ్ములుతిరిగిన

ఉద్దండ పండితులూ, గంధర్వగాయకులూ, కవిసార్వభౌములూ ఉండేవాళ్లు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతుల అత్యద్భుతనగరాల్లో, ప్రాసాదాల్లో ఉన్నదానికన్నా, ఆ భూసొరంగంలో, ఉదాత్తమైన, లలితమైన సంస్కృతి ఉండేది. ఆ ప్రాసాదాల్నే, ఆ మహానగరాల్నే, అందచందాలు ఉట్టిపడేటట్లుగా చేస్తూ, నిజానికి పరిశ్రమించింది మా కామ్రేడ్సే.

అదీగాక, మేం సర్వకాల సర్వావస్థలందూ గుహ నేపట్టుకొని ఊగులాడేవాళ్ళం కాదు. శరీర వ్యాయామంకోసం, రాత్రిళ్ళు తరచుగా కొండ మీద గుర్రపుస్వారీ చేస్తుండేవాళ్ళం. మేం స్వారిచేసిన గుర్రాలు విక్సన్‌వే. అతడి గుర్రాలు, ఎంతమంది విప్లవవాదుల్ని మోసినవో అతడికే తెలిసుంటేనా అబ్బా! మాకు తెలిసిన ఏకాంత ప్రదేశాలకు వనసంతర్పణ విహారాలకుకూడా పోయేవాళ్ళం. తెల్లవారుజామున బయలుదేరి వెళ్ళి, చీకటిపడ్డ తర్వాత తిరిగి వస్తుండేవాళ్ళం. విక్సన్ ఆవుల మీగడా, వెన్నా ఉపయోగిస్తుండేవాళ్ళంకూడా. విక్సన్‌కు సంబంధించిన, పరిగపిట్టల్నీ, కుందేళ్ళనూ, అడపాదడపా అతడి బాతుల్నీ ఎర్నెస్టు సర్వసులభంగా కాలుస్తుండేవాడు.

అదొక సురక్షితమైన ఆశ్రయం. దాన్ని ఒక్కసారే కనుక్కొన్నారని ఇదివరకు చెప్పా. ఈ సంఘటన, యువక విక్సన్ అంతర్ధానం కావడంలోగల అద్భుతాన్ని స్పష్టంచేస్తుంది. ఇప్పుడతడు చచ్చిపోయాడు కాబట్టి, నేను స్వేచ్ఛగా మాట్లాడవచ్చు. సొరంగానికి కిందభాగంలో ఒక ఇరుకుమార్గం ఉంది. అక్కణ్ణుంచి సూర్యకాంతి చాలాగంటలు ప్రసరిస్తుంటుంది. పైనుంచి అది ఎవళ్ళకూ కనబడదు. క్రీక్ జలప్రవాహగర్భంనుంచి,ఇక్కడికి మేం చాలా తట్టలు కంకర మోసుకువచ్చి, చిత్తడిచిత్తడిగా లేకుండా ఉండడానికి, గొందినంతా పరచేశాం. సూర్యరశ్మిలో ఇక్కడ కొంచెంసేపు కాలక్షేపం చేయడానికి అనువుగా తయారుచేశాం. ఇక్కడ, ఒకసాయంకాలం, విప్లవ రచయిత, అద్భుత ప్రతిభావంతుడైన 'మెన్‌డెన్‌హాల్' గ్రంథ సంపుటాన్ని చదు

వుతూ ప్రొగన్ను పెట్టా. రక్తాన్ని తుకతుకలాడించే అతడి పద్యం కూడా నన్ను కదిలించలేని, సుఖస్థితిలో సురక్షితంగా ఉన్నా.

ఒక మట్టిపెళ్ళవచ్చి నా కాలికి కొట్టుకోవడంతో నేను లేచా. అప్పుడు, నా కు పైభాగంలో ఎవరో కుప్పించి దూకుతున్నట్లు శబ్దం వినిపించింది. మరుక్షణంలో, పడిపోతోన్న గోడమీదనుంచి, ఒక యువకుడు నాపాద సమీపంలో ఊడిపడ్డాడు. అతడు 'ఫిలిప్ విక్సన్' అప్పటికిమాత్రం అతడెవరో నాకు తెలియదు. అతడు నావైపు చాలా నెమ్మదిగా చూచి ఆశ్చర్యంతో ఒకచిన్న ఈల వేశాడు.

"మంచిది. నన్ను క్షమించండి. ఇక్కడెవరైనా ఉంటారని అనుకోలేదు." అని, టోపీ తీసి, చేతిలోపట్టుకొని, మరుక్షణంలోనే మాట్లాడాడు.

నేను మాత్రం అతడున్నంత ప్రశాంత పరిస్థితిలో లేను. నిరాశా పరిస్థితుల్లో ఎట్లా ప్రవర్తించాలా అనేది తెలుసుకొనే విషయంలోమటుకు నేనింకా అనుభవశూన్యురాలినే. ఆ తర్వాత, నేను అంతర్జాతీయగూఢచారిణినైనప్పుడు, ఇంతకన్నా కొంచెం నయంగానే ఉండేదాన్నని ఘట్టిగా చెప్పగలను. ఒక్కసారి ఎగిరిగంతేసినిలబడి, ప్రమాద సంకేతం చేశా.

నా వైపు పరీక్షగా చూస్తూ, "నీ వది యెందుకు చేశావ్ ?" అని ప్రశ్నించాడు.

అతడిక్కడికి దిగివచ్చేటప్పుడు, మేం ఇక్కడున్నామన్న అనుమానం అతడికి లేదని రుజువైంది. ఈ విషయాన్ని గ్రహించినతర్వాత గుండెబరువు తగ్గిపోయింది.

"నే నది ఎందుకు చేశాననుకుంటున్నావ్?" అని తిరుగుప్రశ్న వేశా. ఆరోజుల్లో నేను కొంచెం గణింతాల తరగతిలోనే ఉన్నా.

తల తిప్పుతూ, "నాకు తెలియదు. ఈ చుట్టుప్రక్కల నీ స్నేహితులెవరో ఉండి ఉంటారు. ఏమైతేనేంగానీ, నీవు సంజాయిషీ చెప్పుకోవాల్సిన

అవసరం ఉంది. అది ఎందుకైతే నా కేంబట్టిందిగనుక. నీవు మేర తప్పి ఇతర్ల భూభాగంలోకి ప్రవేశిస్తున్నావ్. ఇది మా నాన్నగారి భూమి.మరి–''

సరిగ్గా ఈ మాట అంటుండగానే, విధేయుడూ, సరళహృదయుడూ ఐన బియెడన్‌బక్, అతడి వెనక తట్టునుంచి, మెల్లగా, ''చిన్నదొరవారూ! చేతులెత్తండి'' అన్నాడు. ఛోటా విక్సన్ మొదట చేతులెత్తి, తనమీద ఆటోమెటిక్ తుపాకిని గురిపెట్టిన బియెడన్‌బక్ వైపుకు ఎదురుమళ్ళగా తిరిగాడు. విక్సన్ ఏమీ తొణకలేదు.

''ఓహో! విప్లవవాదుల గూడన్నమాట – కందిరీగలతుట్టె మాదిరిగా ఉందే. మంచిది. మీ రిక్కడ ఎక్కువకాలం ఉండరని నేను చెప్పగలను.'' అన్నాడు.

''మీరు చేసిన ప్రకటన మళ్ళీ ఆలోచించుకొనేంతవరకూ, మీరిక్కడ ఉండవచ్చు. ఈలోపల నాతోపాటు లోపలికిరమ్మని అడుగుతున్నా.'' అని బియెడన్‌బక్ ప్రశాంతంగా మాట్లాడాడు.

''లోపలికా?'' అని అతడు చకితుడైనాడు. ''మీ కిక్కడ శవాలు దాచిపెట్టే పాతాళగృహం ఉందా ఏమి? అటువంటివిఉంటై అని విన్నానులే.'' అన్నాడు.

''లోపలికివచ్చి చూడండి.'' అని బియెడన్‌బక్ మృదుస్వరంతో మాట్లాడాడు.

''కానీ, అది అన్యాయం'' అని ఆక్షేపణ తెలిపాడు.

''అవును. మీ న్యాయాన్ననుసరించి. కానీ, మా న్యాయం ప్రకారం అది ధర్మమే. మీరు నివసించిన, పరపీడన, కిరాతకత్వంతోనిండిన ప్రపంచంలో కాకుండా, మరో ప్రపంచంలో ఉన్నారన్న నిజాన్ని మీరు గ్రహించాలి.'' అని టెర్రరిస్టు సాభిప్రాయంగా మాట్లాడాడు.

"ఆవిషయంలో వాదించడానికి అవకాశం ఉంది." అని విక్సన్ గొణిగాడు.

"ఐతే, మాతో ఉండి, చర్చించండి!"

ఆ యువకుడు నవ్వి, తనను బంధించినవాడితో ఇంట్లోకి పోయాడు. అతణ్ణి గుహలో ఉన్న ఒక గదిలోకి తీసుకువెళ్ళాడు. మాలో ఒక యువక కామ్రేడ్‌ను అతనికి కాపలాగా అట్టే పెట్టాం. వంటింట్లో మేం పరిస్థితిని గూర్చి చర్చలు సాగించాం.

సజల నేత్రాల్తో బియెడెన్‌బక్, విక్సన్ తప్పకుండా చావాలి అన్నాడు. అతడి భయంకర ప్రతిపాదనను మేం తోసిపుచ్చేటప్పటికి, అమ్మయ్యా అని తెప్పరిల్లాడు. అదిగాక, ఈ యువక అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతిని, విడిచిపుచ్చడానికి అనుమతించడం కూడా కుదురకల్ల.

"ఏం చెయ్యాల్నో నేను చెప్తా. మనం అతణ్ణి అట్టే ఉంచేసి, విద్యాబుద్ధులు గరుపుదాం." అన్నాడు ఎర్నెస్టు.

"ఈ అవకాశం తీస్కుకోని నేను రెండుమాటలు పలుకుతా. న్యాయ శాస్త్ర ప్రవీణున్ని చేద్దాం." అని బియెడన్‌బక్ అరిచాడు.

ఈ నిర్ణయాన్ని అందరూ సంతోషంతో ఆమోదించారు. ఫిలిఫ్ విక్సన్‌ను ఖైదీచేసి, మా నీతిశాస్త్రంలో, సాంఘికశాస్త్రంలో విద్యావంతుణ్ణి చేస్తాం. కానీ, ఈలోగా చేయాల్సిన పని ఒకటుంది. ఈ యువక అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతి గుర్తులన్నీ పత్తాలేకుండా చేయాలి. ఆ సారంగపు గోడనించి దిగివచ్చేటప్పుడు, అతడు వదిలిపెట్టివచ్చినగుర్తులు కొన్ని ఉన్నయ్. వీటిని మాపుచేయాల్సిన కార్యక్రమం బియెడన్ బక్ మీదపడింది. అతడు పైనుంచి తాడుమీదగా వేలాడి, ఒక్క గుర్తుకూడా లేకుండా ఉండేటట్లు, సాయంత్రంవరకు బలే చాకచక్యంతో పనిచేశాడు. సారంగం ముఖం నుంచి, లోయలోవరకూ ఉన్న పాదముద్రల్నికూడా అట్లాగే మాపుచేశాడు. ఇకప్పుడు, మసకమసక చీకటిపడ్తుండగా, జాన్‌కార్లసన్ వచ్చి విక్సన్‌ను చెప్పులివ్వమన్నాడు.

ఆ యువకుడు చెప్పులివ్వడానికి ఇష్టపడకపోవడమేగాకుండా, వాటి కోసం తగాదాకైనాసరే సిద్ధమన్నాడు. ఇకప్పుడు ఎర్నెస్టు కొంచెం చేయి చేసుకోనేటప్పటికి, రుచితెలిసి ఇవ్వకతప్పిందిగాదు. చెప్పులు చాలా చిన్నవి కావడంచేత, కాళ్లమీద పీతోలులేచి వరిపిడికి పాదాలన్నీ రణగాయాలైనై అని, కార్లసన్ తర్వాత చెప్పాడు. కానీ, ఆ చెప్పుల్తో బ్రహ్మాండమైన పని నిర్వర్తించాడు.

ఈ యువకుడి పాదముద్రలు అంతమైన సొరంగం వెనకభాగంనుంచి, కార్లసన్, చెప్పులేసుకొని, ఎడమదిక్కుగా నడచిపోయాడు. చెట్లగుంపుల్లోంచి, ఇరుకు మార్గాల్లోనుంచి, లోయల్లోనుంచి కొన్ని మైళ్ళవరకూ నడచి నడచి, ఆఖరికి, క్రీక్ ప్రవాహగర్భంలోకి ఆ పాదముద్రల్ని అంతంచేశాడు. ఇక్కడ అతడు చెప్పులు విడిచేసి, ఇంకా ఆ పాదముద్రల్ని కొంతదూరం వరకూ దాచి, ఇకక్కణ్నుంచి తన సొంత చెప్పుల్ని ధరించాడు. ఒక వారం గడచిన తర్వాత విక్సన్ చెప్పులు విక్సన్‌కు చేరినై.

ఆ రాత్రి వేటకుక్కలదండు వచ్చింది. మాకందరికీ నిద్రఉంటే ఒట్టు. మరుసటిరోజు, మళ్ళీ వేటకుక్కల 'భౌ భౌ' రావాలు లోయలో వినిపించినై. అక్కణ్నుంచి, ఇదివరకు కార్లసన్ ఏర్పర్చిన పాదముద్రల్ని అనుసరించి ఎడమదిక్కుగా దూరంగా లోయల్లోబడి వెళ్ళిపోయినై. ఇక వాటి అరుపులే మా చెవిన పడలేదు. ఇంతకాలం, ఆటోమెటిక్ రివాల్వర్లూ, బియెడన్‌బక్ స్వయంగా తయారుచేసిన అరడజను నాటుబాంబులు, ఇతరమైన ఆయుధసామాగ్రితో మా వాళ్లు సర్వసన్నాహంతో, ఏం ప్రమాదంవస్తుందో అని కాచుక్కూర్చున్నారు. వాళ్ళేగనక సాహసంచేసి, మా రహస్యాశ్రయం లోకి వచ్చినట్లైతే, మా తడాఖా ఏమిటో బాగా రుచిమాచి ఉండేవాళ్ళే.

ఒకప్పుడు అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతిగా ఉండి, ఇప్పుడు, విప్లవ కామ్రేడ్‌గా మారిన, ఫిలిఫ్‌విక్సన్ యొక్క యదార్థమైన అంతర్ధా

నాన్ని ఇప్పుడు మీరు చూపించా. ఎందుకంటే, చివరికి అతణ్ణి మేం మార్చి వేశాం. అతడి మనస్సు కొత్త తేజస్సుతో నిండింది. నిర్మలంగా ఉంది. అసలు వస్తుతా అతడు నైతిక ప్రవర్తనకలవాడు. కొన్ని నెలల తదనంతరం, వాళ్ళ నాన్న గుర్రాల్లోనే ఒక గుర్రంమీద, అతణ్ణి తీసుకొని, సొనామా పర్వతాల మీదగా, పెటలుమాకీక్ వరకూ స్వారిచేసి, అక్కడ ఒక చిన్న చేపల పడవలో ఎక్కించాం. మా భూగర్భరైల్వేద్వారా సర్వసులభంగా అతణ్ణి కార్మెల్ రహస్యాశ్రియానికి చేరవేశాం.

అక్కడతడు ఎనిమిది నెలలపాటు ఉన్నాడు. ఆ తర్వాత, రెండు కారణాలవల్ల ఇష్టంలేకపోయినా మమ్మల్ని వదిలి, అక్కణ్ణుంచి వెళ్ళాల్సి వచ్చింది. మొదటికారణం ఏమిటంటే, అన్నారాయల్‌స్టన్ ప్రేమలో పడ్డాడు. అతడు మాలో ఒకడుగా మారడం రెండోకారణం. తన ప్రేమ కలాపం ఏమాత్రం ఫలించదురా అని అతడికి అతడే స్వయంగా తెలుసుకొన్న తర్వాతగాని, మా కోర్కెను తలూపి, వాళ్ళ నాన్నదగ్గరికి వెళ్ళిపోలేదు. చచ్చేదాకా అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతిగా నటించిన అతడు, మాకు నిజంగా అమూల్యమైన ప్రతినిధిగా ఉపకరించాడు. మాపట్ల, తాను పన్నే వ్యూహాలూ, ప్రయత్నాలూ, కార్యక్రమాలూ విఫలమైపోతోంటే, ఉక్కుపాదం అనేకపర్యాయాలు వెర్రిమొగంవేసుకొని, ఎందుకురా అని కారణం తెలియక, నోటమాటపెకల్లేని పరిస్థితుల్లో ఉండేది. తనలోనే ఉన్న మా ప్రతినిధుల సంఖ్య ఎంతో దానికి తెలిస్తే, అంతా అవగాహన అయిఉండేదే. ఆశయానికి, యువక విక్సన్ ఎన్నడూ అవిధేయుడుగా ప్రవర్తించనే లేదు. నిజానికి, అతడు తన విధ్యుక్త నిర్వహణకు బాగా అంకితంకావడం వల్లనే, అతడి మరణం తటస్థించింది. 1927 లో వచ్చిన పెనుతుఫానులో, మా నాయకుల సమావేశానికి హాజరైనప్పుడు, అతడికి నిమోనియా జ్వరం సోకింది. దాంతోటే, అతడు మరణించాడు.

# ౨౧

ఈ రహస్యాశ్రయంలో చాలాకాలంగా మేం ఉన్నప్పటికీ, మేం లేకుండా బైటి ప్రపంచంలో జరుగుతున్న సంగతి సందర్భాలన్నిటి తోటీ, మాకు సంబంధం ఉంటూనే ఉండేది. మేం పోరాడుతోన్న అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం బలసంపదకూడా ఎంత ఉందీ తెలుసుకొం టుండేవాళ్లం. నిత్యపరిణామంచెందుతోన్న సందర్భంలో కొత్త కొత్త సంస్థలు ఇంకా బాగా ఏర్పడి, శాశ్వత స్థితిని పొందుతున్నై. అల్పసంఖ్యాక నిరం కుశ ప్రభుత్వం తానెంత విశాలమైన సంస్థగా ఉందో, అంత విశాలరూపంలో ప్రభుత్వ యంత్రాన్ని ఏర్పాటుచేసి, మేం ఎంత కృషిచేసినా, దాన్నంతా అటకాయించి, నిరర్థకంగాచేయడంలో సఫలమైంది.

చాలామంది విప్లవవాదులకు ఇది ఆశ్చర్యాన్ని కలిగించింది. అది సాధ్య మని వాళ్ళెన్నడూ ఊహించలేదు. ఐనప్పటికీ, దేశవ్యవహారం జరిగిపోయింది. గనుల్లో, పొలాల్లో మనుష్యులు పరిశ్రమించారు. అవసరంకొద్దీచేస్తున్న వాళ్ళస్థితి, బానిసలస్థితికన్నా ఏమంత నయంగాలేదు. ప్రధాన పరిశ్రమల విషయంలో అభివృద్ధి కనబడింది. కార్మిక కులాల సభ్యులు బాగా సంతృప్తిచెంది, ఆనం దంగా పరిశ్రమించారు. వాళ్ల జీవితంలో మొదటిపర్యాయంగా, పారిశ్రామిక శాంతిని తెలుసుకొన్నారు. విసుగుపుట్టించేకాలం, సమ్మె, మిల్లుల మూసివేత, యూనియన్ చీటీలు, ఇక వీటి గొడవే వాళ్లకులేదు. ఇంతకు ముందు వాళ్లు నివసించిన మురికికూపాలకన్నా, నికృష్టజీవితానికన్నా, ఇప్పుడింకా సౌఖ్య వంతాలైన, ఆనందదాయకాలైన ఇళ్లల్లో, పట్టణాల్లో, ఎంతో సంతోషంగా జీవిస్తున్నారు. మంచి ఆహారం, తక్కువ పనిగంటలు, ఎక్కువ శెలవలు, బోలెడంత కాలక్షేపం. వినోదాలూ, వాళ్లకు లభించినై. వాళ్లకన్నా దుర దృష్టులైన సోదరుల, సోదరీమణుల, అభిమానంపొందని కార్మికుల, అధః పాతాళానికి అణగద్రొక్కేయబడిన అనాథ ప్రజల సంగతిని, వాళ్లేమాత్రం

పట్టించుకోలేదు. మానవజాతిలో స్వార్థయుగ ప్రాదుర్భావం సాగుతోంది. ఐనా, ఇదంతా సత్యంగాదు. కుక్షింభరతా తాపత్రయమేగాకుండా, స్వేచ్ఛా, సర్వమానవ సౌభ్రాతృత్వ దివ్యజ్యోతిని దర్శించిన మా ప్రతినిధులు తేనెటీగలు చుట్టేసినట్లు, కార్మిక కులాల్ని ఆక్రమించుకొన్నారు.

కొత్తగా వెలిసి, ప్రశాంతంగాపనిచేస్తున్న మరోసంస్థ, డబ్బుకక్కుర్తికి ఉక్కుపాదం దాసులుగా పనిచేస్తున్న సంస్థ. దీన్లో చేరిన వాళ్లంతా పూర్వం సైన్యంలో ఉన్నవాళ్లే. ఇప్పటికి పదిలక్షలవరకూ ఐనారు. ఇంకా వలస రాజ్యాలనుంచి వచ్చిచేరినవాళ్ల సంగతే చెప్పనవసరంలేదు. డబ్బు కక్కుర్తి కోసం చేరిన వాళ్లంతా ప్రత్యేకంగా ఒక తెగగా తయారైనారు. వాళ్లంతట వాళ్లే పరిపాలించుకొనే సొంత పట్టణాల్లో వాళ్లు ఉంటున్నారు. వాళ్లకు చాలా సౌకర్యాలు కల్పించబడినై. వాళ్ళవల్ల, ఏం చెయ్యడానికీ పాలుబోకుండా ఉన్న అత్యధిక శేషం చాలావరకు ఖర్చుబడిపోయింది. తక్కిన ప్రజలతో వాళ్లకేవిధమైన సంబంధంలేకుండా పోతోంది. ప్రజల ఆదరాభిమానాలకు దూరమైనారు. నిజానికి వాళ్లు, వాళ్ల వర్గానికి సంబంధించిన నైతికమార్గాల్ని, చైతన్యాన్నీ పెంపొందించుకొంటున్నారు. ఐనప్పటికీ, వాళ్లల్లో మా ప్రతినిధులు వేలకు వేలుగా ఉన్నారు.

అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లు స్వయంగా, ప్రశంసనీయమైన అభివృద్ధిచెందుతున్నారు. నిజానికి, మేం కూడా ఊహించలేని అభివృద్ధిచెందారని అంగీకరించకతప్పదు. వాళ్లొకవర్గంగా కట్టుదిట్టంచేసుకొన్నారు. ఈ వర్గానికి సంబంధించిన ప్రతివ్యక్తీ లోకంలో చేయాల్సిన పని ఒకటుంది. ఆరు నూరయ్యేది, నూరు ఆరయ్యేది, ఆ పని మాత్రం అతడు నిర్వహించి తీరాల్సిందే. ఇకక్కణ్నుంచి, గుడ్డి గుర్రాలకు పళ్లుతోముతూ కూర్చుండే ధనికయువకులంటూ లేకుండాపోయారు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి, వీళ్ళ బలం కూడా కలిసి, మరింత పుష్టిచేకూర్చింది. వాళ్ళు సేనానాయకు

లుగా, పరిశ్రమాధినేతలుగా పనిచేశారు. సాధారణ విజ్ఞానశాస్త్రంలో ప్రవేశించి, చాలామంది గొప్ప ఇంజనీరైనారు. శాఖోపశాఖలుగా విస్తరిల్లిన ప్రభుత్వంలోకి గుంపులు గుంపులుగా చేరి వలసరాజ్యాల్లో ఉద్యోగాలు స్వీకరించారు. వివిధ రహస్యశాఖల్లో వేలాదిగా ప్రవేశించారు. విద్యారంగంలో, కళాక్షేత్రంలో, మతవిషయంలో, విజ్ఞానశాస్త్రవీథుల్లో, సారస్వత సాంప్రదాయంలో, వాళ్ళు శుశ్రూష చేశారు. ఆయా రంగాల్లో ప్రముఖపాత్ర వహించి, 'అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం ఆచంద్రార్కం అణుమాత్రం చెక్కుచెదరకుండా చిరంజీవిగా ఉండేదే' అనే భావం జాతిలో సుదృఢంగా నాటుకుపోయేటట్లుగా, మనుష్యుల ఆలోచనా విధానాల్ని మలిచారు.

'తాము చేస్తున్నదంతా సక్రమమైందన్న' పాఠం మొదట నేర్చుకొన్నారు. అదే పాఠాన్ని అక్షరం పొల్లుపోకుండా, తామూ బోధించారు. ప్రపంచమంతా, తమను కులీనులుగా పరిగణించాలనే భావం, వాళ్ళకు కొంచెం ఊహాపోహాలు వచ్చిననాటినుంచే బాగా ఏర్పడ్డది. కులీనవర్గభావం తమ రక్తమాంసాస్థికలుగా మారేటంతగా తయారయ్యారు. ఘాతుక జంతుశిక్షకులుగా, మృగపరిపాలకులుగా తమ్ము తాము తలపోసుకొన్నారు. వాళ్ళ పాదాల అడుగున పాతాళలోకంలోనుంచి, ప్రతిఘటనా భయంకర ప్రళయఘోష, ప్రతినిత్యం ప్రతిధ్వనిస్తూనే ఉంది! వాళ్లమధ్యలో మహోగ్రమృత్యువు నిత్యతాండవం చేసింది. బాంబు, కత్తి, తుపాకిగుండు, ప్రణయగర్జారావం చేస్తున్న ఘాతుక మృగంయొక్క బలిష్ఠ బారెడు కోరలుగా వాళ్లకు కనిపించినై. మానవజాతి మనుగడకోరితే, వాటిని అధికారంలోకి తీసుకోవాలి. మానవజాతి సంరక్షకులుగా, లోక కల్యాణంకోసం, సాహసించి, వీరోచితంగా పరిశ్రమించే కర్మకులుగా తమను తాము భావించుకొన్నారు.

తమ వర్గం అంటూ ఒకటుండబట్టే, మానవనాగరికత సజీవంగా ఉందని విశ్వసించారు. తామే బలహీనపడిపోతే, ఈ మహా భయంకర మృగం

విజృంభించి, తమనూ, ఈ అద్భుతానంద సౌందర్య స్వరూపాలనూ ఒక్క చుట్టుచుట్టి, అమాంతంగా తన అగాధ గర్భకుహరంలోకి నెట్టేస్తుందని వాళ్ళ నమ్మకం. వాళ్ళే లేకపోతే దేశం అరాచకమే! అంతేకాదు, కష్టంతో పైటికి వచ్చిన ఆ అనాది అంధకారకూపంలో మానవజాతి మళ్ళీ బుడింగుమంటుంది. అరాచక భయంకర స్వరూపం తమ పిల్లల కళ్ళల్లో మెలిగేటంతగా వాళ్ళు చిత్రించారు. ఈ పిల్లలు ఆ భయంకర దృశ్యాన్నే నిత్యదర్శనం చేసుకొంటూ పెరిగి పెద్దవాళ్ళై, తమ సంతానానికి అదే స్వరూప చిత్రణ, వారసత్వంగా సంక్రమింపజేశారు. ఈ భయంకర మృగాన్నే మట్టగించాలి. దీన్ని కాళ్ళకింద నీ రాయడమే కులీనవర్గ విధ్యుక్త ధర్మం. ఒక్కమాటలో చెప్పాలంటే, తమయొక్క విసుగువిరామంలేని పరిశ్రమ త్యాగఫలితాలవల్లనే, దుర్బలమానవ జాతికీ, సర్వభక్షకకుక్షియైన ఘాతుక మృగానికీ మధ్య తాము కంచుకోట లాగా నిలబడ్డామని వాళ్ల అభిప్రాయం. అభిప్రాయమే కాదు. వాళ్లు దాన్ని ఘట్టిగా నమ్మారు.

మొత్తం అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వంయొక్క నైతిక ధార్మిక గుణాలను గురించి నేను ఎక్కువగా నొక్కిచెప్పడంలేదు. ఉక్కుపాదం బలం ఇదే. కానీ, మా కామ్రేడ్స్‌లో చాలామటుకు ఇంకా దీన్ని అర్థం చేసుకోలేదు. ఉక్కుపాదం యొక్క బహుమతి ప్రదానాలూ, కఠిన శిక్షల వల్ల సంక్రమించిన బలం ఇది అని చాలమంది నిర్ధారించారు. ఇది తప్పు. మతి మాధ్యంగల వ్యక్తికి స్వర్గనరకాలు ప్రధానాలే. కానీ స్వీకృతిచేసినవాళ్ళల్లో అధికసంఖ్యాకులు మంచిచెడ్డలకు మారుగా స్వర్గనరకాల్ని సామాన్యంగా అను కొంటారు. ధర్మానురాగం, ధర్మాసక్తి, ధర్మచ్యుతిలేశానికైనా విచార పడడం, క్లుప్తంలో చెప్పాలంటే, ధర్మప్రవర్తన, మతానికి ప్రధాన లక్షణం. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ విషయం కూడా ఇంతే. కారాగారాలు, దేశబహిష్కారాలు, స్థానభ్రష్టతలు – సన్మానాలు, ప్రాసాదాలు, అద్భుత

నగరాలూ – ఇవన్నీ గతాను గతికాలం. తాముచేస్తున్నది సధర్మం అనే ఊహా అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధినేతల్లో గొప్ప ప్రోత్సాహశక్తి. అ. నేను చెప్పిన సూత్రానికి అపవాదాలు ఉండవచ్చు. వాటిసంగతి పట్టించుకోవాకండి. ఉత్కృపాదం జన్మహేతువులైన పరపీడన, అధర్మం విషయాలు వదిలేయండి. అంతా అంగీకరించాం. విషయమేమిటంటే, తాను చేస్తున్నది ధర్మం అనే ఆత్మసంతృప్తిభావనలోనే ఈనాడు అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ బలం ఇమిడి ఉంది.

ఆమాటకువస్తే, భయంకరమైన ఈ ఇరవై సంవత్సరాల కాలం, తాను చేస్తున్నది ధర్మమనే భావనా బలంతోటే విప్లవం జీవించకల్గిందిగాని, మరే ఇతరంవల్లా కాదు. మా త్యాగాలనూ, వీరోచితమరణాలనూ ఇంకేరకంగానూ వ్యాఖ్యానించలేం. తన జీవిత తుదిదశలో, జీవితాశయంకోసం మనస్సును రగిలించి, తన హంసగీతిని, రుడాల్ఫ మెన్‌డన్‌హాల్, ఆలపించాడంటే, ఇదితప్ప మరేకారణంకాదు. చిట్టచివరి నిశ్వాసంవరకూ, తనను శత్రువులెన్ని చిత్రహింసలు పెడ్తున్నా, తన కామ్రేడ్సుకు విద్రోహం చేయడానికి నిరాకరించి మరణాన్నే ఆహ్వానించాడు హాల్‌బర్ట్ అంటే, కారణం అదే. అన్నా రాయల్‌స్టన్ అవివాహితగానే ఉండిపోయిందందుకనే. గ్లెన్ ఎలెన్ రహస్యాశ్రయానికి జాన్‌కార్లసన్ విశ్వాసపాత్రుడై, ప్రతిఫలాపేక్షరహితంగా ఆధిపత్యం వహించడానికి కారణంఅదే. పడుచుకుర్రాడా, పండుముసలా, మగా ఆడా, ఎక్కువా తక్కువా, విజ్ఞానా అజ్ఞానా అనేదాంతో ఏం నిమిత్తం లేదు. విప్లవ కామ్రేడ్సులో ఉన్న ఏవ్యక్తి దగ్గరకైనా వెళ్ళు, ఆవ్యక్తిని కదిలించే ప్రధానశక్తి, న్యాయతృష్ణే అని నీకు అర్థమౌతుంది.

కానీ, నేను చెపుతూ చెపుతోన్నదాన్ని వదిలేసి మరోదారిలోపడ్డా. ఉత్కృపాదబలం ఎంతగా అభివృద్ధి చెందుతోందో, నేనూ, ఎర్నెస్టూకూడా మా ఆశ్రయాన్ని వదిలేముందే బాగా గ్రహించాం. శ్రామికకులాలు, బడి

తొత్తు సైనికులూ అసంఖ్యాకులైన రహస్యపు ఏజెంట్లు, అనేకరకాలైన పోలీసులు అందరూ అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి గులాములైనారు. చాలామటుకు, స్వేచ్ఛను కోల్పోవడం లక్ష్యంచేయకపోవడంలో, పూర్వంకన్నా ఇంకా రెండాకులెక్కువే చదువుకొన్నారు. మరోవైపు, అగాధంలో అట్టడుగునపడి కుమిలే అనాథ ప్రజాసందోహం, నికృష్ట హైన్యస్థితివల్ల ఉదాసీనత్వందాల్చి మృగప్రాయమై అసంతృప్తిలో మరీమరీ దిగజారి పోతోంది. ఈ ప్రజాసందోహంలో ఎప్పుడైనా బలిష్టులైన ప్రొలిటేరియన్లు తమ బలాన్ని నిరూపించుకొన్నారో, వెంటనే అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం వాళ్ళను ప్రజా సందోహంలోనుంచి బైటకి లాక్కొచ్చి, శ్రామిక కులాల్లోనో, బడితొత్తు సైనికుల్లోనో సభ్యులుగా చేర్చి, వాళ్ళకు అనేకాలైన సౌకర్యాలు కల్పిస్తోంది. ఈవిధంగా అసంతృప్తిని జోకొట్టి, ప్రొలిటేరియన్లయొక్క సహజమైన నాయకుల్ని వాళ్ళకు గాకుండా చేశారు.

అగాధంలో ఉన్న ప్రజలస్థితి మరీ కరుణార్ద్రంగా ఉంది. వాళ్ళకు సంబంధించినంతవరకూ సామాన్య పాఠశాలా విద్య అంతరించింది. పెద్ద పెద్ద మురికి కూపాల్లో వాళ్ళు మృగప్రాయులై తమ దౌర్భాగ్య నీచస్థితికి లోలోపల కుమిలిపోతూ ఉన్నారు. వాళ్ళ పూర్వపు స్వేచ్ఛలన్నీ శంకరగిరి మాన్యాలు పట్టినై. వాళ్ళు శ్రామిక బానిసలు. వాళ్ళకు పని చూపించే అవకాశం నిరాకరింప బడింది. అట్లాగే, ఒకచోటు నుంచి మరో చోటుకు కదిలే హక్కు, ఆయుధాలు కలిగి ఉండే లేక ధరించే హక్కు నిరాకరింపబడినై. రైతులకు మాదిరిగా వాళ్ళేమీ భూదాసులుగారు. వాళ్ళు యంత్రదాసులు. పరిశ్రమ దాసులు. పెద్ద పెద్దరాస్తాలూ, విమాన మార్గాలూ, కాలువలూ, కొండల్లో నుంచి పోవడానికి తొలిచిన మార్గాలూ, చిన్న చిన్న మార్గాలూ, కోటలూ, నిర్మించాల్సిన అసాధారణమైన అవసరాలు కలిగినప్పుడు, శ్రమజీవులు

నివసించే మురికి పేటలమీదికి దండుకవచ్చి వాళ్ళందరికీ ఇష్టమున్నా లేక పోయినా పట్టుబలవంతాన పనులు చేయాల్సిన ప్రదేశాలకు పట్టుకుపోయే వాళ్ళు. వాళ్ళల్లో ఈ నాడు చాలాముఠాలు, సంసారంచేసే వాళ్ళు జీవించ డానికి వీల్లేని నరక కూపాల్లాంటి ప్రదేశాల్లో తలదాచుకొంటూ 'ఆర్డిస్' నిర్మాణంలో కృషిచేస్తున్నారు. వాళ్ళు నివసిస్తోన్న ప్రదేశంలో పరిశుభ్రతకు బదులు పశుత్వం తాండవ మాడుతోంది. అసలు నిజానికి, అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం అంతగా భయపడి పోయిన ప్రళయగర్జారావం చేస్తోన్న ఘాతుకమృగం ఉంది ఆ శ్రామిక మురికికూపాల్లోనే. కానీ అది వాళ్ళు స్వయంగా చేతులారా చేసుకొన్న మృగం అది. దానిదగ్గర వాళ్ళు పెద్దపులినీ చావనీయరు.

సరిగ్గా ఇదేసమయానికి, ఆర్డిస్ నిర్మాణం పూర్తికావడంతోటే, దాని కన్నా బ్రహ్మాండమైన ఫక్కీలో 'అస్గార్ట్' మహాద్భుత పట్టణ నిర్మాణానికి గాను కొత్తపన్నులు విధించబోతున్నారన్న వార్త దేశమంతటా పాక్కి పోయింది. విప్లవానికి సంబంధించిన మేం మాత్రం ఆ మహాకృషిని నిర్వహిస్తాం. కానీ, దురదృష్టంలో మునిగున్న కూలిసులుమాత్రం ఆపని చేయలేరు. ఆడుతూ పాడుతూ ఆ నగర మహోద్యానాల్నీ, ప్రాసాదశిఖరాల్నీ, శిలాస్థంభాల్నీ శిల్పిస్తాం. దాని సౌందర్యంలో, అద్భుతంలో నిట్టూర్పులూ, మూల్గులూగాను మిళితం చేసేది సంగీతం, నవ్వులూ.

ప్రపంచంలోకి పోయి కృషిచేద్దామనే తహతహతో ఎర్నెస్టు పట్ట శక్యంగాని పరిస్థితిలో ఉన్నాడు. ఎందుకంటే, చికాగో కమ్యూన్‌లో తప్పుడు నాయకత్వంచేత నిర్వహించబడ్డ మా మొదటి దురదృష్టకరమైన తిరుగుబాటు, తొందర్లో పరిపక్వస్థితికి వస్తోంది. మనిషిని తమాం మార్చివేయ డానికి గాను ఇల్లినాయీస్ నుంచి 'హాడ్లే'ను తీసుకువచ్చినప్పుడు, అతడు తన స్వరూపాన్నే మార్చి మరో మనిషిగా చేయడానికి చాలా నిర్బంధాల్లో అట్టే

పెట్టి బాధించినప్పుడు, ఎర్నెస్టు ఎంతో మనో నిగ్రహాన్ని ప్రదర్శించాడు. చదువుకొన్న ప్రొలిటేరియన్ల సంస్థానిర్మాణం చేద్దామనీ, అగాధంలో ఉన్న అశేష అజ్ఞాన ప్రజానీకానికి కనీసం ప్రాథమిక విద్యైనా నేర్పుదామనీ ఆయన బుర్రలో వ్యూహాలమీద వ్యూహాలు ఉరకలు వేసినై. ఒకవేళ మొదటి తిరుగుబాటు విఫలమైపోతే చేయాల్సిన పనులనుకొంటే ఇవన్నీ.

1917 జనవరి నాటికిగాని మేం మా రహస్యాశ్రయాన్ని వదిలిపెట్టలేదు. అంతా ఏర్పాటు జరిగింది. వెంటనే మేం ఉక్కుపాదం సంక్షోభకార ప్రతినిధులుగా పాత్రధారణ చేశాం. నేను ఎర్నెస్టు చెల్లెలుగా నటించాలి. లోపల ఉన్నతాధికారాల్లో ఉన్న అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతులూ, కామ్రేడ్లూ మాకు స్థానాన్ని కల్పించారు. ప్రధానమైన డాక్యుమెంట్లన్నీ మా ఆధీనంలో ఉన్నాయ్. మా గతచరిత్రంతా లెక్కలోకి వచ్చింది. లోపల్నుంచి మాకు సహాయం రావడంచేత ఇదేమంత కష్టసాధ్యమైన పని కాదు. ఎందుకంటే, ఛాయావృతమైన ఆ రహస్యశాఖా ప్రపంచంలో మనిషిని గుర్తుపట్టడం దుస్సాధ్యం. ఆజ్ఞల్ని శిరసావహిస్తూ, కర్తవ్యాల్ని పూర్తిచేస్తూ, సమస్యా పరిష్కారాల్ని అనుసరిస్తూ, తామింతకు ముందు ఏనాడూ చూడని ఉద్యోగులకు తరుచుగా తాము చేసిన కార్యక్రమాల్ని నివేదిస్తూ, ఇంతకుముందు చూడని, ఇక ముందు ఎన్నడూ చూడబోని ఇతర ఏజెంట్లతో సహకరిస్తూ, దగ్యాంగ్గా ఏజెంట్లు వస్తారు. పోతారు.

## ౨౨

సంక్షోభకారులైన ఏజెంట్లుగా మేం చాలా దూరం ప్రయాణంచేయ కలగడమే కాకుండా, అసలు మా కార్యక్రమంవల్లనే, ప్రొలిటేరియన్లతోటే, మా విప్లవవాదులైన కామ్రేడ్స్‌తోటీ సంబంధం ఏర్పర్చుకోగలిగాం. ఉక్కుపాదాన్ని సేవిస్తున్నట్లుగా నటిస్తూ, ఆశయసిద్ధికోసం రహస్యంగా

మా శాయశక్తులా పరిశ్రమిస్తూ; ఈవిధంగా, ఒక్కసారే మేం ఉభయపక్షాల్లోనూ ఉన్నాం. మాలో చాలామంది, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ వివిధ రహస్యశాఖల్లో ఉన్నారు. రహస్యశాఖలు అనేక పర్యాయాలు కదిలిపోయి, మళ్ళీ నిర్మాణం జరిగినప్పటికీ, మమ్మల్నందర్నీ వేరిపారేయడానికి వాళ్లకు చేతగాలేదు.

మొదటి తిరుగుబాటుకు, ఎర్నెస్టు, పెద్దపథకంవేశాడు. 1918 వసంత కాలంలో కావాలి తేదీ నిర్ణయం కూడా చేశాడు. 1917 వ సంవత్సరాగమనంలో మేం సిద్ధంగాలేం. చేయాల్సింది చాలా మిగిలి ఉంది. విప్లవమే గనక రేపితే ఘోర అపజయం సిద్ధించేరాత స్పష్టంగా రాసిందన్నమాటే. అవసరమైన పన్నాగడ చాలా దురవగాహంగా ఉంది. పరిపక్వానికిరాని ఏ స్థితైనా సరే దాన్ని సర్వనాశనంచేస్తుంది. దీన్ని ఉత్కృపాదం దీర్ఘదర్శనంచేసింది. దానికి తగ్గట్లుగా పథకాలు నిర్మించుకొంది.

అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వంయొక్క మనస్సు మీద మొట్టమొదటుగా దెబ్బకొడ్దాం అని మేం పథకం పన్నాం. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి, పూర్వం జరిగిన సర్వవ్యాప్తమైన సమ్మెబాగా జ్ఞాపకంలో ఉంది. టెలిగ్రాఫ్ స్థానే వైర్లెస్ స్టేషన్లు నెలకొల్పి, వాటిని బడితొత్తు సైన్యాల చేతుల్లో పెట్టి, టెలిగ్రాఫర్ల విద్రోహ చర్యకు తగిన జాగ్రత్త తీసుకొంది. మేం ఈ ఎత్తుకు పైఎత్తేశాం. సంకేత సూచన చేసేటప్పటికి, దేశం మొత్తంలో ఉన్న రహస్యాశ్రయాలన్నిట్లో నుంచి, మహానగరాల్లోనుంచి, పట్టణాల్లోనుంచి, సిపాయిస్థావరాల్లోనుంచి, ఆశయానికిఅంకితమైన కామ్రేడ్స్ అందరూ బైలుదేరిపోయి వైర్లెస్ స్టేషన్లను బాంబుల్తో ఆకాశంలోకి ఎగరగొట్టేయాలి. ఈ విధంగా మొదట దెబ్బతో ఉత్కృపాదం నేలకరుచుకోని పూర్తిగా శకలవనాతుంది.

అదే సమయంలో తక్కిన కామ్రేడ్స్, వంతెన్లనూ, కొండ సొరంగాలనూ, పడగొట్టేసి, మొత్తం రైల్వే మార్గాన్ని చిందర వందర చేయాలి. ఇంకా ఏమిటంటే, తక్కిన కామ్రేడ్స్, సూచన అందడంతోటే, బడితొత్తు సైనికుల ఉద్యోగుల్ని, పోలీసుల్ని, అసాధారణ మేధావులైన, లేక కార్య నిర్వాహకవర్గంలో ఉన్న అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధిపతుల్నీ, పట్టుకోవాలి. దేశమంతా తప్పకుండా పోట్లాడే శత్రునాయకులు, ఈ విధంగా స్థానిక యుద్ధరంగాల్లో నుంచి తొలగింపబడ్తారు.

సూచన అందడంతోటే, ఒకే పర్యాయంగా జరగాల్సిన పనులింకా అనేకం ఉన్నయ్. ఉత్పాదం ఊహించిన దానికన్నా ఎన్నో రెట్లబలంతో ఉన్న కనడా, మెక్సికో దేశభక్తులు మా వ్యూహాలకు నకలుగా చేయాలి. ఇంకా కొందరు కామేడ్స్ ఉన్నారు. (ఈ కామేడ్స్ స్త్రీలు. ఎందుకంటే, పురుషులు మరోరకంగా చాలా హడావుడిలో ఉంటారు.) వాళ్ళు, మా రహస్య ముద్రణాలయాలద్వారా ప్రకటల్ని పోస్టుచేయాలి. ఉత్పాదంయొక్క ఉన్నతాధికారంలో ఉన్న మేమంతా, మా అన్ని శాఖల్లో వెంటనే అరాచకాన్ని, గందరగోళాన్ని లేవదీయాలి. బడితొత్తుసైన్యంలో మా కామేడ్స్ వేలాదిగా ఉన్నారు. మందు గిడ్డంగుల్ని ఉప్పున ఊదేసి, యుద్ధ యంత్రాలకు సంబంధించిన సున్నితమైన యాంత్రిక విధానమంతా నాశనంచేయడం వాళ్ళు చేయాల్సిన పని. బడితొత్తుసైన్యాలు ఉన్న నగరాల్లోనూ, శ్రామికకులాలు ఉన్న పట్టణాల్లోనూఇటువంటి విధ్వంసకచర్యల్నే అమలు జరపాలి.

ఒక్కముక్కలో చెప్పాలంటే, ఉన్నట్లుండి ఒక్కసారిగా, దిమ్మదిరిగి దిగ్భ్రమచెందేలాగా పెద్ద దెబ్బగొట్టాలి. దెబ్బతిన్న అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం తిరిగి కోలుకోనేలోపల్నే, అంతిమదశ తటస్థించాలి. అంటే

ఏమన్నమాట. అత్యంత భయంకరమైన పరిస్థితుల్లో చిక్కుకోవడం, అశేష ప్రాణనష్టానికి అంగీకరించడం. కానీ, ఏ విప్లవవాదికూడా అటువంటివాటికి అదురుకోని, మీనమేషాలు లెక్కబెట్టా తటపటాయించడు. మరోవిషయం గమనించారో లేదో. మా వ్యూహానికి, అగాధంలో అట్టడుగున చెల్లాచెదురుగాపడి మగ్గుతోన్న అగాధజీవుల సహాయాన్నికూడా అర్థించాం. పెద్ద పెద్ద భవనాలమీద, అధినేతల అద్భుత పట్టణాలమీదా వాళ్ళను వదలిపెట్టాలి. ఆస్తిపాస్తులకూ, ప్రాణానికీ అపారనష్టం కలుగుతుందన్న విషయం ఫోర్డ్ దేవ్. ఆ ఘాతుక మృగాన్ని గర్జించనిద్దాం. పోలీసుల్ని, బడితొత్తు సైన్యాల్ని హత్యాకాండ సాగనిద్దాం. ఘాతుకమృగం ఎట్లాగైనా గర్జిస్తుంది. మరి పోలీసులు, బడితొత్తు సైన్యాలు ఎట్లాగైనా హత్యలు సాగిస్తారు. అంటే మాకు సంబంధించిన అనేకాలైన ప్రమాదాలు, నిరపాయంగా ఒకదాన్నొకటి నాశనం చేస్తున్నయ్ అన్నమాట. ఈ లోపల, నిరభ్యంతరంగా సమాజ యంత్రంమీద ఆధిపత్యాన్ని సంపాదించుకొంటూ, మేం మాకృషిని కొనసాగిస్తుంటాం.

అది మాపథకం. ఈ పథకానికి సంబంధించిన ప్రతి సమాచారం రహస్యంగానే జరిగిపోతుండాలి. నిర్ణీతదినం సమీపిస్తున్నకొద్దీ ఇంకా ఇంకా చాలమంది కామ్రేడ్సుకు ఈవార్త అందించాలి. కుట్రను పరివ్యాప్తంచేయడం ఉండే, చాలా ప్రమాదకరమైన ఘట్టం. కానీ, అటువంటి ప్రమాదకరమైన ఘట్టం రానేరాలేదు. ఉక్కుపాదం, తన గూఢచారిశాఖద్వారా, మా తిరుగుబాటు సమాచారం చెవిని వేసుకొంది. మరో రక్తప్రవాహ గుణపాఠాన్ని మాకు నేర్పడానికి సన్నద్ధంగా ఉంది. గుణపాఠ బోధనకు చికాగో నగరం విద్యాలయంగా ఏర్పాటుచేయబడింది. మాకక్కడ విద్యాబోధ బాగా జరిగింది.

పూర్వకాలంలో రక్తప్రవాహ నగరంగా పేరుమోసి, మాసిన పేరును మళ్ళీ స్థానం కల్పించడానికి ఉవ్విళ్లూరుతున్న చికాగో నగరం,

తక్కిన అన్ని నగరాలకన్నా మించి పరిపక్వ దశలో ఉంది. (19వ శతాబ్దంలో చికాగో నగరం ఒక పెద్దపారిశ్రామిక నరకం. బ్రిటీష్ కాబినెట్‌లో ఒకప్పుడు సభ్యుడుగా ఉండి, ఇంగ్లీషు లేబరు మహానాయకుడుగా పేరొందిన 'జాన్‌బరన్స్'కు సంబంధించిన చిత్రమైన ఉపాఖ్యానం ఒకటుంది. ఆయన ఒకసారి అమెరికా సంయుక్తరాష్ట్రాల్ని చూడడానికిపోయినప్పుడు, చికాగోలో ఉన్న సందర్భంలో, ఒక వార్తా పత్రిక విలేఖరి, ఆ పట్టణాన్ని గూర్చి ఆయన అభిప్రాయాన్ని అడిగాడు. "నరకం యొక్క వామన స్వరూపం చికాగో" అని జాన్‌బరన్స్ సమాధానం చెప్పాడు. కొన్ని రోజులైనతర్వాత, ఆయన మళ్ళీ స్వదేశానికి తిరిగిపోబోతున్న సందర్భంలో, ఓడమీదికి మరో విలేఖరివచ్చి, "అయ్యా! చికాగోను గూర్చిన మీ పూర్వాభిప్రాయంలో ఏమైనా మార్పువచ్చిందా?" అని ప్రశ్నించాడు. "అవును. పూర్వాభిప్రాయాన్ని మార్చుకొన్నా. నరకమే, చికాగో నగరానికి వామనస్వరూపం అని ప్రస్తుతాభిప్రాయం" అన్నాడు.) అక్కడ విప్లవభావం చాలా గట్టిగా ఉంది. పెట్టుబడిదారి పరిపాలనా కాలంలో అక్కడ చాలా సమ్మెలు కఠినంగా అణిచేయబడినై. ఆ పట్టణంలో ఉన్న కార్మికకులాలు కూడా తిరుగుబాటుకోసం ఉవ్విళ్ళూగుతున్నయ్. మొదట జరిగిన సమ్మెల్లో చాలా తలలు పగిలినై. వాళ్ల పరిస్థితులుమారి సౌకర్యాలు ఏర్పడినప్పటికీ, ప్రభుత్వవర్గంమీద వాళ్లకున్న ద్వేషం చల్లారలేదు. జడి తొత్తు సైన్యాల్లో ఈ భావం బాగా ఉంది. వాళ్లల్లో మూడువేలమంది పటాలం మూకఉమ్మడిగా మా పక్షంచేరడానికి సిద్ధంగా ఉన్నారు.

పెట్టుబడిదారులకూ, శ్రామికులకూ జరిగే పరస్పర సంఘర్షణలకు చికాగో ఎప్పుడూ ప్రధాన జంఝూమారుత కేంద్రంగా ఉండేది. వర్గచైతన్యం గల పెట్టుబడిదారి సంస్థలూ, వర్గచైతన్యంగల శ్రామిక సంఘాలతో ఉండి, బజారు బజారుకు బైలుదేరే యుద్ధాల్లో, దారుణ మారణాల్తో కూడిన పట్టణం

చికాగో. పూర్వం పాఠశాలా ఉపాధ్యాయులే కార్మిక సంఘాలుగా ఏర్పడి, అమెరికా కార్మిక ఫెడరేషన్‌లో ఉన్న సున్నంమోసేవాళ్ళ సంఘంతోను, ఇటుకలుకట్టేవాళ్ళ సంఘంతోనూ అనుబంధ సంఘంగా ఏర్పడ్డారు. అపర పక్ష ప్రథమప్రతిఘటనోద్యమజంఝూనిలానికి చికాగో ప్రధాన కేంద్రమైంది.

ఉక్కు-పాదమే క్లిష్టపరిస్థితులు సృష్టించింది. అది చాలా తెలివితేటల్తో సంచరించింది. తాను అభిమానించిన కార్మిక కులాల్తోసహా మొత్తం ప్రజానీకం కోపఘూర్ణమయ్యేటట్లు ప్రవర్తించింది. తానింతకుముందు చేసిన వాగ్దానాలూ, అంగీకారాలూ తూనాబోటుంబాలంది. చిన్న చిన్న నేరాలుచేసినవాళ్ళకు సైతం దారుణ శిక్షలు విధించింది. అగాధంలో అలమటిస్తున్న అనాథజన సందోహాన్ని బాగా హింసించింది. ఘాతుకమృగం గర్జించేటట్లుగా ఉక్కు-పాదం చేస్తోంది. చికాగోనగరంలో కావలసిన జాగ్రత్తలన్నీ ముందుగానే తీసుకోని నిర్లక్ష్యంగా ఉంది ఉక్కు-పాదం. బడితొత్తుసైన్యాల్లో చాలా పటాలాల్ని ఉపసంహారించి దేశంలో వివిధ భాగాలకు పంపింది. మిగతా పటాలంమీద ఉన్న క్రమశిక్షణ కొంత సడలించింది.

ఈ కార్యక్రమాన్ని అమలుజరపటానికి కొద్దికాలంతప్ప అట్టేకాలం తీసుకోలేదు. జరుగుతోన్న పరిస్థితుల్ని గూర్చి విప్లవవాదులమైన మాకు ఏవేవో గాలికబుర్లు అందుతున్నాయేగాని, స్పష్టమైన ఖచ్చితమైన సమాచారం చేరడంలేదు. యథార్థానికి విప్లవం దానంతటదే ఒక్కసారిగా మహోధృతంగా వస్తుందనీ, మాకు మేమే కొంతదూకుడు తగ్గించుకోని తమాయించుకోవాలనీ అనుకొన్నాంగానీ, అసలు విప్లవాన్ని ఉక్కు-పాదమే రెచ్చగొడ్తుందని కలలోగూడా అనుకోలేదు. అసలు జరిగిన సంగతిగూడా అదే. ఉక్కు పాదం అంతరంగికశాఖల్లోనుంచి కావాలని విప్లవం కలిగించారు. అదీ, చాలా రహస్యంగా చేశారు పైఎత్తు చాలా సమర్థనీయంగా నిర్వహించబడింది.

వెంటనే బయలుదేరి చికాగోకు పోమ్మని తాఖీదు అందేటప్పటికి నేను న్యూయార్కులో ఉన్నా. అతడి పేరు తెలియకపోయినప్పటికీ, అతడి మొగం కూడా చూడకపోయినప్పటికీ, నాకు ఈ ఆజ్ఞాపత్రాన్ని అందించిన వ్యక్తి, అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధినేతల్లో ఒకడని అతడి మాటల ధోరణినిబట్టి పసిబట్టా. అతడు నాకేమీ పొరపాటు కలగనంత స్పష్టమైన సూచనలు అందజేశాడు. మా పథకం గుర్తించి, తిరుగుదెబ్బ తీశారన్నది ఆ వాక్యాల మధ్యలో సుస్పష్టంగా నాకు గోచరించింది. మెరుపు మెరిసినట్లుగా దూకడానికి బాంబులు సిద్ధపడ్తున్నయ్. నాతో కల్పుకోని అసంఖ్యాకంగా ఉన్న ఉక్కుపాదం ఏజెంట్లు, చికాగోలోనే ఉండనీయండి, లేక అక్కడికి పంపబడుతున్నవాళ్లుగానీయండి, ఆ మెరుపుకు దోహదం చేయాలి. నా మీద అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వానికి అనుమానం కలగకుండా తొట్రుబాటులేకుండా ఉండకలిగినందుకు నాకు నేనే ఎంతగానో మెచ్చుకున్నా. కానీ, నా గుండెలుమాత్రం అమిత వేగంతో కొట్టుకుంటున్నయ్. అతడు దారుణాతిదారుణాలైన ఆ సూచల్ను నాకు అందివ్వడం పూర్తిచేసే లోపల్నే, ఒక్కపొలికేకపెట్టి, అతడి మెడ రెండుచేతుల్లో ఇరికించుకొని నులిమేసి ఉండేదాన్నే.

అతడు పోవడంతోటే, ఇంకెంత సమయం ఉందా అని చూశా. రైలెక్కేలోపల స్థానిక నాయకుడితో ఎవరితోనైనా కలుసుకొని మాట్లాడే అదృష్టం ఉంటే, ఇంకా కొద్దిక్షణాలకాలంమాత్రం అవకాశం ఉంది. నన్నెవళ్ళూ వెన్నాడకుండా జాగ్రత్తపడ్తూ, ఒక్కపరుగున ఎమర్జెన్సీ ఆస్పత్రికి పోయా. అదృష్టం కలిసివచ్చింది. అక్కడి ప్రధాన వైద్యుడు కామ్రేడ్ 'గాల్విన్' దగ్గరకు పోయే అవకాశం కలిగింది. ఒక్క గుక్కలో సమాచారమంతా చెప్పడానికి ఉపక్రమించానో లేదో ఆగమన్నాడు.

‘‘ఇంతకు ముందే అంతా తెలిసింది నాకు. నీవు వచ్చిన విషయం కూడా తెలుసు. పదిహేను నిమిషాలక్రితమే నాకీ వార్త అందింది. అప్పుడే

అందరికీ అందజేశా. ఇక్కడి కార్మేడ్స్ ప్రశాంతంగా ఉండేటట్లు చూస్తాం. చికాగోను ఆహుతి చేయాల్సిందే. కానీ అది ఒక్క చికాగోతోటే ఆగి పోవాలి'' అని తన ఐరిష్ నేత్రాలు మిలమిల్లాడిపోతున్నా ప్రశాంతంగా మాట్లాడాడు.

''చికాగోకు వార్త అందజేయడానికి ప్రయత్నించావా?'' అన్నా.

ఆయన తలూపి, "తంత్రీవార్తా ప్రసారంలేదు. చికాగోను అష్టదిగ్బంధం చేశారు. అక్కడ అనేక నరకకూపం కాబోతున్నది.'' అన్నాడు.

ఒక్క క్షణం నిదానించాడు. ఆయన తెల్లటిచేయి పిడికిలి బిగించాడు. ఒక్క బొట్టు పెట్టాడు,

''దేవుడు మేలుచేస్తే, నేను కూడా అక్కడికి వస్తేనా!''

శైలుకి ప్రమాదమేమీ తటస్థించకుండా ఉంటే నేనే తగిన సమయంలో అక్కడికి జేరుతా. లేకపోతే అసలుసంగతి తెలుసుకొన్న రహస్య శాఖలోని మన కార్మేడ్స్ అక్కడికి చేరినప్పటికీ, దాన్ని ఆపడానికి ఇంకా అవకాశం ఉంది.'' అన్నా.

"లోపల్నే ఉండి వాళ్ళ కళ్ళల్లో మన్నుకొట్టావ్. అసాధ్యురాలివి'' అన్నాడు.

వినయంగా తలూపా.

''అది చాలా రహస్యం. లోపలున్న ప్రధాన . వ్యక్తులకు మాత్రమే ఈనాటివరకూ జరిగే పరిస్థితులు తెలుసు. మేమింకా అందాకా చేరుకోలేదు. అందుకే ఇంకా మేం ముసుగులో గుద్దులాటగా ఉండకతప్పిందిగాదు. ఎర్నెస్ట్ ఇక్కడ ఉంటేనా! ఇప్పుడాయన చికాగోలో ఉండిఉండవచ్చు. ఇంకేం అంతా బాగుంటుంది.'' అని సమాధానం చెప్పా.

డాక్టర్ గాల్విన్ తలూపాడు. ''చిట్టచివరగా ఆయన్నుగూర్చి తెలిసిన వార్త ఇది. ఆయన్ను బోస్టనుకో లేక న్యూహావెన్‌కో పంపారు. ఈ

శత్రురహస్యశాఖ ఆయనను ఆటంకంగా ఉండిఉంటుంది. ఎట్లాగైనా, రహస్యాశ్రయంలో మ్రగ్గడంకన్నా ఇదే నయంగాదూ." అన్నాడు.

వెళ్ళడానికి లేచా. గాల్విన్ నా చెయ్యి ఒడిసి పట్టుకొన్నాడు. "బాగా గుండె నిబ్బరం కలిగిఉండు. మొదటి తిరుగుబాటు విఫలమైతేమాత్రం ఏం? రెండో తిరుగుబాటు చేద్దాం. అప్పుడింకా ఇంతకన్నా రాటుతేల్తాం శెలవు. శుభం భవతు. మళ్ళీ నిన్ను చూస్తానోలేదో కూడా తెలియదు. అక్కడ నరకం తయారుకాబోతుంది. నీవు దాంట్లో పాత్రవహించే అవకాశం ఉండటానికి నా ఆయుష్షులో నీకో పదేళ్ళుకూడా యిస్తా." ఇవి ఆయన వీడ్కోలుగా పలికిన మాటలు.

ఇరవయ్యో శతాబ్దం (ఆ నాడు ప్రపంచంలోకల్లా మహావేగంతో పరుగెత్తే రైలు పేరు) సాయంత్రం ఆరు గంటలకు న్యూయార్కును వదిలింది. తెల్లవారి ఏడు గంటలకల్లా చికాగో పోతుందట. కానీ ఆ రాత్రిమాత్రం చాలా ఆలస్యం జరిగింది. మేం మరోరైలు వెనకాల ప్రయాణం చేస్తున్నాం. నా 'పుల్‌మన్' లో ప్రయాణం చేస్తున్న వ్యక్తుల్లో కామ్రేడ్ హార్ట్‌మన్ ఒకడు. అతడూ నాను మాదిరిగానే ఉక్కుపాదం రహస్యశాఖలో పని చేస్తున్న వ్యక్తి. మా రైలుతోబాటే, కొంచెం ముందుగా నడుస్తోన్న రైలునుగురించి చెప్పింది నాకు అతడే. ముందున్న రైలు అచ్చగా మారైలుకు నకలు రైలు. కానీ దాంట్లో ప్రయాణీకులు మాత్రం లేరు. ఒకవేళ ఎవరన్నా ఇరవయ్యోశతాబ్దాన్ని బాంబుతో ధ్వంసం చేద్దామనుకుంటే, ఆ ఖాళీ రైల్నే దీనిగా భ్రమపడగలందులకు చేసిన ఏర్పాటన్నమాట ఇది. ఆ మాటకే వస్తే అసలు రైల్లో ఉన్నవాళ్ళే స్వల్పం. మా పెట్టెలో మొత్తంకలిపి డజను మంది ఉన్నాం.

"ఇంకా పెద్దపెద్దవాళ్లు ఉండవచ్చు. దీని వెనకాల ఒక ప్రత్యేకమైన రైలుపెట్టె చూచా." అన్నాడు హార్ట్‌మన్.

మొదటిదఫా మా రైలు ఇంజన్ మార్చుకొనేటప్పటికి కనుచీకటి పడ్డది. గాలిపీల్చుకోడానికీ, చూడగలిగినంతవరకూ విశేషాలు చూడడానికీ కొంచెంసేపు ప్లాటుఫారంమీద పచార్లు చేశా. ఆ ప్రత్యేకపు రైలుపెట్టెలో ఉన్న ముగ్గురు వ్యక్తుల్ని కిటికీలోగుండా చూచా. వెంటనే వాళ్ళను గుర్తించా. హార్ట్సమన్ చెప్పింది నిజమే. ఆ ముగ్గుర్లో ఒకడు జనరల్ ఆల్టన్ డార్ఫ. తక్కిన ఇద్దరూ మాసన్, వాండర్ బోల్టులు. వాళ్లు అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ అంతర్గత రహస్యశాఖకు జీవగఱ్ఱలు.

అది ప్రశాంతమైనవెన్నెలరాత్రి. నాకు మాత్రం ఏమీ ప్రశాంతతలేదు. కంటిమీద నిద్రబడ్తే ఒట్టు. తెల్లవారి ఐదు గంటలకల్లా పక్కచుట్టేసి, దుస్తులు ధరించా.

డ్రెస్సింగ్ రూమ్‌లో ఉన్న పనికత్తెను, రైలెంత ఆలస్య మైందని ప్రశ్నించా. రెండుగంటలని చెప్పింది. ఆమె సంకర వర్ణజాతి స్త్రీ. ఆమె కళ్ళక్రింద ముడతలు ఏర్పడ్డయ్. మొగంలో అలసట గోచరించింది. ఆమె నేత్రాల్లో ఏదోభయం వెన్నాడుతోంది.

"అట్లా ఉన్నావేం?" అని ప్రశ్నించా.

"ఎబ్బే! ఏమిలేదమ్మా! నాకు బాగా నిద్రపట్టలేదు. అందుకే అట్లా ఉన్నానను కొంటా." అని ప్రత్యుత్తర మిచ్చింది.

ఆమెను సమీక్షగా చూచా. మాసంకేతాల్తో ఆమెనుకదిలించా. ఆమె వెంటనే తగిన సమాధానం ఇచ్చింది. ఆమెను గూర్చి ఇక నాకు ధైర్యం కలిగింది.

"చికాగోలో ఏదో బ్రహ్మ ప్రళయం ముంచుకు రాబోతోంది. మన ముందర కృత్రిమపు రైలొకటుంది. అదీ, సైన్యాల రైళ్ళూ మన ఆలస్యానికి కారణం" అందామె.

"సైన్యపురైళ్ళూ? "అని ప్రశ్నించా.

ఆమె తలూపింది. "ఈ మార్గమంతా వాళ్ళతోటే క్రిక్కిరిసి ఉంది రాత్రంతా మనం వాళ్ళను దాటేసుకు వచ్చాం. వాళ్ళంతా చికాగో పోతున్నారు. విమానలద్వారా వాళ్ళను చేరవేయాలంటే వ్యయం. మరి వ్యాపార సరళి కూడా చూచుకోవాలిగా."

"నాకు చికాగోలో ఒక ప్రియుడున్నాడు. ఆయన మనవాళ్ళల్లో ఒకడు. బడితొత్తుసైన్యంలో చేరాడు. ఆయన్ను గూర్చే నేను ఆందోళన చెందుతున్నా." అంది.

ఆమె అభాగ్యురాలు. తిరుగుబాటుచేసిన మూడు పటాలాల్లో ఒకె దాంట్లో ఆయన ఉన్నాడు.

నాకూ, హార్ట్మన్‌కూ భోజనపు పెట్టెలో ఉదయపు భోజనం సిద్ధమైంది. నేనెట్లాగో నాల్గు మెతుకులు నంజాను. ఆకాశమంతా కారుమబ్బులావరించినై. నిర్జీవంగా ఉన్న మిగతా దినమంతా, ఉరుముల్లేని పిడుగుల మాదిరిగా మా రైలు దూసుకుపోతోంది. మాకు సేవకులుగా ఉన్న నీగ్రోలే ఏదో పుట్టిమునగబోతుందిరా దేవుడా అనే భావంతో ఉన్నారు. ఇంతకాలంగా వాళ్ళమీద స్వారిచేసిన పీడన ఇప్పుడు మరీ బరువెక్కి కూర్చుంది. వాళ్ళల్లో ఉన్న తేలికభావం వాళ్ళల్లోనుంచి ఉడాయించింది. మన్నుదిన్న పాముల్లాగా ఉన్నారు. పరధ్యానంలో మునిగిపోయారు. వంటరైలు పెట్టెకు అవతలగా ఉన్న పెట్టెలో ఒకమూలకుపోయి ఏదో గుసగుసలాడ్తున్నారు. హార్ట్మన్‌కు ఈ పరిస్థితిచూచేటప్పటికి నిరాశ జనించింది.

"మనం చేయగలిగిందేముంది?" అని భుజాలెగరేస్తూ నిస్పృహతో అతడు నన్ను ప్రశ్నించడం ఇది ఇరవయ్యోసారి.

కిటికీలోంగుండా చూపిస్తూ, "చూచావ్. అంతా సిద్ధంగా ఉంది. పట్టణానికి ముప్పై నలభైమైళ్ళ దూరంలో ప్రతిరాస్తామీద వాళ్ళను అట్టే ఉంచుతున్నారని నిస్సందేహంగా నిర్ధారించవచ్చు." అన్నాడు.

ప్రక్కనే ఉన్న సైన్యపు రైళ్ళనుగురించి అన్నమాట అతడుచెప్పింది. రైలంతైను ప్రక్కనే నేలమీద కుంపట్లు రాజేసుకొని ఉదయ భోజనాలు తయారుచేసుకొంటున్నారు వాళ్ళు. ఆఘమేఘాలమీద పోతోన్న మా రైలు వేపు విచిత్రంగా చూశారు.

మేం చికాగోలో ప్రవేశించేటప్పటికి అంతా ప్రశాంతంగానే ఉంది. ఇంకేమీ హడావుడీ జరగలేదన్నది స్పష్టంగా తేలింది. చుట్టుపక్కల స్టేషన్లలో ఉండగానే రైలుదగ్గరకి వార్తా పత్రికలు వచ్చినై. వాటిల్లో ఏమీ విశేషంలేదు. ఐనా, సామాన్యపాఠకుడికి గోచరించకుండా, కొంచెం నిపుణులైన పాఠకుడికి గోచరించే విషయాలు కొన్ని ఆ వార్తాపత్రికలోని వాక్యాల మధ్యలో కనపడ్డయ్. 'పత్రికలోని ప్రతి విషయంలో ఉక్కుపాదంహస్తం ప్రత్యక్షమౌతోంది. అల్పసంఖ్యాక నిరంకుశప్రభుత్వపు కవచంలోని బలహీనతను స్పష్టంచేస్తోంది. ఐతే, ఈ విషయాలన్నీ మరీ కొట్టవచ్చినట్లు కళ్ళకు కనబడటంలేదనుకోండి. ఈ బలహీనతను పాఠకుడు తన ఇష్టంవచ్చినట్లు వ్యాఖ్యానించుకోనేటట్లుగా న్నయ్ వార్తలు. అసలు ఉద్దేశంకూడా అదే. ఆ పని వాళ్లు చాలా తెలివితేటల్తో నిర్వహించారు. అక్టోబరు 27 వ తేదీ ఉదయపువార్తాపత్రికలు, కల్పనాసాహిత్యంలో ప్రముఖస్థానంవహించినై.

స్థానిక వార్తలు తెలియలేదు. అసలే విషయమే అన్నిటినీ తలదన్నిన విషయం. అది చికాగోకు మాయముసుగేసింది. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వానికి స్థానిక వార్త లందించడానికి దమ్ములు చాల్లేదన్న భావం సామాన్య పాఠకుడిలో కలిగింది. అబద్ధాలే అనుకోండి, స్వార్థపుముసుగు తగిలించి, కఠిన శిక్షావిధానాల్ని అనుసరించాలి అన్న సూచల్ను దేశమంతా వ్యాపింపజేసినై. ఆక్షేపంగా నిస్తంత్రీవార్తలయాలు బాంబుల్తో నాశనం చేశారన్న నివేదికలు వచ్చినై. నాశనకారుల్ని పట్టుకొన్నవాళ్లకు భూరి బహుమానాలు ఇస్తామని ప్రకటించారు. నిజానికి, ఒక్క నిస్తంత్రీ వార్తాలయం

కూడా ధ్వంసం కాలేదనుకోండి. ఇంకా ఇటువంటి తిరుగుబాట్లే చేశారని నమ్మేటట్లుగా కల్పించి, విప్లవవాదుల పన్నాగాలంటూ ప్రచారం చేశారు. తిరుగుబాటు ప్రారంభమైందన్న ఊహ చికాగోలో ఉన్న కామ్రేడ్స్‌ను కలగలందులకు చేసిన తతంగం ఇదంతా. పైగా, చాల విషయాల్లో కట్టి ఆందోళన కలిగించటం కూడా వాళ్ల ఉద్దేశం. అప్పుడే బ్రిద్ధశాతోన్న తిరుగుబాటుకు దేశమంతా పరిపక్వస్థాయికి వచ్చిందన్న అభిప్రాయం, అస్పష్టంగానైనా స్థిరంగా ఏర్పడకుండా ఉంచడం అసాధ్యమైన విషయం.

కాలిఫోర్నియాలోఉన్న బడితొత్తుసైన్యంలో అరడజను దళాలు విద్రోహం చేసి బయటికివచ్చినై అనీ, అందులో సభ్యుల్ని నాటుం బాల్తోసహా ఆ పట్టణాన్నుంచి, కార్మిక నివాసప్రాంతాలకు తరలించేటంత ప్రమాదం ముంచుకువచ్చిందనీ వార్తలు వచ్చినై. నిజానికి, తక్కిన బడితొత్తు సైన్యాలన్నిట్లోకీ, ఉత్సా. పులుసుతిన్న రణానికి కట్టుగాడిఉన్న సైన్యం కాలిఫోర్నియాకు సంబంధించిందొక్కటే. కానీ, ఇతర ప్రపంచంతో ఏ మాత్రం సంబంధంలేకుండా అష్టదిగ్బంధమైపోయిన చికాగోకు ఈ విషయం ఎట్లా తెలుస్తుంది. ఆ తర్వాత, న్యూయార్కు పట్టణంలోఉన్న జనం పెద్ద తిరుగుబాటుచేశారనీ, వాళ్ళతో కార్మిక కులాలు కూడా చేతులు కలిపినై అనీ ఒక టెలిగ్రాం వచ్చింది, అందులోనే, సైన్యాలు అలజడిని అదుపులోకి తెచ్చారనికూడాఉంది.

అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం, ఉదయం వార్తాపత్రికల ద్వారా చేసినట్లే, మరో వేయిమార్గాలద్వారా కూడా అట్లాగేచేసింది. ఈ అల్ప సంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం, రహస్యవార్తలు విప్లవవాదుల చెవులకెక్కాలందులకే రాత్రి మొదటి భాగంలో వ్యాపింపచేసిందన్న విషయం తర్వాత మాకు తెలిసింది.

''మనతో ఉక్కుపాదానికి అవసరం లేదనుకొంటూ. ఇక్కడకు మనల్ని పంపి అది కాలంవ్యర్థం చేసింది. అది అనుకొన్న దానికన్నా దాని పథకాలు ఇంకా ఎక్కువ అభివృద్ధి చెందినై. ఏక్షణంలో నైనా మహానరకం ప్రత్యక్షం కావచ్చు. ''అని, రైలు సెంట్రల్ డిపోకు కదలడంతోటే, తాను చదువుతోన్న వార్తాపత్రిక క్రిందపెట్టేసి, హార్ట్‌మన్ అన్నాడు.

మేం క్రిందకు దిగడంతోటే, వెనక్కు తిరిగి అతడు రైలువేపు చూచాడు. ''వార్తాపత్రికలు రావడంతోటే, ఆ ప్రత్యేకపు రైలుపెట్టెను ఎక్కడ్నో వదిలేసి ఉంటారను కొంటున్నా.'' అన్నాడు మెల్లగా.

హార్ట్‌మన్ బాగా కుంగిపోయాడు. అతడిలో సంతోషం కలిగిద్దామని ప్రయత్నించా. కానీ అతడు నన్నేమీ పట్టించుకోలేదు. స్టేషను గుండా మేం పోతుండగా, ఆదుర్దాతో చిన్న గొంతుతో మాట్లాడడం మొదలు పెట్టాడు. నాకు అతడి ఆదుర్దా మొదట అర్థం కాలేదు.

''నాకేమీ నమ్మకంలేదు. నేనెవరికి చెప్పను గూడా చెప్పలేదు. కొన్ని వారాలనుంచీ కృషిచేస్తున్నా. కానీ ఘట్టిగా మాత్రం చెప్పలేను. 'నోల్టన్' మీద నిఘాఉంచు. అతణ్ణి అనుమానిస్తున్నా. మన కాందిశీకుల్లో చాలామంది రహస్యాలు అతడికి తెలుసు. వందలాది మన జీవితాలు అతడి గుప్పెట్లో ఉన్నయ్. అతడు విద్రోహి అనే నా సందేహం. అది నా మనస్సులో గాఢంగా హత్తుకొన్న భావం. కానీ, కొద్దికాలం క్రితం, అతడిలో ఒకమార్పు గుర్తించానని అనుకొన్నా. మనల్ని అతడు అమ్మేసైనా ఉండాలి, లేకపోతే అమ్మనైనా అమ్ముతాడు. అతడివల్ల ఈ ప్రమాదంఉంది. నేను దృఢంగా విశ్వసిస్తున్న విషయంఇది. ఈ నా అనుమానాన్ని ఇంతవరకూ ఎవరి చెవిలోనూ ఊదలేదు.ఎల్లగాగైతేనేం కానీ,చికాగోనుంచి బ్రతికిబయటపడగల్గుతానని మాత్రం నేను అనుకోవడంలేదు. నోల్టన్ మీద ఒక కన్ను వేసి ఉంచు. అతణ్ణెట్లాగైనా బుట్టలో వెయ్యి. అతడి విషయం బాగా తెలుసుకో, ఇంతకుమించి

నాకేమీ తెలియదు, ఇదంతా కేవలం నా మనస్సులో సహజంగా తోచిన ఊహ. ఈ ఊహకు కారణం కనుక్కొంటానికి ప్రయత్నించాగానీ, విఫలుణ్ణయినా." అప్పుడే. మేం కాలిబాట ఎక్కబోతున్నాం. "జ్ఞాపకం ఉంచుకో. నోల్టన్ మీద ఒక కన్నువేసి ఉంచు." అని హార్ట్‌మన్ కుతూహలంతో మాట్లాడాడు.

హార్ట్‌మన్ అనుమానం అక్షరాలా నిజమని తేలింది. ఒక నెల గడవక ముందే నోల్టన్ తన విద్రోహచర్యకు ప్రతిఫలంగా ప్రాణాలు కోల్పోయాడు. 'మిల్ వాకీ' లో ఉన్న కామ్రేడ్సు అతణ్ని పట్టుకొని ఉరితీసేశారు.

వీధులన్నీ ప్రశాంతంగా ఉన్నయ్. చాలా ప్రశాంతంగా ఉంది వాతావరణం. చికాగో నిర్జీవమైందా అన్నట్లుంది. మనుష్యుల రాకపోకలుగాని, అలజడిగానిలేదు. ఆఖరికి గుర్రపుబగ్గీలుకూడా వీధుల్లో కనిపించటంలేదు. మోటారుకార్లు ప్రయాణంచేయడంలేదు. కాలిబాటలమీద మాత్రం, ఒకడో ఆడో అడపా దడపా కనపడ్తున్నాడు. కానీ ఆ కనపడ్డవాళ్ళుకూడా హడావుడిగా పోతున్నారేగాని తాపీగా ఉన్నవాళ్ళెవర్నూలేరు. ఏదో ప్రత్యేక ఉద్దేశంలో వెళ్తున్నారుగాని, ఆషామాషిగా ఎవ్వడూ ప్రయాణంచేయడం లేదు. అనూహ్యంతంగా తమమీద భవనాలు కూలుతయ్యేమోననీ, తమ కాళ్ళ కింద భూమి కుంగిపోతుందేమోనని, తామే ఆకాశంలోకి అణువులణువులుగా ఉప్పున ఎగిరిపోతామేమోననీ, భయాందోళనలు వాళ్ళల్లో కనబడ్తున్నయ్. వాళ్ళ గమనంలో ఒక విచిత్రమైన అనిశ్చిత గోచరిస్తోంది. కొంతమంది అల్లరచిల్లర పిల్లకాయలగుంపు కనబడింది. ఏదో ఒక అద్భుతమైన, ఉద్రేకపూర్వకమైన విషయం సంభవిస్తుందనే ఆదుర్దా వాళ్ళ కళ్ళల్లో కనపడుతోంది.

దక్షిణంగా చాలా దూరంలో ఎక్కణ్నో బాంబు పేలిన-శబ్దం ఒకటి మందంగా వినిపించింది. అంతే. మళ్ళీ ప్రశాంతత. ధ్వనికి బెదురుచూపులు

మూచే లేడిపిల్లలు మాదిరిగా పిల్లకాయలు మాత్రం భయం భయంగా చూచారు. సౌధాల ద్వారాలన్నీ బందుచేశారు. కొట్లతలుపులు మూసివున్నాయి. ప్రమాదం ఏదో జరగబోతుందన్న అనుమానానికి తార్కాణంగా అక్కడక్కడా పోలీసులు, పహరాసైన్యం వుంది. అప్పుడప్పుడూ పహరాసైన్యం కార్లమీద మహావేగంతో దూసుకుపోతోంది.

స్థానిక నివాస్యశాఖాధిపతులకు మేం వచ్చినట్లు తెలియజేయడం అవసరం అని నేనూ హార్ట్‌మన్ ఉభయులం అంగీకరించాం. తర్వాత సంభవించే క్లిష్టపరిస్థితులవల్ల మేం వచ్చినట్లు తెలియజేయలేకపోవడం వాళ్లు ఎట్లాగూ క్షమిస్తారు. అందుకని, మా కామ్రేడ్స్‌లో కొంతమందితో పరిచయం చేసుకొందామని, దక్షిణంగా వున్న పెద్ద కార్మిక నివాసప్రాంతానికి వెళ్లాం. ఇప్పటికే ఎంతో ఆలస్యం జరిగిందని మాకు తెలుసు. కానీ, ఉలుకూ పలుకూ లేని పెనుభూతాల్లాంటి ఆ వీధుల్లో ఏమీ చేయకుండా నిర్లిప్తంగా ఉండలేం ఇంతకూ ఎర్నెస్టు ఎక్కడున్నట్లు? నాకు చాలా ఆశ్చర్యం కలుగుతోంది. కార్మికకులాలూ, బడితోస్తుసైన్యాలూ వున్న పట్టణాల్లో ఏం జరుగుతున్నట్లు? మరి కోటల్లోనో ?

నాలో బైలుదేరిన ప్రశ్నలకు సమాధానంగానో అన్నట్లు, చాలా దూరంలో ప్రజల పెద్దపెద్ద అరుపులూ కేకలూ వినిపించాయి. ఉండి ఉండి పెళ్ పెళ్ మని ఏవో బద్దలైనట్లు వినిపించింది.

"అది కోటలో బైలుదేరిన గణగణధ్వని. దేవుడు ఆమూడు సైనిక దళాన్నీ దయజూచుగాక!" అన్నాడు హార్ట్‌మన్.

ఒక బజారుదాటి పోతున్న సమయంలో, సరుకుల గిడ్డంగివున్న దిశలో బ్రహ్మాండమైన పొగను చూచాం. మరో బజారు దాటుతున్నప్పుడు, ఇట్లాగే చాలా పొగ, మేఘాలుమేఘాలుగా ఆకాశంలోకి పోవడం చూచాం. మేం చూస్తూచూస్తుండగానే, బడితోస్తు సైన్యాలున్న పట్టణంమీద ఒక

ఉక్కు పాదం.

పెద్ద యుద్ధపు బెలూన్ పగిలి మంటలు గ్రక్కుతూ భూమిమీద పడిపోయింది. ఆ కాళంలో జరిగిన ఈ దారుణానికి కారణం ఏమిటో తెలియదు. ఆ బెలూన్ శత్రువులే వేశారో మరి మిత్రులే వేశారో తెలియదు. తర్వాత, బ్రహ్మాండమైన ఫిరంగి పగిలినట్లు ఒక అస్పష్టమైన ధ్వని మాచెవుల బడింది. అవి మెషిన్ గన్‌లూ, ఆటోమెటిక్ తుపాకులూ అని హార్ట్‌మన్ చెప్పాడు.

ఇక మేం తక్షణమే ప్రశాంత ప్రదేశానికి వెళ్ళాం. మేం ఉన్నచోట ఏ అలజడీ లేదు. పోలీసులూ, పహారా సైన్యాలూ, కార్లమీదా వస్తూపోతున్నారు. ఎక్కడ్నో గాని మంటలార్పేసి అటూ ఇటూ అగ్నిమాపక యంత్రాలు పరుగులు తీస్తున్నయ్. ఒక కార్లో ఉన్న ఉద్యోగి, ఒక ఫైర్మన్‌ను ప్రశ్నించాడు. అతడు, "నీళ్ళులేవు. ముఖ్య జలాశయాలన్నీ బాంబుల్తో నాశనం చేశారు." అని పెద్దగా సమాధానం చెప్పడం వినిపించింది.

"నీళ్ళ సరఫరాను మనం నాశనం చేశాం. తగిన తరుణం రాకుండానే, ఒంటరిగా ఎచ్చిపిచ్చి ప్రయత్నాలవల్లనే మనం ఇదంతా చేయగల్గితే, తగిన తరుణం వచ్చినప్పుడు, ఒక క్రమశిక్షణతో మనం దేశంలో ఇంకేమి చేయలేం !" అన్నాడు హార్ట్‌మన్.

ప్రశ్న వేసిన ఆఫీసరు కారు బైలుదేరింది. వెంటనే చెవులు చిల్లులు పడేటట్లు పెద్ద గర్జారావం వినిపించింది. మనుష్యుల్తోసహా కారు ఒక్కసారిగా, పైకిలేచిన పోకతో తానూ పైకిలేచి ఛిన్నాభిన్నమై, అందులోఉన్న వాళ్ళంతా చచ్చి, నేలమీద కుప్పకూలింది.

హార్ట్‌మన్ చాలా ఉత్సాహంలో ఉన్నాడు. "బలేజరిగింది! బలేజరిగింది నాసామిరంగా! ప్రొలిటేరియన్లు ఇవ్వాళ గుణపాఠం నేర్చుకొన్నారు. అంతేకాదు, నేర్పారుకూడా." అని అనేక పర్యాయాలు మందస్వరంలో మాట్లాడాడు.

ప్రమాదం జరిగిన చోటుకు పోలీసులు పరుగెత్తుకు వస్తున్నారు. ఇంకొక పహారాసైన్యంఉన్న కారుకూడా వచ్చిఆగింది. నామటుకు నేను అయోమయ పరిస్థితిలోఉన్నా. అకస్మాత్తుగా జరిగిన సంఘటనలకు నిర్ఘాంత పోయా. ఇదంతా ఎట్లా జరిగింది? ఎట్లా జరిగిందో నాకు తెలియదు. ఐనా దానివేపే చూస్తున్నా. ఆక్షణంలో, మమ్మల్ని పోలీసులు పట్టుకొన్నారన్న జ్ఞాత్వాకూడాలేని అయోమయ పరిస్థితిలోఉన్నా. హార్ట్‌మన్ కోసం చూశా. సరిగ్గా అప్పుడే ఒక పోలీసు అతణ్ణి కాల్చబోతున్నాడు. కానీ, హార్ట్‌మన్ మాత్రం చాలా ప్రశాంతంగా ఉండి, మేమెవళ్ళమో తెలియచెప్తున్నాడు. గురిపెట్టిన రివాల్వర్ తొందరపడుతోంది. ఎందుకోగాని మళ్ళీ చడీచప్పుడు గాకుండా తలదించుకొంది. పోలీసువాడు విసుగుతో పెట్టిన వెర్రికేక విన్నా. అతడు చాలా కోపంతో ఉన్నాడు. మొత్తం రహస్యశాఖను బండబూతులు తిడ్తున్నాడు. పానకంలో పుడకలాగా అడుగడుగునా అదే అడ్డంవస్తోందని ఆక్రోశిస్తున్నాడు. హార్ట్‌మన్ మాత్రం, రహస్యశాఖయొక్క గొప్పతనాన్ని ప్రశంసించి, పోలీసుల మట్టిబుర్రల్ని కొక్కిరించాడు.

మరు క్షణంలో ఆ ప్రమాదం ఎట్లా జరిగిందీ నాకు తెలిసింది. యంత్రం పాడైపడ్డచోట ఒకగుంపు చేరింది. గాయపడ్డ ఆఫీసర్ని మరో కార్లో ఎక్కించడానికి ఇద్దరు వ్యక్తులు అప్పుడే ఆయన్ను ఎత్తుతున్నారు. అక్కడున్న వాళ్ళందర్నీ ఇంతట్లోకే భయం చుట్టేసింది. అక్కడున్న వాళ్ళంతా గాభరాతో చెల్లాచెదురుగా పరుగెత్తారు. గాయపడ్డ ఆఫీసర్ని కూడా అక్కడే వదిలేశారు. నాపక్కనేఉండి బూతులు తిడ్తోన్న పోలీసులుకూడా పరుగెత్తుకుపోయారు. నేనూ, హార్ట్‌మన్ కూడా పరుగెత్తాం. ఎందుకు పరుగెత్తామో మాకే తెలియదు. అక్కణ్నుంచి వెళ్ళిపోవాలనే గుడ్డి భయంతో వెళ్ళాం. అంతే.

నిజంగా అప్పుడేం జరగలేదు. కానీ తర్వాత అంతా విప్పిచెప్పారు. గొప్పమందల్లాగా వైమానికులు తిరిగివస్తున్నారు. కానీ, చాలా కిటికీల్లో ఆకాశాన్నంటే గోడల్తో వీధికిరువైపులా ఉన్న పెద్ద పెద్ద భవనాలమీదనే వాళ్ల చూపులున్నాయి. అసంఖ్యాకాలైన కిటికీల్లో ఒకదాంట్లోనుంచి బాంబు వచ్చి ఉండాలి. కానీ అందులో ఏ కిటికీలోనుంచో? రెండో బాంబు పడలేదు. భయంకలిగించటానికి ఒక్కటే దూకింది.

ఆ తర్వాత ఏం జరుగుతుందో అని సాభిప్రాయంగా ఆ కిటికీలవేపు చూశాం. వాటిల్లో ఏ కిటికీలోనైనా మృత్యువు తిష్టవేసి ఉండవచ్చు. ప్రతి సౌధం మృత్యువుపొంచిన గృహం కావచ్చు. అధునాతన ఆరణ్యకమైన ఆ మహానగరంలో జరిగే ఆహవవిధానం ఇది. ప్రతివీధీ ఒక ఫిరంగి. ప్రతిసౌధం ఒక పర్వతం. యుద్ధశకటాలు జర జరా పరుగెత్తుకుపోతున్నాయ్. కానీ, ఆదిమ మానవుడినుంచి మేం ఆట్టే మారలేదు.

మలుపు తిరిగేటప్పటికి మాకు ఒక స్త్రీ కనిపించింది. ఆమె, కాలిబాటమీద నెత్తుటిమడుగులో పడిఉంది. హార్ట్‌మన్ వంగి ఆమెను పరీక్షించాడు. నామటుకు నాకు ముచ్చెమటలుపోసి ఉక్కిరి బిక్కిరై చచ్చేటంతపనైంది. ఆ రోజున నేను చాలామంది చావులు చూశా. కానీ, మొదటగా, కాలిబాటమీద నా కళ్లముందు చచ్చిన ఈ వ్యక్తిని చూస్తే కలిగినంత మానసిక పరిభావం ఆ తర్వాత కలగలేదు.

"గుండెల్లో కాల్చారు" అని హార్ట్‌మన్ చెప్పాడు. చిన్నపిల్లవాణ్ని గట్టిగా పట్టుకొన్నట్లుగా ఆమె చేతిలో అచ్చుకాగితాలకట్టేదో భద్రంగా పట్టుకొంది. తనకు చావుతెచ్చిపెట్టిన ఆ కాగితాల్ని మరణసమయంలోకూడా వదిలిపెట్టడానికి ఆమెకు మనస్కరించినట్లులేదు. హార్ట్‌మన్ ఆమె గుప్పెట్లో ఉన్న కాగితాల కట్టను ఎట్లాగో ఊడబెరికాడు. అప్పుడు చూస్తే, ఆ కాగి

తాలన్నీ విప్లవవాదుల ప్రకటనలు కలిగిన పెద్ద పెద్ద అచ్చుకాగితాలని తెలుసుకొన్నాం.

"కామ్రేడ్" అన్నా.

హార్ట్‌మన్ ఉత్పాదాన్ని తిట్టిమాత్రం ఊరుకొన్నాడు. మేం అక్కణ్ణుంచి వెళ్ళిపోయాం. మమ్మల్ని పోలీసులు, పహారాసైన్యం తరచు నిల వేసిందికానీ, మేం మా వ్యక్తిత్వాల్ని తెలియజేసి ముందుకు సాగిపోయాం. కిటికీల్లోనుంచి ఇంకా బాంబులు పడలేదు. కాలిబాటలమీద నడుస్తోన్న ఆఖరిసారి వాళ్ళుకూడా అదృశ్యమైపోయారు. చాలా దూరంలో పెద్దపెద్ద ఫిరంగులు మ్రోగుతున్నప్పటికీ, అన్ని వైపులనుంచీ బాంబులు పగిలిన శబ్దాలు వినిపిస్తున్నప్పటికీ, ఇంకా ప్రత్యక్ష సాక్ష్యాలుగా ధూమపర్వతాలు ఆకాశాన్నంటు తున్నప్పటికీ, మా తక్షణ ప్రశాంతత మరీ భరించరానిదైంది.

## 23

ఉన్నట్లుండి పరిస్థితులు మారిపోయినై. ఉద్రేకపూరిత వాతావరణం ఏర్పడింది. రెండు ... మూడు ... డజను మోటార్లు మహావేగంతో దూసుకుపోతున్నాయి. ఒక కారు మాంచి రవడితో గిర్రున మలుపు తిరిగి పెద్ద గంద్రగోళంగా వెళ్ళిపోయింది. మరి అది వెళ్ళిన మరుక్షణంలో ఒక బాంబుపడి పగిలి అక్కడ కాలిబాటంతా హూనాహూనమై పెద్ద గొయ్యి ఒకటి ఏర్పడింది. నాల్గు బాటలూ కలిసే చోటునుంచి పోలీసులు అంతర్థానమౌతున్నారు. ఏదో ఒక మహాప్రళయం ముంచుకురాబోతుందని మాకు తెలుసు. అంతఃంతకూ అమితమౌతోన్న ఆ గర్జారావాన్ని వినగలిగాం కూడా.

"ఫిరంగులు మన కామ్రేడ్స్ వస్తున్నారరుగో" అన్నాడు హార్ట్‌మన్.

చిట్టచివరి యుద్ధపు మోటారుకారు ఉసిగా పరుగెత్తిపోతుండగా, వీధుల్లో ఉన్న మురికికాలువల్లో మొగాలు చాటుచేసుకొన్న ప్రజాదళాల పరిధియ పంక్తిని మేం చూశాం. ఆ కారు సరిగ్గా మా ఎదురుగా ఒకక్షణ కాలం ఆగింది. చేతిలో ఏదో చాలా జాగ్రత్తగా పట్టుకొని, అందులోనుంచి ఒక సిపాయి బైటికి గెంతాడు. తనచేతిలో ఉన్నదాన్ని మళ్ళీ జాగ్రత్తగా అక్కడి మురికికాలువలో నిక్షేపించాడు. మళ్ళీ ఒక్క ఉరుకులో కార్లో వచ్చిపడ్డాడు. అంతే. కారు బైలుదేరి మూలతిరుగుడు తిరిగి కంటికి కనపడకుండా వెళ్ళిపోయింది. వెంటనే హార్ట్‌మన్ మురికికాలువ దగ్గరికి పరుగెత్తుకు పోయి వంగి చూచాడు.

"కావలనే ఉండు" అని హెచ్చరించాడు నన్ను.

అతడు తన చేతుల్తో ఏదోహడావుడిగా పనిచేస్తుండడం గమనించా. తిరిగి నా దగ్గరికి వచ్చేటప్పటికి, నుదురంతా ముత్యాల్లాంటి చెమటబిందువుల్తో, స్నానంచేసినట్లుగా ఉంది.

"దాని సంబంధాన్ని తీసేశా. సరిగ్గా సమయంలోనే చేశా. ఆ సిపాయి చచ్చుదద్దమ్మరకం. మన కార్మికుల్ని మట్టుపెట్టడానికే దాన్నక్కడ పెట్టాడు. కానీ, ఆ బాంబు బ్రద్దలుకావడానికి కావాల్సిన సావకాశమే చూచుకోలేదతడు. అనుకొన్న సమయంకన్నా ముందుగానే హఠాత్తుగా పగిలి ఉండేది. ఇప్పటికి చూచావూ, అది ప్రేలడ మంటూనే ఉండదు." అన్నాడతడు.

ప్రతివిషయం త్వరగా జరిగి పోతోందిప్పుడు. వీధిలో ఉన్న ఒక పెద్దసౌధంలో ఎత్తు కిటికీల్లోనుంచి కొన్ని తలకాయలు తొంగి చూస్తున్నయ్. వేలెత్తి ఆ తలకాయల్ని హార్ట్‌మన్‌కు చూపిస్తున్నా. ఇంతలో ఆ సౌధం మీదకి పెద్ద ఎత్తున మంటలుపొగ వ్యాపించినై. బాంబు పగలడంతో గాలి ఉక్కిరిబిక్కిరైంది. ఆసౌధానికి అక్కడక్కడా రాళ్ళూడి వాటిచాటున దాక్కున్న

ఇనప కట్టడం నేనున్నానని పైటికి కనిపించింది. మరుక్షణంలో, అవతల వీధిలో ఈ సౌధానికి సరిగ్గా ఎదుట ఉన్న సౌధంలో మంటలు, పొగ మళ్ళీ కనిపించినై. బాంబుల ధ్వనులమధ్య ఆటోమెటిక్ పిస్టల్సు, తుపాకుల ధ్వనులు వినిపించినై. కొన్ని నిమిషాల పాటు గాలిలో ప్రారంభించిన ఈ పోరాటం కొనసాగి తర్వాత అంతమైంది. ఒకసౌధంలో మాకామ్రేడ్సు, రెండో సౌధంలో బడితోస్తు సైన్యాలు ఉండి, ఉభయులూ వీధిమధ్యలో వీరవిహారం చేస్తున్నారని స్పష్టమైంది. కానీ, ఏసౌధంలో మా కామ్రేడ్సున్నారో ఏసౌధంలో సైన్యాలున్నవో మాత్రం చెప్పలేం.

సరిగ్గా ఇదే సమయానికి వీధిలోఉన్న దళం ఒకటి ఇంచుమించుగా మా మీదకు వచ్చినట్లు వచ్చింది. ఆ దళంలోని ముందరభాగం పరస్పర యుద్ధాలు సాగిస్తోన్న సౌధాల క్రిందగా పోతుండగా ఉభయసౌధాలూ మళ్ళీ యుద్ధానికి సిద్ధపడ్డయి. ఒక సౌధం వీధిలోకి బాంబు విసిరేసింది. అవతల వీధిలోఉన్న ప్రతిపక్ష సౌధం తిరుగుదెబ్బ తీసింది. మళ్ళీ మొదటిది ఎదురు జవాబు చెప్పింది. మా కామ్రేడ్సున్న సౌధం ఏదో ఇప్పుడు మాకు తెలిసింది. మా కామ్రేడ్సు, వీథుల్లోఉన్నవాళ్లను శత్రువుల బాంబులనుంచి రక్షించి చాలా మంచిపని చేసారు.

హార్ట్మన్, నా దండ చేతిని గభాల్న లంకించుకొని ఒక విశాలమందిర ద్వారప్రదేశానికి గుంజుకుపోయాడు.

"వాళ్లు మన కామ్రేడ్స్ కారు." అని చెవిలో అరిచాడు. ఆ మందిర ద్వారప్రదేశంలో లోపలవైపున్న తలుపులు తాళాలూ, గడియలూ వేసి బంధించబడినై. మేం ఎక్కడికీ తప్పించుకుపోలేం. మరుక్షణం, ఆ దళం ముందరిభాగం మా ముందునుంచి వెళ్ళిపోయింది. అదేదో అసామాన్యరకపు అల్లాటప్ప జనసమూహం కాదు. నగర వీథుల్ని ముంచెత్తిన అఖండ జనతరంగిణి అది. అది అథః పాతాళలోకంలో శోకంతో ఆక్రోశించే అనాథ జన

సందోహం. అనుభవించిన అన్యాయాలకూ, ఆస్వాదించిన మద్యానికీ మనస్సు చెడి మరింతగా విజృంభించి, సంఘాధినేతల రక్తపానం కోసం చండప్రచండ గర్జారావం చేస్తున్న సామాన్య జనసంఘం అది. ప్రజాసామాన్యం నివసించే ప్రదేశాల్లో తిరిగి ఇంతకుముందు నేను, అగాధ పతిత అనాథ జనసందోహాన్ని చూచా. వాళ్లను గురించి సంపూర్ణంగా తెలుసుకొన్నాననుకొన్నా. కానీ, అఖండ ప్రజానీకాన్ని అర్థం చేసుకొని దర్శించడం ఇదే ప్రథమ పర్యాయం అని ఇప్పుడు గ్రహించా. ఇప్పటిదాకా వాళ్లల్లో ఉన్న నోరులేని ఉదాసీనత, ఇప్పుడు నూరామడలుగా ఉడాయించింది. శక్త్యుత్సాహ సమ్మిళిత భయంకర దృశ్యం అది. అవును, అది కేవలం మనుష్యుల గుంపు కాదు. అది, ఆగ్రహోదగ్ర మహోత్తుంగ తరంగ సంగత స్రోతస్విని. నా కళ్లముందు కదిలి పారిన ప్రజావాహిని అది. ఆ తరంగిణి ఉవ్వెత్తుగా పొంగి ఉద్ఘోషించింది. దొమ్మీగాపోయి గిడ్డంగుల్ని దోచుకొని దొరికిన సారా దొరికినట్లు కడుపునిండా త్రాగి కదను త్రొక్కుతోన్న జనసమూహం అది. ద్వేషానల జ్వాలా రోషభీషణావేశ ప్రజాప్రవాహం అది. రక్తదాహాసక్తులై రంపిల్లుతోన్న జనం అది. ఆ ప్రజాప్రవాహంలో ఆడా మగా, పిల్లా జెల్లా, ముసలీ ముతకా అందరూ ఉన్నారు. అందులో ఉన్నది ఒకరేమిటి? దయాదాక్షిణ్యాలకు తర్పణాలిచ్చి మహాభయంకరంగా గోచరించే మందమతులున్నారు. ధరణి తల్లడించే పదఘట్టనల్తో ప్రయాణం చేస్తున్న పెనుభూతాల్లాంటి వాళ్లున్నారు. నెత్తురులేక పాలిపోయి క్షయతో క్షీణిస్తోన్న వాళ్లున్నారు. ఎలుగ్గొడ్డుల్లాగా వంటినిండా బొచ్చుకలవాళ్ళున్నారు. రాంఘోలు పొట్టిగా ళ్ళునారు. దయ్యంలాంటి సంఘం, జీవితసారం పీల్చి పిప్పిచేయగా, శుష్కించిన మొగాలు కలవాళ్ళున్నారు. సోమరిపోతుతనంతో, లంచగొండి విధానంతో, ఊరికే ఊరి ఊరి పిప్పళ్లబస్తాల్లాగా తయారైనవాళ్లూ ఉన్నారు. మురికిలో మునిగితేలంతోన వాళ్లున్నారు. పీఠాధిపతుల్లాగా మూరెడు మూరెడు గడ్డాల్తో మృత్యుముఖాలు కలవాళ్ళున్నారు. పొంగులువారుతోన్న యౌవ్వ

వంతో నవనవలావణ్యం కలవాళ్ళున్నారు. దయ్యాల మొగాలవాళ్ళున్నారు. కురూపులున్నారు. కుష్టువాళ్ళున్నారు. వికృత శరీరులున్నారు. వికలాంగులున్నారు. రోగిష్టిమారులున్నారు. రాక్షసులున్నారు. ఆహారంలేక దీర్ఘవ్యాధుల్తో దినదినగండంగా, బ్రతుకుబరువుమోయలేని బలహీనులున్నారు. అప్రయోజకులున్నారు. నిష్ప్రయోజకులున్నారు. ఆక్రందిస్తూ- ఆక్రోశిస్తూ- ఆర్భాటంతో అఖండంగా అసంఖ్యాకంగా అనుగమిస్తోన్న అనురాణీకం అది.

ఏం? తిరుగుబాటెందుకు చేయగూడదు మరి? అనాథ జనసందోహం అంతగా పోగొట్టుకొనేదేముంది?- నికృష్ట బాధామయ జీవితంతప్ప— ఇంతకూ వాళ్ళ వళ్ళోవచ్చి ఒరిగి పడేదేముంది.? —అంతిమ భయంకర ప్రతీకార సంతృప్తి తప్ప— ఆ మహాదృశ్యాన్ని దర్శిస్తుంటే, ఘాతుక మృగాన్ని రెచ్చగొట్టి దాన్ని దుర్కొనే పనిలో శత్రువు సతమతమయ్యేటట్లు చేసే. మహోద్దేశాలతో, ప్రయాణం చేస్తున్న పురుషులూ, కాత్రమేద్సు, వీరులూ, పరుగులు తీస్తోన్న ఆ ప్రజామాహంలో ఉన్నారన్న ఊహ వచ్చింది నాకు.

ఇప్పుడు నాకొక విచిత్ర విషయం తటస్థించింది. ఒక మహత్తర పరిణామం నాలో కలిగింది. నాకుగానీ, ఇతర్లకుగానీ మరణం వస్తుందన్న భయం నాలోనుంచి పూర్తిగా తొలగిపోయింది. మరో జన్మలో మరో ప్రాణినై, అపూర్వంగా అధికస్థానం అధిష్టించా. నాకే విషయం పట్టలేదు. ఈ ఒక్కసారికీ మన ఆశయం విఫలమైంది. కానీ, నవనవోన్మేషమై ఇదే ఆశయం మళ్ళీ మహోజ్జ్వలంగా ఇక్కణ్ణే తప్పకుండా ప్రకాశిస్తుంది. ఇక్కణ్ణుంచి, ముమ్మరంగా చెలరేగిన మహాభయంకర వాతావరణంలో, ఏ విధమైన ఆందోళనాలేని ప్రశాంతమైన ఆశక్తి చూపించగలిగా. చావన్నా, బ్రతుకన్నా సమానమే అన్న దృష్టి ఏర్పడింది. జరిగే పరిస్థితుల్ని కుతూహలంతో దర్శిస్తున్నా. ఒక్కొక్కప్పుడు ఆ మహాప్రవాహవేగంలో కలిసి నేనూ విచిత్ర పాత్ర స్వీకరించా. ఎందుకంటే, నామనస్సు ప్రశాంత వాతావరణంలోకి పరిక

మించి, రాగద్వేషరహిత నిర్గుణానంద బ్రహ్మత్వం పొందింది. ఆ పరిస్థితే నాకు సంభవించకపోతే, నేను తప్పకుండా చచ్చిఉండేదాన్నే అనేట్లాగా ఉండేది నాకు.

ఒక అరమైలు పొడవు జనప్రవాహం ముందుకు వెళ్ళిపోయిన తర్వాత గాని, మమ్మల్ని ఆ వ్యక్తి కనుక్కోలేకపోయింది. చప్పిదవడలుపడి, లోతుకు పీక్కుపోయి నిప్పులు గ్రక్కే కళ్ళతో, చిరుగుపేలికల్లోఉన్న స్త్రీమూర్తి ఒకతె, నా మీదా, హార్ట్‌మన్ మీదా తన దృష్టుల్ని ప్రసరించింది. ఆమె కెవ్వన కేకవేసి మా మీదకు విరుచుకుపడింది. గుంపులోనుంచి కొంతమంది జనం చీలి ఆమె వెంటనే తోసుకొని వచ్చారు. నే నిప్పుడీ వాక్యాలురాస్తుంటే ఆ నాటి స్త్రీమూర్తి కళ్లకు కట్టినట్లు కనబడుతోంది. ఒక్కదూకు దూకింది. ఆమె నెరిసిన వెంట్రుకలు జడలుగట్టి గాలిలో ఊగులాడుతున్నయ్. నెత్తి మీద ఎక్కణ్ణో ఏర్పడ్డ గాయంలోనుంచి ఆమె నుదుటిమీదగా నెత్తురు కారుతోంది. ఆమె కుడిచేతిలో గొడ్డలి — పూచికపుల్లలాగా ముడతలుపడ్డ ఎడంచేతిలో ఏదో వాడిగాఉన్న గద్దగోరులాంటి సాధనం — గాలిని చీలిక చేస్తున్నట్లుంది — హార్ట్‌మన్ నా ముందుకొక దూకు దూకాడు. ఆ, ఈ అని వ్యాఖ్యానాలు చేయడానికిగాని, అదీ ఇదీ అని అర్థాలు చెప్పడానికిగాని తగిన సమయం కాదిది. మేం మంచి దుస్తుల్లో ఉన్నాం. చాలు. అదే చాలు. మంటలు గ్రక్కుతోన్న ఆమె మొగంమీద ఒకగుద్దు గుద్దాడు. ఆ దెబ్బతో ఆమె తన వెనకఉన్న జనంమీదకు అమాంతం పోయిపడి, మళ్ళీ ముందుకు ఒక్క ఉదుటున లంఘించింది. నిస్సహాయస్థితిలో పడిపోయింది. ఆమె చేతిలోఉన్న గొడ్డలి హార్ట్‌మన్ భుజంమీదకు జారిపడింది.

ఏంజరుగుతుందో నాకు మరుక్షణంలో తెలియలేదు. నా మీదకువచ్చి గుంపొకటి విరుచుకు పడింది. ఆ ప్రదేశమంతా ఛీ ఛీల్తో, అరుపుల్తో, కేకల్తో, తిట్లతో తిమ్ముల్తో ప్రతిధ్వనించింది. నా మీద పిడిగుద్దులవర్షం

పెద్ద పెట్టున పడుతోంది. కొన్ని చేతులు నా దుస్తుల్నీ నా మాంసఖండాల్నీ చీల్చి చెండాడుతున్నయ్. నన్ను ముక్కలు ముక్కలుచేస్తున్నారనిపించింది. జనం నా మీదకు ముసురుతున్నారు. ప్రాణం ఉక్కిరి బిక్కిరౌతోంది. ఏదో ఒక బలమైన చెయ్యి నా భుజాన్ని లంకించుకొని, గట్టిగా నొక్కుతూ మహాభయంకరంగా నన్ను పడగుంజుతోంది. ఆ ఒత్తిడికీ, బాధకూ సొమ్మసిల్లిపోయా. ఆ మార్గంలోనుంచి మళ్ళి హార్ట్‌మన్ రాలేదు. అతడు నాకు అడ్డుపడి, మొట్టమొదటిదెబ్బ రుచిచూచాడు. ఇది నన్ను రక్షించింది. ఎందుకంటే, ఆజనసమ్మర్థం మరింత ఎక్కువైనందున, నన్ను పట్టుకొని గక్కడం తప్ప మరే ప్రమాదం కలిగించలేకపోయింది.

మహోద్ధృత సంచలన మధ్యంలో నేను ప్రవేశించా. నా చుట్టూ ఉన్నదంతా అదే సంచలనం. గమ్యస్థానం ఏదో తెలియకుండానే మహా వేగంతో ప్రవహిస్తున్న ప్రజావాహిని మధ్యలో నేనూ పోయా. నా చెక్కిళ్ళమీద కొత్తగాలి ప్రసరిస్తోంది. నా ఊపిరితిత్తుల్ని ఆ గాలి కొరికేస్తున్నట్లనిపించింది. సగం తెలివి సగం మైకంలో ఉన్నా. ఏదో ఒక బలిష్ట హస్తం నా చేతులకిందగావచ్చి నడుం చుట్టేసి, కొంచెం ఎత్తిపట్టుంచి నన్ను ఆ జనసమూహంతోపాటు లాక్కుపోతున్నదన్న సంగతిమాత్రం తెలుసుకొన్నా. బలహీనమైన నా వేళ్ళే నాకు కొంచెం సహాయంచేస్తున్నయ్. నా ముందు నడిచిపోతున్న వ్యక్తి వీపుమీది కోటు కనబడుతోంది. ఆ కోటు, పైనుంచి క్రిందదాకా సరిగ్గా మధ్యకు చిరిగి ఉంది. ఆ వ్యక్తి ఒక్కొక్క అడుగేస్తుంటే ఆ చిరుగు ఒక లయప్రకారం ముడుచుకొంటోంది, తెరుచుకొంటోంది. ఈ దృశ్యం నాకు కొంచెంసేపు కుతూహలంగా ఉంది. అప్పుడే నాలో చైతన్యం కోలుకొంటోంది. తర్వాత నా చెక్కిళ్ళూ, ముక్కూ బాగా గాయాలైనై అన్న స్పృహ కలిగింది. నా మొగం మీద నెత్తురు కారుతోందన్న జ్ఞానం కలిగింది. నా టోపీకాస్తా ఎక్కడనో ఎగిరి

పోయింది. నా నెత్తిమీదిజుట్టు కిందకు జీరాడుతోంది. గాలిలో అటూ ఇటూ గంతులేస్తోంది. నా నెత్తిమీద గాయాన్నిబట్టి, ద్వారంలో నా బుజాలునొక్కి నా జుట్టుపీకినవ్యక్తి గుర్తుకువచ్చాడు. నా గుండె, చేతులూ రణగాయాలైనై. ఎక్కడ చూచినా నొప్పులే.

నాకు సంపూర్ణచైతన్యం వచ్చింది. వెనక్కు తిరిగా. పరుగెత్తా. నన్ను పట్టుకువస్తోన్న మనిషిని చూచా. నన్ను అవతలకు పడగుంజి రక్షించిన వ్యక్తి అతడే. అతడు నా చలనాన్ని గుర్తించాడు.

“మంచిదే. చూడటంతోటే నీవెవరవో తెలుసుకొన్నా.” అని కర్కశస్వరంతో గావుకేక పెట్టాడు.

అతడెవరో గుర్తించలేకపోయా. అతడితో మట్లాడ్దామనుకొంటున్నా. కానీ నేను ఏదో ఒక సజీవ పదార్థంమీద అడుగేశా. ఆ ప్రాణి నా పాదం క్రింద మెలికలుతిరిగి పోతోంది. నా వెనకనుంచివచ్చే జనసమ్మర్దంలో ముందుకు నెట్టుకుపోయా. కానీ నిలబడి వంగిచూచే అవకాశమేలేకపోయింది. ఐనా ఆ వ్యక్తి ఒక స్త్రీ అని గుర్తించా. ఆమె క్రిందపడిపోయింది. కొన్ని వేల పాదాలు ఆమెను ఆ కాలిబాటమీద తొక్కుకుంటూపోతున్నయ్.

‘మంచిది. నేను గార్త్‌వైట్‌ను” అన్నాడతడు మళ్ళీ.

గడ్డం పెంచాడు. శల్యావశిష్టుడైఉన్నాడు. మురికికంపుకొడ్తున్నాడు. కానీ, మూడు సంవత్సరాలక్రితం, ‘గ్లెన్ ఎలెన్’ రహస్యాశ్రయంలో చాలా నెలలు మాతోబాటు నివసించిన ధైర్యసాహసోపేతుడైన బలిష్ఠ యువకుడే ఇతడు అని జ్ఞాపకం చేసుకొనేటప్పటికి, చెప్పొద్దూ, నా తాతలు తెలుపుకు వచ్చారు. తానూ ఉక్కుపాద రహస్యశాఖా ఉద్యోగినే అని గుర్తుగా నాకు సంకేతం చేశాడు.

“నాకు అవకాశం దొరికినవెంటనే నిన్ను దీంట్లోనుంచి బైటపడేస్తా” అని అతడు అభయం ఇచ్చాడు. “కానీ జాగ్రత్తగా అడుగేయ్! నీ జీవితంలో తప్పటడుగునేసి బోర్లపడేవుసుమా!” అన్నాడు.

ఆ రోజున అన్నీ అర్ధంతరంగానే జరిగిపోయినై. అట్లాగే జన ప్రవాహంకూడా మధ్యలోనే కొంత మాయమైంది. నా ముందున్న లావు పాటి స్త్రీకి పోయి అమాంతం గుద్దుకున్నా. (నా ముందింతకుముందున్న చిరుగుకోటాయన అంతర్ధానంచెందాడు) వెనకున్నవాళ్లువచ్చి నా మీదకు విరుచుకుపడ్డారు. రాక్షససంక్షోభవాతావరణం రాజ్యంచేసింది—నాలి అరు పులు—శాపనార్ధాలు — మరణాక్రోశాలు మరీమరీ వినిపించినై. అతడికంటె ఘనుడు అచంటి మల్లన్న అన్నట్లు, మీ ధ్వనులొకలెక్కా— చూచుకోండి మా తడాఖా అని మెషిన్‌గన్‌లూ, తుపాకులూ భీకర గర్జారావం చేసినై. మొట్టమొదట నా కేమీ అంతుచిక్కలేదు. నాకు, అటూ ఇటూ ప్రజలు నేలకూలుతున్నారు. నా ముందున్న స్త్రీ మరింత మూర్తియై, పిచ్చి ఆవేద నతో పొత్తికడుపు చేతో అదిమిపట్టుకొని క్రిందకు కుప్పకూలింది. నాళ్ళూ నరాలూ లాక్కొంటూ, నా కాళ్ళదగ్గరగా ఒక డెవడో మరణావేదనతో గింజుకొంటున్నాడు.

మేం ప్రజావాహినికి ముందున్నామన్న సంగతి తెలిసింది నాకప్పుడు. ఆ ప్రజాప్రవాహంలో అరమైలు పొడవు అంతర్ధనమైంది. ఎక్కడ ఎట్లా అదృశ్యమైందో అవగతం కాలేదు. ఆ అరమైలుపొడవునా ఉన్న జనం, ఏదోఒక దారుణ యుద్ధోజ్జృంభణకు ఆహుతైనారో, లేక వాళ్ళందర్నీ చెల్లాచెద రుగా తరిమి కొద్దికొద్దిగా చంపారో, మరి వాళ్ళే ఎక్కడకన్నా తప్పించుకు పోయారో ఏమో—ఈ నాటివరకూ నాకు తీరనిసమస్యగానే నిలచిపోయింది. కానీ, ప్రవాహంమధ్యలో ఉండవలసిన మేం ప్రవాహ ప్రథమభాగంలో ఉన్నాం. అదిమాత్రం నిజం. ఆక్రోశాల్తోకూడిన మహాప్రవాహనైతృత్వంలో మేం జీవితంనుంచి తుడిచిపెట్టుకుపోయాం.

మృత్యుదేవత, జనసమ్మర్దాన్ని పలచపరచినవెంటనే, ఇంకా నా చేతిని పట్టుకొని ఉన్న గార్త్‌వైట్, చావగా మిగిలినవాళ్ళ మధ్యలోనుంచి ఒక

ఆఫీసుసౌధ విశాలద్వారంలోకి పడలాక్కుపోయాడు. ఇక్కడ వెనక భాగంలో, ముక్కుతూ మూల్గుతోన్న ప్రాణిసమూహం, మమ్మల్ని తలుపులకు నొక్కేసింది. కొంతకాలంవరకూ పరిస్థితుల్లో ఏమీ మార్పులేకుండా, మేం ఇదే దశలో ఉన్నాం.

“నేనది చాల బాగా చేశా. నిన్ను సరిగ్గా తెచ్చి బోనులోపడేశా వీధుల్లో ఉంటే, మనకు, జూదగాడి మాదిరిగా జయాపజయాలెవరివో ఏమో నన్న దింపుడుకళ్ల ఆశైనా ఉండేది. కానీ, ఇక్కడ అసలా అవకాశమే లేదు. అరుపులూ గంద్రగోళంతప్ప, జరగాల్సిందంతా జరిగిపోయింది. చిర కాలం విప్లవం వర్ధిల్లుగాక!” అని గార్త్‌వైట్ నాతో సాద వెళ్ళబోసుకొన్నాడు.

ఆ తర్వాత అతడనుకొన్నది ప్రారంభమైంది. నిర్దాక్షిణ్యంగా బడితొత్తుసైన్యాలు మారణకాండ ప్రారంభించినై. మొట్టమొదట జనసమ్మర్దం మమ్మల్ని బాగా నొక్కేసింది. కానీ, మారణహోమం సాగుతోన్నకొద్దీ వత్తిడి తగ్గింది. చచ్చినవాళ్ళూ, చస్తోన్నవాళ్లూ నేలకొరుగుతూ మాకు కావలసినంత చోటు కలిగించారు. గార్త్‌వైట్ నా చెవిలో నోరుపెట్టి ఏదో పెద్దగా అరిచాడు. కానీ ఆ భయంకరఘోషలో అతడిమాట ఒక్కటీ అంతుచిక్కలేదు. అతడాగలేదు. నన్ను లంకించుకొని కిందపడేశాడు. తర్వాత చస్తోన్న ఒక స్త్రీని నామీదకు లాగి పైనపడేశాడు. తర్వాత అతడు నా ప్రక్కకుపాకి, కొంత నామీదా కొంత కిందగా ఒదుక్కొని పడుకొన్నాడు. చచ్చినవాళ్ళూ చస్తోన్నవాళ్లూ గుట్టలుగా మా మీద పడుతున్నారు. కుప్పకూలిన శవాలగుట్టలోనుంచి మూల్గుతూముక్కుతూ హత శేషం మెల్లిగా పాకిపోయారు. కానీ, కన్నుమూసి తెరిచేటప్పటికి వీళ్ల ప్రాణాలూ, హరీ అన్నయ్. ఆ తర్వాత అంతా నిశ్శబ్దమే. అప్పుడప్పుడూ మాత్రం ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకొని మూల్గులూ, చావు గురకలూ, గొంతు పిసుగుతూంటే వచ్చే గురగురధ్వనులూ వినిపిస్తున్నయ్.

గార్త్వైటే సహాయంచేయకబోతే, నే నెప్పుడో అప్పచ్చిలాగా చప్పగా అణిగిపోయి ఉండేదాన్నే. నే నంత బరువునుమోసి బైటపడగలిగానన్న విషయం, నిజంగా నమ్మడానికెక్కడా ఆస్కారంలేదు. ఇంతబాధా అనుభవిస్తోన్నప్పటికీ, నాలో మిగిలిన భావన ఒకటే. అది కుతూహలం. ఈ విప్లవం ఎట్లా ముగుస్తుంది ? అసలు చావంటే ఎట్లా ఉంటుంది ? ఆ చికాగో కసాయిదుకాణంలో నాకీ విధంగా జ్ఞానోదయం కలిగింది. అంతకుముందు నాకు చావంటే, తీరని సిద్ధాంతంగా ఉండేది. ఇక్కణ్నుంచి, మృత్యువంటే, అహోరాత్రులు ఆలోచించ నవసరంలేని సర్వసులభ సమస్యైంది నాకు.

కానీ, తాముచేసినదాంతో బడితొత్తుసైన్యాలు సంతృప్తిచెందలేదు. వాళ్ళు, ద్వారం దగ్గరికికూడా దండెత్తివచ్చారు. గాయపడ్డవాళ్ళ ఆయువు హరించారు. మాకు మాదిరిగా ప్రమాదానికి లోనుగాకుండా చచ్చినట్లు నటిస్తోన్న వాళ్ళను గాలిస్తున్నారు. నాకొక సంగతి బాగా జ్ఞాపకం ఉంది. ఒక గుట్టలోనుంచి వాళ్లొకణ్ణి పడలాగారు. పాపం అతడు ఎంతగానో ప్రాధేయపడ్డాడు. అతడి విజ్ఞప్తికి, వాళ్ళచేతిలోఉన్న తుపాకిగుండు సమాధానం చెప్పి, నోరు మూయించింది. ఇంకొక గుట్టలోనుంచి ఒక స్త్రీ, కాల్పులు సాగిస్తూ పెద్దగా గర్జించింది. ఆమెను వాళ్లు పట్టుకొనేలోపల ఆరు సార్లు కాల్చింది. ఆమె కాల్పులవల్ల జరిగిన నాశనం ఏమిటో మటుకు మాకు తెలియదు. జరుగుతోన్న ఈ మహా దారుణకాండంతా మేం కేవలం చెలరేగే శబ్దాలద్వారానే అర్థంచేసుకొన్నాం. ఉండి ఉండి ఇటువంటి ఉపద్రవాలే సంభవించినై. ప్రతి ఉపద్రవాన్ని పట్టుబట్టి తుపాకిగుండ్లు పరిసమాప్తం చేసినై. ఆఫీసర్ల తొందర్లల్తో శవాల గుట్టల్లో స్తనశల్యపరీక్షగా సమీక్షిస్తోన్న సిపాయీలు తమలో తాము మాట్లాడుకొంటున్న వాక్యాలూ, పెడ్తోన్న శాపనార్థాలూ మధ్య మధ్యలో మాకు వినిపించినై.

ఆఖరికి వాళ్లు మా కుప్ప గాలించడానికి ఎగబడ్డారు. మరణించిన వాళ్ళనూ, గాయపడ్డవాళ్ళనూ లాగిపారేస్తున్నకొద్దీ, మాకు అంతకుముందున్న

వత్తిడి కొద్ది కొద్దిగా తగ్గిపోతోంది. గార్త్‌వైట్, రహస్య సంకేతాల్ని బిగ్గరగా ఉచ్చరించడం ఆరంభించాడు. మొదట అతడిగోడు ఎవరికీ వినిపించలేదు. అప్పుడతడు గొంతు మరింత పెద్దదిచేశాడు.

“అదేదో వినండి!” అని ఒక సిపాయి అనడం విన్నాం. తర్వాత “ఆగండక్కడ! పోయేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండండి!” అన్న ఆఫీసరు తీవ్రకంఠం వినిపించింది.

మేం బైటకిలాగబడ్డప్పుడు విడిచిన మొదటి నిశ్వాసం అది! మొట్ట మొదట గార్త్‌వైట్ మాట్లాడేశాడు. ఉక్కుపాదం సేవకురాల్నే అని నిర్ధారణ చేసుకోడానికిమాత్రం నేను కొంత పరీక్షకు నిలబడక తప్పిందిగాదు.

“ఓహో! సంక్షోభకారకులైన ఏజెంట్లన్నమాట. మంచిది.” అని ఆఫీసరు అసలుసంగతి తేల్చాడు. అతడు గడ్డంలేని యువకుడు. సైనికుడు. అల్పసంఖ్యాక నిరంకుశ కుటుంబానికిచెందిన వ్యక్తి.

“ఎబ్బే! ఇది వట్టి భాడ్కో ఉద్యోగం. నేనీ ఉద్యోగానికి రాజీనామా చేసి, ఎట్లాగో సైన్యంలో ఇరుక్కుందామనుకొంటున్నా. మీకైతే ఎవరిమీదనైనా సరే విరుచుకుపడే అవకాశం ఉంది.” అని గార్త్‌వైట్ రుసరుసలాడాడు.

“నీకూ దొరుకుతుందిలే. నాకు కొంత పలుకుబడి ఉంది. నిన్ను సైన్యంలోకి లాగడానికి ప్రయత్నిస్తా. నిన్నెట్లా కనుక్కొన్నానో వాళ్ళకు చెప్తాలే.” అన్నాడు యువక ఉద్యోగి.

అతడు గార్త్‌వైట్ పేరూ, సంఖ్యా గుర్తించుకొన్నాడు. తర్వాత నా వైపు తిరిగాడు.

“మరి నీవో?”

“నేను పెండ్లిచేసుకోబోతున్నా. అప్పుడు అసలీ రభసనుంచే బైటబడ్తా.” అని ఆసామాషీగా సమాధానం చెప్పా.

గాయపడ్డావాళ్ళను ఒకచెంప చంపేస్తుంటే, మేం ఇట్లా మాట్లాడుకొన్నాం. ఇప్పుడు మళ్ళీ వెనక్కి తిరిగిచూస్తే, అదంతా ఒక స్వప్నంలాగా ఉంది. కానీ, ప్రపంచంలో అది చాలా సహజంగా జరిగిన విషయం. ఆధునిక యుద్ధంగా చెలామణి జరుగుతోన్న విధానాన్ని, ప్రస్తుతం వీధిలోజరుగుతోన్న పోరాటాన్ని ఆకాశయుద్ధాన్ని గూర్చి, గార్త్‌వైటూ, యువక ఉద్యోగీ మాంచి వాగ్ధోరణిలోబడ్డారు. చెదిరిన జుట్టును సర్దుకొంటూ, చిరిగిన గౌనుకు పిన్నులు పెట్టుకొంటూ, వాళ్ళ సంభాషణను శ్రద్ధాసక్తుల్తో ఆలకించా. ఇంత కాలం గాయపడ్డవాళ్ల హత్య సాగుతూనే ఉంది. అప్పుడప్పుడూ తుపాకుల కాల్పుల ధ్వనుల్లో గార్త్‌వైట్, ఉద్యోగుల కంఠాలు అణగారిపోవడంవల్ల, చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్పుకోవాల్సిన అవసరం వాళ్లకు కలిగింది.

చికాగో కమ్యూన్‌లో మూన్నాళ్లున్నా. ఆ మూన్నాళ్లూ నేను, అనాథజన సందోహంపై జరుగుతోన్న హత్యాకాండను, పరస్పర ఆకాశ యుద్ధతంత్రాన్ని తప్ప ఇంకేమీ చూడనేలేదంటే, ఆ నగరవైశాల్యాన్నీ, జరిగిన దారుణ మారణహోమాన్నీ మీరే ఊహించుకోండి. కామ్రేడ్సు చేసిన వీరశూర కార్యాలేవీ నాకు నిజంగా గోచరించలేదు. వాళ్ల గనులూ, బాంబులూ బ్రద్దలుకావడం విన్నా. వాళ్లు పెట్టిన మంటలూ. పొగా చూచా. అంతే. ఎట్లాగైతేనేం ఆకాశమధ్య యుద్ధం మాత్రం ఒకటి చూడగలిగా. అది ఏమిటంటే, మా కామ్రేడ్స్ కోటమీదకుచేసిన బెలూన్‌దాడి. అది రెండు రోజులు జరిగింది. అవిధేయులైన మూడు దళాల సైనికులూ ఆఖరివాడితో సహా అందరూ హతా హతమైపోయారు. కోటంతా బడితొత్తుసైన్యాలు నిండిపోయినై. గాలి సరియైన దిశలో వీచింది. నగరంలో ఒక ఆఫీసు సౌధంలోనుంచి, ఇక చూడండి నాయనా, మా బెలూన్లు ఆకాశంలోకి ఎగిరిపోయినై.

'గ్లన్ ఎలెన్' రహస్యాశ్రయం వదిలిపెట్టిన తర్వాత బియెడన్‌బక్, మాంచి శక్తిమంతమైన ఒక బాంబును కనిపెట్టాడు. దానికి 'ఎక్సపెడైట్'

అని నామకరణంచేశాడు. ఆ బెలూన్స్ ఉపయోగించే ఆయుధం ఇదే. అవి తొందర బిందర్లో ఏదోరకంగా తయారుచేసిన బెలూన్లు. ఐతే ఏం. అవి చేయాల్సినంత పనినీ చేసినై. ఒక ఆఫీసుసౌధం పైఅంతస్తునుంచి ఇదంతా చూశా. మొదటి బెలూన్ అసలు కోటమీదకు పోనేపోలేదు. కోట తప్పించి అది ఎక్కడికో అంతర్ధానమైంది. కానీ దాని సంగతి సందర్భం తర్వాత తెలిసింది మాకు. ఆ బెలూన్‌లో, 'బర్టన్' 'ఓ, సల్లివన్' ఉన్నారు. వాళ్ళు కిందకు దిగబోతున్న సమయంలో, చికాగోకు మహావేగంతో పరుగెత్తుకు వస్తోన్న ఒక సైనికుల రైలునుంచివచ్చిన గాలిదెబ్బకు సరిగ్గా ఆ రైలు నడినెత్తిమీదికి నెట్టుకుపోయిందా బెలూన్. వాళ్ళ బెలూన్‌లో ఉన్న మొత్తం 'ఎక్సపైడైట్' ను ఆ రైలుమీద కుమ్మరించారు. దానివల్ల ఏర్పడ్డ నష్టం ఎంతంటే, కొన్నిరోజులవరకూ రైళ్ళ రాకపోకలులేకుండా పూర్తిగా ఆ మార్గం బందైపోయింది. అసలు జరిగిన మంచి మరొకటుంది. 'ఎక్సపైడైట్' బరువుతగ్గిపోవటంచేత, తేలికై ఆ బెలూన్ గాలిలోకి ఎగిరిపోయి, ఆరుమైళ్ళ దూరం పోయేదాకా అసలు భూమిమీదకు దిగలేదు. ఇద్దరు వీరులూ కాలిగోరుకూడా చెక్కు చెదరకుండా లక్షణంగా తప్పించుకొన్నారు.

రెండో బెలూన్ నిష్ఫలమైంది. అది సరిగ్గా ఎగరలేదు. చాలా తక్కువ ఎత్తులో పోయింది. అది కోటకు చేరకముందే, దానికి చాలా చిల్లులు పడ్డయ్. దాంట్లో 'హార్టుఫోర్టు' 'గైనెస్' ఉన్నారు. వాళ్ళుపడ్డ పాలం, వాళ్ళూ అణువులణువులై ఆకాశంలోకి అదృశ్యమైపోయారు. బిరొడన్‌బక్ నిస్పృహచెందాడు. ఆ సంగతి సందర్భమంతా తర్వాతవిన్నాం. మూడో బెలూన్‌లో అతడొక్కడే ఎగిరిపోయాడు. అతడూ చాలా క్రిందగానే ప్రయాణించాడు. కానీ అదృష్టవంతుడనే చెప్పుకోవాలి. ఎందుకంటే అతడి బెలూన్ బ్రద్దలుకొట్టడంలో వాళ్ళు విఫలులైనారు. ఆమేడమీదనుంచి ఆనాడు చూచినట్లే మళ్ళీ ఆ దృశ్యం ఈనాడు నా కళ్ళకుకట్టి నిలుస్తోంది. ఆ బరువుసంచి గాలిలో వ్రేలాడ్తోంది - బక్కబలచని ఆ వ్యక్తి దాన్ని పట్టు

కోని క్రింద ఊగులాడ్తున్నాడు. నాకు కోట కనబడలేదు - కానీ నాతోబాటు కప్పుమీద ఉన్న జనం అతడు కచ్చితంగా కోటమీదనే ఎగురుతున్నాడన్నారు. దాన్నతడు వదులుచేసినప్పుడు ఆ 'ఎక్స్‌పెడైట్' పడడం నేను గమనించలేదు. కానీ, ఉన్నట్లుండి బెలూన్ ఆకాశంలోకి ఎగిరిపోవడం మాత్రం చూచా. అది జరిగిన కొంచెంసేపటికి గాలిలో అబాంబు పెద్దగా పగిలినమోత, దానితర్వాత దాని భయంకరధ్వని వినిపించింది. మేదకుడుగా ఉండే బియొడన్‌బక్ ఒకకోటను సర్వనాశనం చేశాడు. అదే సమయంలో మరో రెండు బెలూన్లు ఎగిరినై. ఎక్స్‌పెడైటే పగిలి అందులో ఒక బెలూన్ ముక్కలు ముక్కలైపోయింది. దాని తాకీడికి రెండో బెలూన్ దెబ్బతిని, మిగిలిన కోటలో పడిపోయింది. దాంట్లో ఉన్న ఇద్దరు కామ్రేడ్స్ తమ జీవితాల్ని త్యాగంచేసినా, అంతకన్నా బాగా చేయకలిగింది మరేమీలేదు.

ఇక అగాధనిమగ్నజన సందోహం విషయానికి వద్దాం. వాళ్ళతో నాకున్న అనుభవాలు స్థిరపడిపోయినై. వాళ్ళు కోపోద్రిక్తులై చెలరేగారు. దొరికినవాళ్లను పట్టుకొని నరికారు. నగరమంతా ధ్వంసం చేశారు. ప్రతిగా తామూ సర్వనాశనమైనారు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధినేతలున్న పట్టణ పశ్చిమప్రాంతానికి మాత్రం వాళ్ళు వెళ్ళలేక పోయారు. అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వాధికార్లు తమ్మునుతాము సురక్షితం చేసుకొన్నారు. పట్టణ మధ్యప్రదేశమంతా పాడైపోతేమాత్రం ఏం ? వాళ్ళూ, వాళ్ల పెళ్ళాలూ, బిడ్డలూ మాత్రం, గాయపడకుండా సురక్షితంగా ఉంటే చాలు, వాళ్లకు. ఆ మహాభయంకర దినాల్లో వాళ్ల పిల్లలు హాయిగా ఉద్యానవనాల్లో ఆడుకొని పాడుకొని ఆనందంగా విహరించారని విన్నా. 'శ్రామికుల్ని త్రొక్కివేయడం'. అనే ఆటను, వాళ్ళ పెద్దవాళ్లను అనుసరిస్తూ అత్యంతాసక్తితో ఆడుకొన్నారుట !

కానీ, అగాధపతిత అనాథజన సందోహాన్ని, ఎదుర్కొంటూ, అదే సమయంలో మా కామ్రేడ్సుతో పోరాడడం బడితొత్తు సైన్యాల వశం

కాలేదు. చికాగో తన పూర్వ సాంప్రదాయాలకు కచ్చితంగా నిలబడ్డది. అది, ఒక తరంతరం విప్లవాదుల్నే తుడిచిపెట్టేయ కలిగినప్పటికీ, దాంతో బాటే ఒక తరంతరం శత్రువుల్ని కూడా చుట్టబెట్టుకుపోయింది. ఉక్కుపాదం, అసలు సంఖ్యను బైటపెట్టలేదనుకోండి. ఐనా లెక్కలు తేలుస్తే, కనీసం నూట ముప్పైవేల బడితొత్తుసైన్యాలైనా బలై ఉంటాయి. కానీ, కామ్రేడ్సుకు సదవకాశం లభించలేదు. మొత్తం దేశమంతా చేయీచేయీ కలిపి, తిరుగుబాటు చేయడానికిబదులు, వాళ్ళొక్కళ్ళుగానే ఉద్యమించారు. అవసరమైతే, మొత్తం అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వ బలగమంతా దాని మీదకు వచ్చిపడేదే. జరిగిందేమిటంటే, గంటగంటకూ, రోజురోజుకూ రైళ్ళ కొద్దీ అంతూపొంతూలేకుండా బడితొత్తు సైన్యాలు చికాగో పట్టణంలోకి వచ్చి పడ్తున్నయ్.

ఐనా, అగాధపతిత అనాధ జన సందోహం ఇంకా అసంఖ్యాకంగా ఉంది! హత్యల్తో విసుగెత్తి సిపాయీలు మూక ఉమ్మడి ఉద్యమం ప్రారంభించారు. దాని ఉద్దేశమేమిటంటే, వీధుల్లో ఉన్న జనాన్ని గొర్రెలమందల్ని తోలినట్లు మిచిగన్ సరస్సులోకి తొంబగా తోలుకువెళ్ళడమన్నమాట. ఈ ఉద్యమ ప్రారంభసమయంలోనే నేనూ, గార్తువైటూ, ఆ యువక ఉద్యోగిని ఎదుర్కొన్నాం. మా కామ్రేడ్సుయొక్క బ్రహ్మాండమైన కృషికి చాలా అభివందనాలు సమర్పించాలి. ఎందుకంటే, ఈ గుంపుగా తోలుకు పోయే ఉద్యమం, వాళ్ళమూలకానే పూర్తిగా విఫలమైంది. చాలా పెద్ద తొంబను సమీకరించడానికి బదులు, బడితొత్తుసైన్యాలు, నలభైవేలమంది నికృష్టజీవుల్ని సరస్సులోకి నెట్టేటప్పటికి, తలప్రాణం తోకకు వచ్చింది. కొంత గుంపును చేతికి చిక్కించుకొని వీధుల్లోనుంచి వాళ్ళను సరస్సులోకి తోసుకుపోతున్నప్పుడల్లా మా కామ్రేడ్సు, సైన్యాలకు పరధ్యాస కల్పించే వాళ్ళు. అప్పుడాగుంపు తమను చుట్టిన వలలో ఒకచోటద్వారం చేసుకొని తప్పించుకుపోయేది.

ఈ యువక ఉద్యోగిని కలుసుకొన్న తర్వాత కొద్దిసేపట్లో నేనూ, గార్త్‌వైటూ ఇటువంటి సంఘటన ఒకదాన్ని చూచాం. మేమూ కలిసి ఉన్న ఒకగుంపు, వెనక్కి తిరిగి వస్తోండగా, తూర్పుకూ, ఉత్తరదిశకూ తప్పించుకు పోకుండా, సైనికబలాలు పకడ్బందీగా కాపలాలున్నయ్. మేం చిక్కుకొన్న సైనికదళం, పశ్చిమదిశను బంధించేసింది. ఇక మిగిలున్న మార్గమల్లా ఉత్తరం. మెషిన్‌గన్‌ల మంటలూ, ఆటోమిటిక్ రివాల్వర్లు గర్జారావాలూ తూర్పు, పశ్చిమ, దక్షిణ దిశలనుంచి తరుముకువస్తుంటే, ఆ జనసమూహం సరస్సున్న ఉత్తర దిక్కుకు తోసుకుపోతోంది. తనను అమాంతంగా సరస్సులోకి నెట్టేస్తుందని ఊహించిందో, మరి అది రాక్షస విజృంభణమో కాని నాకు తెలియదు. ఎందుకైతేనేంగాని ఆగుంపు పడమటిగా ఉన్న వీధి కడ్డంగాబడి, అక్కణ్ణుంచి పక్కవీధిలోకి తప్పుకొని, పూర్వం తానువచ్చినబాటనే బడి దక్షిణంగా కార్మిక నివాసప్రాంతాలకు కదిలింది.

వీధిపోరాట ప్రాంతంనుంచి తప్పించుకొని బైటపడదామని పశ్చిమంగా మార్గం చేసుకొని పోవడానికి నేనూ, గార్త్‌వైటూ, ఆ సమయంలో ప్రయత్నిస్తున్నాం. సరిగ్గాపోయి మళ్ళీ మందిలో ఇరుక్కున్నాం. మేం మూలకు చేరుకొనేటప్పటికి, పెద్ద పెట్టుగా అరుస్తోన్న జనసమూహం మా మీదకు విరుచుకుపడబోతోంది. గార్త్‌వైట్ నాచేతినిపట్టుకొన్నాడు. మేం ఇక పరుగెత్తబోతున్నాం. ఆ ప్రదేశానికి దూసుకువస్తోన్న మెషిన్ గన్లతో నింపిన ఆరు యుద్ధపు మోటారుకార్లు ఎదురుకావడంవల్ల, నన్నాతడు వెనక్కు పడగుంజాడు. వాటి వెనకాల్నే ఆటోమెటిక్ తుపాకులుధరించి సిపాయీలు వచ్చారు. ఆ శకటాలు అసలు ప్రదేశాన్ని చేరుకొనేలోపల్నే జనసమూహం వాటిమీదకు ఎగబడ్డారు. ఆ సిపాయీలు కార్యోన్ముఖులు కావడానికి వీల్లేకుండా భయావేశంతో ఖడేరావ్‌బంద్‌గా నిలిచారు.

అక్కడక్కడా ఎవడో ఒక సిపాయి తుపాకి కాలుస్తున్నాడు. కానీ; అడపాదడపాగా ఒకటో అరో పేలుతోన్న తుపాకులు అశేషజన సందోహాన్ని ఆరికట్టగలవా? జనసమూహం పశుకోపంతో చెలరేగి దాని మీదకు హుమ్మని హుంకరించింది. మెషిన్‌గన్‌లు ఉపయోగించడం అసాధ్యమనిపించింది. ఆ మెషిన్‌గన్‌లు అధిష్టించిన మోటారుశకటాలు వీధినంతా ఆక్రమించేసినై. ఇక సిపాయీలు, ఆ సందునా, ఈ సందునా - పక్కదారులమీదా నిలవడానికి ఆస్కారం ఏర్పర్చుకోవాల్సిన అవస్థ పట్టింది. ఇంకా ఇంకా సిపాయీలు వస్తున్నారు. ఇక మేం ఆ జనసమ్మర్దంనుంచి బైటపడలేకపోయాం. గార్తువైట్ నా చేయి పట్టుకొని నిలవేశాడు. ఒక సౌధానికి ఎదురుగా మేం ఒదుక్కొన్నాం.

మెషిన్‌గన్‌లు, తమ కరాళవదన గహ్వారాన్ని తెరిచి ఆవులించేసరికి జనసమూహం వాటికి ఇరవైఐదు అడుగులకన్నా ఎక్కువదూరంలో లేదు. కానీ, ఆ అనంత మృత్యుజ్వాలలముందు సజీవంగా నిలవగలిగిందేమీ లేదు. జనమైతే సందడించారుగాని, ముందుకు తోసుకుపోలేక పోయారు. అది కుప్పకూలింది. గుట్టయింది. మరణించిన, మరణిస్తోన్న మహామానవతరంగజాలం అది. వెనకున్నవాళ్లు ముందుకుతోసుకున్నారు. మురికికాలువల్లోఉన్న జనసమూహం దూరదృష్టితో సర్వం పరీక్షించింది. క్షతగాత్రమైన స్త్రీపురుష సంఘం ఆ మహాభయంకరోత్తుంగ తరంగంమీద నెత్తురు కక్కుకొంటూ పడి, క్రిందకు జారిజారి, మోటారు శకటాలకూ, సిపాయీల కాళ్లకూ వచ్చి కొట్టుకుంటోంది. మరణావస్థలో గిజగిజలాడ్తోన్న మానవాళిని, సిపాయీలు బ్లాయ్‌నెట్లతో పొడిచారు. ఆ జనసమూహంలో ఒకడు ఒక్క ఉదుటున లేచి అమాంతం సిపాయి కంఠాన్ని పళ్లతో గావుపట్టు పట్టాడు. తర్వాత ఆ వ్యక్తీ, సిపాయీ చాపచుట్టగాపడి రక్తపంకంలోమునిగిపోయారు.

కాల్పుల గంద్రగోళం సమాప్తమైంది. పని పూర్తయింది. ఎదిరించి మీదకు దూకుదామనుకొన్న మూక ఆగిపోయింది. యుద్ధశకటాలు ప్రయా

ణించడానికి పీనుగపెంటల్లోంచి బాట కల్పించమని ఉత్తరువులు వచ్చినై. ఆ శవ వీచికాజాలం మీదనుంచి శకటసంచారం సాధ్యంకాదు. అందుకే పక్కవీధికి మళ్ళించి వెళ్లిపోదామనుకొన్నారు. అది జరిగేటప్పటికి, సిపాయీలు శకటచక్రాల కడ్డంగా ఉన్న శవాల్ని పక్కలకు లాగేస్తున్నారు. అది ఎట్లాజరిగిందీ తర్వాత తెలిసింది మాకు. అక్కడున్న ఇళ్లవరస తర్వాత ఉన్న ఒక సౌధంలో మా కామ్రేడ్సు సమకూడారు. కప్పులమీదనుంచి, భవనాలమీదనుంచీ వాళ్లు మార్గంచేసుకొని వచ్చివచ్చి, సరిగ్గా సిపాయిదండు మీదికి చేరారు. ఇకప్పుడు సాగింది ప్రతిమారణ సమరం.

హెచ్చరికా గిచ్చరికాలేకుండా సౌధోపరిభాగంనుంచి బాంబులవర్షం ప్రారంభించింది. చాలా సిపాయీలతోసహా మోటారుకార్లు ముక్కలు ముక్కలైనై. చావుతప్పి కన్ను లొట్టబోయినవాళ్లూ, మేమూ, వెనక్కు పిచ్చిపరుగు తీశాం. ఇంకొంచం దూరంలో ఉన్న మరో భవంతి మా మీద కాల్పులు సాగించింది. సిపాయీలు, తామంతకుముందు వీధుల్లో శవాల తివాసీ పరచారు. ఇప్పుడు వాళ్ళే, శవాల తివాసీగా ధరాతలాన్ని అలంకరించే వంతు వచ్చింది. నాకూ, గార్త్‌వైటుకూ అద్భుత జీవితాలున్నయ్. ఇదివరకు మాదిరిగానే ఇప్పుడూ ఒక ద్వారంలో ఆశ్రయం కల్పించుకొన్నాం. కానీ అతడీసారి మాత్రం ప్రమాదంలో పట్టుబడపోవడంలేదు. బాంబుల గర్జారావం సమసిపోగానే, అతడు తొంగిచూడడం ప్రారంభించాడు.

"మళ్ళీ మానవ సమూహం వెనక్కిమళ్ళి ప్రస్థానిస్తోంది. దీంట్లో చిక్కుపడకుండా బయటపడాలి మనం" అని హెచ్చరించాడు నన్ను.

చేయీ చేయీ పట్టుకొని, తూలుతూ, జారుతూ నెత్తురు మడుగైన కాలిబాటమీదగా ఒక్క పరుగుతీసి మూలకు తిరిగాం. అడ్డగోడ్డునేపడి ఇంకా పరుగెత్తుతోన్న కొందరు సిపాయిలు కనిపించారు మాకు. వాళ్ళకు ప్రమాదమేమీ సంభవించడంలేదు. మార్గం నిరాఘాటంగా ఉంది. అందుకని,

ఒక్క క్షణం ఆగి వెనక్కు చూశాం. ప్రజాప్రవాహం మెల్లగా వచ్చింది. గాయపడ్డవాళ్ళను చంపుతూ, చచ్చినవాళ్ల ఆయుధాలు కూడ చేరుకొని తాను ఆయుధధారణచేస్తూ అది హడావుడిలో సతమతమౌతోంది. మమ్మల్ని కాపాడిన యువక ఉద్యోగి మరణాన్ని మేం చూశాం. అతడు చాలా బాధతో తన మోచేతిమీదలేచి, తన ఆటోమెటిక్ పిస్టోల్ పుణ్యమా అంటూ ప్రాణవాయువుల్ని విడిచాడు.

ఒక స్త్రీ, క్షతగాత్రుడిమీద విరుచుకుపడి, కంఠాన్ని కత్తితో ఉత్త రిస్తోండగా, "ఉద్యోగంలో ఉన్నతస్థానంపొందే అవకాశం కాస్తా ఊడిపోయింది" అని గార్త్‌వైట్ ఒక్కనవ్వు నవ్వాడు. "పోదాందా. ఇది తప్పుడు మార్గం. ఐనా ఎట్లాగో బైటపడ్తాంలే." అన్నాడు.

ప్రశాంతంగాఉన్న వీధుల్లోబడి తూర్పుదిక్కుగా పారిపోయాం. వీధి దాటుతోన్నప్పుడల్లా, ఏ ప్రమాదం సంభవించినాసరేనని గుండెరాయి చేసుకొన్నాం. దక్షిణంగా, బ్రహ్మప్రళయంగా 'అగ్నిజ్వాలలు ఆకాశాన్ని ఆవరిస్తున్నయ్. మహాకార్మిక నివాసప్రాంతం అగ్నిదేవుడికి ఆహుతౌతోందని గుర్తించాం. చివరికి నేను పక్కబాటమీద పడిపోయా. ఉన్న కాస్త కూస్త ఓపికకూడా ఉడాయించింది. ఒక్కడుగుకూడా పెట్టలేను. నిస్సత్తువ నిలవేసింది. వేళ్ళన్నీ పోట్లూ సలపరింతలూ పుట్టుకువచ్చినై. ఐనా, సిగిరెట్టు వేళ్ళతో అటూ ఇటూ తిప్పుతూ, "నేను నిన్ను రక్షించాడానికి లేనిపోని రభసచేస్తున్నానని తెలుసు. కానీ అసలు పరిస్థితి తలా తోకా గూడా నాకు అంతుపట్టడంలేదు. ఇదంతా అగమ్యగోచరంగా ఉంది. ప్రతిదఫా బైటపడదామనుకోవడం, ఏదో ఆటంకంవచ్చి చప్పున వెనక్కుతిరగటం. ఇదీ మన అవస్థ. ఆ మార్గంనుంచి మనం బైటికి వెకలించుకోని ఇక్కడకు వచ్చిపడ్డాం గాని, అట్టే దూరంకూడా రాలేదు. రెండు భవంతుల వరుసలే అక్కడికీ ఇక్కడికీ అడ్డం. శత్రుడూ మిత్రుడూ కలగా పులగమైనారు. ఇదొక

ప్రళయం. ఆ సౌధాల్లో ఎవరున్నారో నీవు చెప్పలేవ్. ఎవళ్ళో తేల్చుకోడానికి ప్రయత్నించు. నీ నెత్తిన బాంబొకటి దూకుతుంది. ప్రశాంతంగా నీదారినబడి నీవు పోవడానికి ప్రయత్నించేసి చూడు. ప్రజాప్రవాహంలో ఇరుక్కొని మెషిన్‌గన్‌లకు ప్రథమ కబళమౌతావ్. లేదూ, బడితొత్తుసైన్యాల్లోపడి, ఏదో ఇంటికప్పుమీదఉన్న నీ సొంత కామ్రేడ్సు చేతుల్లోనే హరీ అంటావ్. అదీ ఇదీగాకపోతుంది. ఈ ప్రజాప్రవాహం నీతోబాటేవచ్చి ఆఖరికి నిన్నుగూడా చంపేస్తుంది.'' అని అంటోన్న గార్ట్‌వైట్ మాటలకు నవ్వలేకుండా ఉండలేకపోయా.

అతడు విచారంగా తలూపుతూ, సిగిరెట్టు ముట్టించి నా పక్కగా కూర్చున్నాడు.

''మరిప్పుడు నాకు ఆకలిమంటలు దహించుకుపోతున్నయ్. ఆఖరికి రాళ్ళు పెట్టినాసరే హరాయించుకొనే లెక్కలోఉన్నా.'' అన్నాడు.

మరుక్షణంలో అతడు మళ్ళీలేచి గులకరాయికోసం వీధిలో దేవులాడ్తున్నాడు. దాన్ని పట్టుకొనివచ్చి, మావెనకాల ఉన్న స్టోరు కిటికీకి విసిరికొట్టాడు. కిటికీలో ఏర్పడ్డ మార్గంద్వారా నన్ను లోపలికి దించుతూ ''ఇది అడుగు నేల. ఉపయోగంలేదు. ఐనా మనం ఇంతకన్నా మరోమంచి మార్గం ఏంచూస్తాం. నీవొక కూర్కుతీయ్. నేను శత్రువుల గుట్టుమట్టులన్నీ పరిశోధించివస్తా. నేనీసారి లక్షణంగా తప్పించుకువస్తా. కానీ నాకు కావలిసిందంతా తగిన సమయం. ఎంత వ్యవధివుంటే అంతనయం - వ్యవధితోబాటు కాస్త నంజటానికికూడా ఏదైనా ఉందో......'' అన్నాడతడు.

మేం లోపలికి దిగినగది గుర్రపుసామాన్ల స్టోరు. గుర్రపు చర్మాలు తీసుకువచ్చి నాకు పక్కగా ఏర్పాటుచేసి దానిమీద నన్ను పడుకోబెట్టాడు. నాకు తలపగిలిపోయే తలనొప్పికూడా వస్తున్నదేమో హాయిగా కళ్ళుమూసుకోని నిద్రపోదామని అభిలాషపడ్డా.

"తిరిగివస్తా. మోటారుకారు తీసుకువస్తానని చెప్పలేననుకో. ఏవిధంగానైనాసరే కొంత ఆహారంమాత్రం తప్పకుండా పట్టుకువస్తా." అన్నాడు వెళ్ళుతూ వెళ్ళుతూ.

మూడేళ్ళకుగాను గార్త్‌వైట్‌ను నేను ఆఖరిసారి చూడడం అదే. ఊపిరి తిత్తుల్లో ఒకగుండు, మెడ కండరాల్లో ఒకగుండు దూసుకుపోయినందున, అతడు తిరిగి ఇక్కడకు రావడానికి బదులు, ఆస్పత్రిలో చేరాడు.

## —౨౪

ఇరవయ్యో శతాబ్దపురైల్లో ప్రయాణించిన గతరాత్రినుంచీ నేను నిద్రపోలేదు. నిద్రావశ్యకతా, నిస్సత్తువా కలిసినయ్యేమో, నాకు గాఢనిద్ర పట్టింది. మొదటిసారిగా నిద్రనుంచి మేల్కొనేటప్పటికి బాగా చీకటి పడింది. గార్త్‌వైట్ తిరిగి రాలేదు. నా గడియారం ఎక్కడ్నో పోయింది. టైమెంతైందో కూడా తెలియలేదు. అట్లాగే కళ్లుమూసుకోని పడుకుంటే, దూరంగా ఎక్కడ్నో కాల్పులు సాగుతోన్న ధ్వనులు మందమందంగా వినిపిస్తున్నయ్. మారణాయుధాలు, మారణహోమం మానుకొన్నట్టు లేదింకా. మెల్లిగా స్టోరు ముందుభాగానికి పాకిపోయా. మహోజ్వలజ్వలనజాలలు వియత్పథమంతా వెలుగులు విరజిమ్మిన కారణంగా, వీధంతా పట్టపగలుగా ఉంది. ఆ వెలుగులో అచ్చు విషయాల్ని అనాయాసంగా చదివేయవచ్చు. చాలా సౌధాల కవతలగా చిన్న చేతిబాంబులు పగిలిన శబ్దాలూ. మెషిన్ గన్‌ల భయంకరారావాలూ వినిపిస్తున్నయ్. ఇంకా దూరంనుంచి మారణాయుధాల భీకరధ్వానాలు చెవినపడుతున్నయ్. మళ్లీ పక్కమీదకుపోయి నిద్రతీశా.

ఈసారి నిద్రలేచేటప్పటికి, నామీద బాలభాస్కరుని బంగారు కిరణాలు ప్రసరిస్తున్నయ్. అది రెండోరోజు ఉషస్సమయం. స్టోరు ముందు

భాగానికి పాకిపోయా. ధూమపటలం మంటల తీగెల్తో మింటికెగబాకు తోంది. ఎదుటివీధిలో ఎవడో ఒక నికృష్ట బానిసీడు తూలుతూ నడుస్తు న్నాడు. ఒక చేత్తో నడుందగ్గరగా గట్టిగా నొక్కిపట్టుకొన్నాడు. అతడు ముందు పోతుంటే వాలికలుగట్టి, నెత్తురు అతడి వెనకనే పరుగెత్తుతోంది. అతడి నేత్రాలు అన్ని వైపులూ ఆలోకించినై. ఆ కళ్లల్లో అమితంగా భయం ఆక్రమించింది. నన్నొకసారి అకృణ్ణించి చూచాడు. వేటాడబడు తోన్న జంతువులో ఉండే మూకావేదన అతడి మొగంలో ద్యోతకమా తోంది. నన్ను చూచాడతడు. అతడికీ నాకూ బాంధవ్యమేమీలేదు. అతడి బాధైనా సానుభూతితో కనీసం అర్థంచేసుకొందామనిగూడా అనిపించలేదు నాకు. బాగా భయపడిపోయాడు. తన శరీరపు తొడుగును ముందుకీడ్చుకు పోయాడు. మొత్తం ప్రపంచంలో తనకు సహాయం లభిస్తుందని ఏకోశానా అనుకోలేదతడు. సంఘూధినేతలు వేటాడుతోన్న బానిసలతొంబలో అతడూ ఒక బానిస. ఉన్న ఆశల్లా ఒక్కటే. గట్టిగా కావాలనుకొంటున్నదీ అదే. కంత కనపడితేచాలు కాళ్ళూ తలా దూర్చి గప్‌చిప్‌గా శతుృవుకంట బడ కుండా దాక్కుందామని ఊహ. ఇంతలోకే మూలనుంచి వైద్యసహాయక శకటం వస్తోన్న ధ్వనైంది. అందులో ఎక్కించుకొంటారనే ఆశతో అర్రులు చాచాడు. వైద్యసహాయకశకటాలున్నది అతడివంటివాడికోసంకాదు. బాధతో మూల్గుతూ ఒక ద్వారంలో పడిపోయాడు. ఒక నిమిషమైన తర్వాత మళ్లీ లేచాడు. ఇక తప్పదనుకొన్నాడు. తన బరువంతా ఒంటి కాలిమీద నేపడేసి కుంటుకుంటూ బైలుదేరాడు.

నేను మళ్ళీ నా పక్కమీదకుపోయి గార్తువైట్‌కోసం గంటసేపు నిరీక్షించా. తలనొప్పిపోలేదింకా. అంతకంతకూ అధికమౌతోందికూడా. పట్ట బలవంతంగా కళ్ళుతెరిచి చూడగల్గుతున్నా. కళ్ళుతెరిచి చూస్తున్నందువల్ల బాధమరీ దుర్భరమైంది. తలలోఉన్న నరం విపరీతంగా కొట్టుకొంటోంది.

ఈ ప్రవాహమంతా ఎక్కడికిపోయిందో ఏమైందోగూడా నాకు తెలియదు. తెలియజెప్పిన వాళ్లూ లేరు.

ఒకగుంపును సిపాయీలు వెంటబడి తరుముతున్నారు. ఆ గుంపులో చిక్కుకోకుండా తప్పించుకోడానికి, ఒక దుకాణం కిటికీ బద్దలుకొట్టి దాంట్లోదూరి తలదాచుకొన్నా. ఈ విషయం నాకు మసక మసగ్గా జ్ఞాపకం ఉంది. మరో ఉలుకూ పలుకూలేని వీధిలో నాకు దగ్గరనే ఒక బాంబు బద్ద లైంది. వీధంతా పైనుంచి కిందదాకా పరకాయించి చూచా గాని ఒక్క మానవాకారం నాకు కనబడలేదు. ఒక రైఫిల్ ఆవులింతతో, మళ్లీ నా మనస్సు చైతన్యంలోకి వచ్చిపడింది. కార్లోనుంచి ఒక సిపాయి నన్ను కాల్చాడని అర్ధంతరంగా తెలుసుకొన్నా. అతడి గురి తప్పిపోయింది. మరుక్షణంలోనే కేకలువేస్తూ, రహస్య సంకేతాలు చేశా. నేను మోటారుకార్లో ప్రయాణం చేస్తున్న సంగతికూడా అస్పష్టంగానే జ్ఞాపకం ఉంది. ఈ నా ప్రయాణా నికి ఒక విస్పష్టదృశ్యం ఆటంకమైంది. నా వెంటనే కూర్చున్న సిపాయి రైఫిల్ కాల్చడంతో నా కళ్లు తెరిపుళ్లు పడ్డయ్. నేను వెల్ వీధిలో ఉన్న ప్పుడు పరిచయమైన 'జార్జిమిల్ ఫర్డు' పక్క బాటమీద నెమ్మదిగా కుప్ప కూలిపోవడం గమనించా. అతడు క్రుంగిపోతుండగానే సిపాయి మరోసారి కాల్చాడు. మిల్ఫర్డు మరింతై, నేలమీద దభీమని పడిపోయాడు. సిపాయి ఆనందంతో పెద్దగా నవ్వాడు. కారు కదిలిపోయింది.

నాకు గాఢనిద్ర పట్టింది. నా పక్కనే ఎవరో ఒక వ్యక్తి అటూ యిటూ నడుస్తూండటంచేత నిద్రాభంగమైంది. మెలకువ వచ్చిన దగ్గర్నుంచీ జరిగిన సంగతులు మాత్రమే నాకు బాగా అర్ధమైనై. అతడి మొగంమీద అలసట గోచరిస్తోంది. నుదుటిమీదనుంచి ముక్కుమీదకు చెమట దిగజా ర్తోంది. అతడు ఒక చేతిని రొమ్ముమీద రెండోచేత్తో నొక్కిపట్టుకొన్నాడు. నడుస్తోంటే నేలమీద నెత్తురు వర్షిస్తోంది. బడితొత్తుసైనికుల దుస్తుల్లోఉన్నా

డతడు. బైట బాంబులు గర్జిస్తున్నయ్. పరస్పరంగా పోరాటం సాగిస్తోన్న రెండు సౌధాల్లో ఒకదాంట్లోఉన్నా నేను.

గాయపడ్డ సైనికుడికి కట్టుకట్టడానికి వైద్యుడు వచ్చాడు. అప్పుడు మధ్యాహ్నం రెండుగంటలని తెలుసుకొన్నా. నా తలనొప్పి యింకా తగ్గుముఖం పట్టలేదు. డాక్టరు నా శిరోబాధ ఉపశమించడానికి శక్తిమంతమైన మాత్ర ఒకటిచ్చాడు. మళ్ళీ నిద్రపట్టింది. మళ్ళీ మెలకువవచ్చి చూచేటప్పటికి నేనొక సౌధాగ్రంమీద ఉన్నానని తెలుసుకున్నా. పోరాటం ఉధృతం తగ్గింది. కోటమీద బెలూన్ దాడికోసం నిరీక్షిస్తున్నా. ఎవరో ఒక వ్యక్తి చెయ్యి నా నడుం చుట్టేసింది. నేనతని కౌగిలికి జారగిలబడ్డాను. నే నానుకున్న వ్యక్తి ఎర్నెస్టని తర్వాత తెలిసింది. ఆయన జుట్టూ, కనుబొమ్మలూ గుర్తుపట్టకుండా ఎంతమారిపోయినయ్యాని ఆశ్చర్యపడ్డా.

ఆ భయంకర నగరంలో మేం ఉభయులం అదృష్టవశాత్తు అనుకోకుండా కలుసుకొన్నాం. నేను న్యూయార్క్ విడిచిపెట్టానన్న విషయం ఆయన అసలు ఊహించనేలేదు. నిద్రపోతుండగా నా గదిలోకి వచ్చినప్పుడు మొదటిసారి ఆయన చూచి, ఆ పడుకొన్నది నే నేనని నమ్మలేక పోయాడు. చికాగో కమ్యూన్ ఘట్టాలింకా కొన్ని చూచా. బెలూన్ దాడికోసం ఎదురుచూచిన తర్వాత నన్నాయన సౌధ మధ్యభాగంలోకి తీసుకుపోయాడు. అక్కడ ఆ సాయంత్రం, రాత్రీ హాయిగా నిద్రపోయా. మూడ్రోజుల్లో మేం అక్కడే కాలక్షేపం చేశాం. ప్రభుత్వానుమతిపొంది ఎర్నెస్టు నాకోసం ఒక కారు సంపాదించాడు. ఉభయులం చికాగోకొక సలాంకొట్టి వెళ్ళిపోయాం.

నా తలనొప్పి తగ్గిపోయింది. ఐనా, శారీరకంగా, మానసికంగా మాత్రం పూర్తిగా అలిసిపోయా. కార్లో ఎర్నెస్టుమీద వాలి పడుకొన్నా. పట్టణంనుంచి కారు బైటపడేయడానికి ప్రయత్నిస్తున్న సిపాయిల్ని నిశ్చిం

తగా నిరీక్షిస్తున్నా. ఇంకా నగరంలో అక్కడక్కడా పోరాటం సాగుతోనే ఉంది. అక్కడక్కడా కొన్ని జిల్లాలింకా కామ్రేడ్స్ స్వాధీనంలోనే ఉన్నయ్. కానీ, ఆ జిల్లాలచుట్టూ ఎక్కువగా సిపాయి సిబ్బంది కాపలా వేసింది. అనేకప్రదేశాల్లో కామ్రేడ్స్ ఈవిధంగా శత్రువ్యూహంలో చిక్కుబడిపోయారు. ఒకవంక కామ్రేడ్స్‌ను లొంగదీసుకొనే ఉద్యమం సాగుతోంది. లొంగిపోవడమంటే మృత్యువుకు స్వాగతంపల్కడమే. ఎందుకంటే లొంగినా శత్రువులు నిర్దాక్షిణ్యంగా హింసిస్తారు. అందుకే ఆఖరివ్యక్తివరకూ అందరూ అచంచలంగా వీరోచితంగా పోరాడారు. చాలా సౌధాలు వారం రోజులకుపైగా ప్రతిఘటించి పోరాడినై. అందులో ఒక సౌధం పదకొండు రోజులవరకూ శత్రువుకు లొంగకుండా అప్రతిహతంగా నిలవగలిగింది. కామ్రేడ్సున్న ప్రతిసౌధం ఒక కంచుకోటే. బడితొత్తు సైన్యాలు క్రిందనుంచి ఒక్కొక్క అంతస్థుచొప్పున పోరాడుతూ పైకి పోవాల్సివచ్చిందిగాని, అమాంతంగా సౌధంసౌధంగా ఎన్నడూ వాళ్ళ స్వాధీనంకాలేదు. అది మహా భయంకరమైన పోరాటం. ఎవళ్ళకీ ఎవఝ్వా అంతంతమాత్రంగా చోటు పెట్టలేదు. ఈ పోరాటంలో విప్లవకారులు ,సౌధాల పైభాగాల్లో ఉండడంకూడా ఒక సదవకాశం. విప్లవకారులందరూ తుడిచిపెట్టుకుపోయినప్పటికీ జరిగిన నష్టం కేవలం ఒక పక్షానికే జరగలేదు. చికాగో వీరశ్రామిక వర్గం తన శపథ నిర్వహణలో లేశంకూడా సడలిపోలేదు. తామెంతమంది మరణించారో, శత్రువుల్నికూడా అంతమందినీ హతం చేశారు.

పోరాటం సాగుతోన్న ప్రదేశాల దగ్గరకి మా కారు పోయినప్పుడల్లా అక్కడ పహారాకాస్తున్న వాళ్లు మమ్మల్ని వెనక్కు మళ్ళించారు. ఒకసారి మేం, కామ్రేడ్సుకు బలమైన స్థావరాలున్న చోటుగుండా పయనించాల్సిన అవసరం కలిగింది. ఆ ప్రదేశమంతా దహనజ్వాలల్లో దగ్ధపటలమైంది. కూలిన, కూలుతోన్న సౌధాలమధ్యలోనుంచి మా కారు పయనిస్తుంటే రెండు దిశల

నుంచీ మాకు దారుణ యుద్ధగర్జారావాలు వినిపించినై. వీధులన్నీ కూలిన సౌధాలతో నిండి అడ్డదిడ్డంగా ఉన్నందున, మేం 'ఆసావాదితో బ్రహ్మా'గా పోవాల్సి వచ్చింది. కొన్నిచోట్ల దుర్గమ శిథిలప్రాంతాల్లోనుంచి కూడా ప్రయాణించాం. అందుకే మందగించింది మా గమనం. గిడ్డంగులు, కార్మిక నివాస ప్రాంతాలూ; యంత్రాగారాలూ అన్నీ అగ్నిజ్వాలలకాహుతై నల్లటి పొగలు పుక్కిలిస్తున్నయ్. మాకు కుడిప్రక్కగా ఒక వినీలస్నిగ్ధధూమపటలం గగనతలాన్ని కౌగలించుకోని కారుచీకట్లు కక్కింది. ఫుల్‌మన్‌పట్టణం బూడిదకుప్పయిందని మా కారు నడుపుతోన్న సిపాయి చెప్పాడు. కావల సిన సమాచారమంతా సేకరించి అతడు మూడోరోజు సాయంత్రం అక్కణ్ణుంచి కారు నడిపాడు. సరకులగిడ్డంగులున్న ఒక జిల్లాలో కూలిన గోడలు గల ఒక సౌధాన్ని చుట్టి పయనిస్తోన్న మా కారు మృతజీవి తరంగం అడ్డుకొన్నందున ఆగిపోవాల్సివచ్చింది. మహాసాగరంనుంచి ఉవ్వెత్తుగా పొంగి వచ్చిన కెరటం మాదిరిగా సాక్షాత్కరించింది మాకు. జరిగిన విషయం సర్వం మాకు గ్రాహ్యమైంది. ప్రజాసందోహం మలుపు తిరిగేటప్పటికి ఎట్ట ఎదుటగా మిషన్‌గన్‌లు ఎదురై ఒక్కుమ్మడిగా గర్జించి మొత్తాన్ని పొట్ట పెట్టుకున్నాయి. సిపాయీలుమాత్రం మిగిలారుగనుకనా. వాళ్ళూ మరణించారు. వాళ్ళమధ్యలోకూడా ఏదో ఒక బాంబు అకస్మాత్తుగా బ్రద్దలై ఉంటుంది. ఎందుకంటే, మరణించిన మరణిస్తోన్న వాళ్ళొక మహాతరంగమై మార్గనిరోధకులయ్యేదాకా, ఈ ప్రమాదం ఉత్సాహవంతులైన సజీవుల్ని ముందుకురికించింది. భగ్నమైన మోటార్లు శకటంగులనైనా, కిందా బానిసలూ, సిపాయీలూ ఒకళ్ళపక్క ఒకళ్ళుగా చిందరవందరగా కుప్పకూలి పడున్నారు.

కార్లోనుంచి ఎర్నెస్టుకిందకొక్క ఉరుకు ఉరికాడు. నాలుచోక్కా చాటున దాక్కున్న పరిచితమైన భుజాలు, బాగా నెరిసిన నెత్తిమీది జుట్టూ ఆయన చూపును ఆకర్షించినై. ఆ వ్యక్తిని నేను చూడలేదు. ఆయన మళ్ళీ నా దగ్గరకు వచ్చి కూర్చోని కారుపోతుండగా, "అతడు బిషప్ మూర్‌హౌస్" అని చెప్పేదాకా నాకు తెలియలేదు.

తొందరగా మేం కళ్లపండుగ్గా పచ్చపచ్చగా ఉన్న భూభాగానికి వచ్చాం. కారు పొగలు క్రమ్మిన గగనభాగంవేపు తిరిగి ఆఖరిసారిగా చూచా. చాలా దూరంలో ఎక్కణ్ణో ఒక బాంబు బ్రద్దలైనధ్వని మందమందంగా వినిపించింది. అప్పుడు నేను ఎర్నెస్టు హృదయంలో తలదూర్చి, ఆశయ విఫలతకు విలపించా. నన్ను చుట్టేసిన ఎర్నెస్టు బాహులత అనురాగామృతాన్ని అందించింది.

"హృదయేశ్వరీ! ఈసారి విఫలతచెందాం.' కానీ ఈ అపజయం శాశ్వతంకాదు. మనం చాలా నేర్చుకొన్నాం. అనుభవపూర్వకమైన విజ్ఞానంతో, క్రమశిక్షణతో మరింత బలిష్టమై రేపు మళ్ళీ మన ఉద్యమం తలెత్తుతుంది." అన్నాడు.

మా కారు రైలుస్టేషనుకువచ్చి ఆగింది. ఇక్కడ మేం న్యూయార్కుకు పోయే రైలెక్కాలి. మేం రైలుకోసం ఎదురుచూస్తూ ప్లాట్‌ఫారం మీద నిలబడ్డప్పుడు, పెద్దగా గర్జిస్తూ మూడు రైళ్లు చికాగోకు వెళ్ళినై. వాటినిండా చీలికలు పేలికలు ధరించిన అగాధ పతిత అనాథజనసందోహం క్రిక్కిరిసి ఉంది.

"చికాగో బానిసలంతా చంపబడ్డారుగదూ. అందుకని, శిథిలమైన చికాగోను పునర్నిర్మించడానికిగాను బానిసల తండాల్ని తరలిస్తున్నారక్కడికి" అన్నాడు ఎర్నెస్టు.

౨౪

మేం తిరిగి న్యూయార్క్‌కు చేరిన కొన్ని వారాల తదనంతరంగాని, ఆశయానికి జరిగిన ఘోర విపత్సంపూర్ణ స్వరూపం స్పష్టంగా మాకర్థంకాలేదు. మహాదారుణమైన పరిస్థితి అది. అదిరక్తగాథ. దేశంలో నాల్గుమూలలా అక్కడక్కడా చెదురు చెదురుగా బానిసల తిరుగుబాట్లూ, హత్యాకాండలూ సాగినై. మృతవీరులు అసంఖ్యాకంగా, అతి పటిష్ఠంగా అభివృద్ధి

చెందారు. ప్రతిచోటా లెక్కలేనన్ని ఉరిశిక్షలు ఉట్టిపడ్డయ్. నిర్దాక్షిణ్యంగా వేటాడబడ్డ కాందిశీకులూ, బహిష్కృతులతో కొండలూ, బయళ్ళూ నిండిపోయినై. ఉక్కుపాదం జరిపిన ప్రాణాల వేలంపాటకు గురైన క్రామేడ్సుతో మా రహస్యాశ్రయాలన్నీ సంపూర్ణమైనై. ఉక్కుపాదం, తన గూఢచారులద్వారా సమాచారాన్ని సేకరించి, మా రహస్యాశ్రయాల్లో చాలా వాటిమీదకు తన సిపాయిమూకను దండయాత్రకు తరిమింది.

చాలామంది క్రామేడ్సును నిరాశా నిస్పృహాలు ఆవరించినై. అందుకే వాళ్ళంతా దారుణ విజృంభణోద్యమం ప్రారంభించారు. వాళ్ళ ఆశలన్నీ నిరాశలు కావడంచేత, నిస్పృహత 'యశోవామృత్యుర్వా' అనే మంత్రోపదేశం చేసింది. ఏమైతే అదైందని తెగించారు. మా సంస్థలకు సంబంధించని, దారుణ విప్లవసంస్థలు (టెర్రరిస్టు) చాలా తలెత్తి మాకు మరింత కష్టాన్ని కొనితెచ్చినై. తప్పుడు మార్గంపట్టిన ఈ వ్యక్తులు కావాల్సనే తమ జీవితాల్ని ఆహుతిచేశారు. మా వ్యూహాల్ని తరచుగా విధ్వంసం చేశారు. మా సంస్థలకుకూడా ఉపద్రవం కలిగించారు.

కామ్రేడ్సును గాలించి ఏరిపారెయ్యడంకోసం సాంఘిక నిర్మాణ స్వరూపాన్నంతా పటాపంచలుచేసి, బడితోత్తుసైన్యాల్ని, కార్మికకులాల్ని, తన అన్ని రహస్యశాఖల్నీ సమీకరించి ఏకోన్ముఖంచేసి, బ్రతుకో చావో అనే పట్టుదల్తో ఉక్కుపాదంకూడా తెగించి, ఏమాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా విరుచుకుపడి, తనకు సంభవిస్తోన్న దారుణానుభవాలన్నీ మౌనంగా భరిస్తూ, తన యుద్ధశాఖలో ఏర్పడ్డ ఖాళీలన్నీ ఎప్పటికప్పుడే భర్తీచేసుకొంటూ, టెర్రరిస్టులతోపాటే, ఉద్ధృతంగా విజృంభించింది. ఎర్నెస్టూ తదితర నాయకులూ భుజం భుజం కలిపి విప్లవసైన్యాల్ని పునరుద్ధరించి పటిష్టం చేయడానికి తీరని తీవ్రకృషిలో నిమగ్నులైనారు. ఆ మహోద్యమ కృషి పూర్తిగా అర్థంకావాలంటే, ఆ ఉద్యమాన్ని స్వీకరించి...............

ఇక్కడితో ఎలిస్ ఎవర్‌హార్డ్ వ్రాతప్రతి ముగిసింది. వాక్యమధ్యంలో అర్థాంతరంగా ఆగిపోయింది. బడితొత్తుసైన్యాలు తరుముకు వస్తున్నాయి అన్న హెచ్చరిక ఆమెకు ముందుగా అంది ఉండాలి. అట్లా గాకపోతే ఆమె పారిపోకముందు లేక పట్టుబడకముందే, ఈ వ్రాతప్రతిని సురక్షితప్రదేశంలో దాచి ఉంచడానికి తగిన సావకాశం ఉండేదేగాదు. ఆమె కథనమంతా పూర్తిగాక పూర్వమే మరణించడం నిజంగా చాలా విషాదకరమైన విషయం. ఆమె కథనమే పూర్తైఉంటే, ఏడు శతాబ్దాలపాటు, ఎర్నెస్టు ఎవర్‌హార్డ్ ఉరి ఎట్లా సంభవించిందో తెలియకుండా ఆశ్చర్యనిమగ్నుల్ను చేసిన ఆ సమాచారం విస్పష్టమై మన మనస్సుల్లో ఉన్న మబ్బుతెర తొలిగిపోయిఉండేది.





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B187 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 171 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | 346 |
| లేని పేజీలు | 1to174,337,338 |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | prateyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నో |
| పరిస్థితి | Good |